

మహాత్మపూర్ణిమ



ఆశలం-


| | | |
|---|---|---|
| ఆరాటంలో (అవార్డు నవల) | * శ్రీమతి షీలా శివరామ్ | 17 |
| పచ్చపావడా | * కె. లలితా చలం | 126 |
| న్యాయం పవిత్రమైనది | * కంఠంనేని రాధాకృష్ణమూర్తి | 138 |
| ప్రశ్న (అవార్డు కథ) | * సి. యస్. రావు | 142 |
| నేలమీది నక్షత్రాలు | * ఎలక్ట్రిన్ | 150 |
| రంగులు | * పాలడుగు వెంకటేశ్వరరావు | 153 |
| స్నేహమయి (సీరియల్) | * యద్దనపూడి సులోచనారాణి | 165 |
| బోణీ | * ముప్పిరాల శ్రీధరమూర్తి | 171 |
| రైలు | * పవని. రా. భానుమూర్తి | 173 |
| కాంచన కుటీరం (సీరియల్) | * సి. యస్. రావు | 177 |


ముఖచిత్రం : ఆశ్వీజ పూర్ణిమ

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

### స వ ర ణ

80వ పేజీలో రెండో పేరాగ్రాఫ్ మొదటి పేరు నారాయణ బదులు శంకరంగాను, 6వ పేరాలో మొదటి పేరు శంకరం బదులు నారాయణగాను చదవ ప్రార్థన.

# మీ ముద్దు పాపాయికి




# ముచ్చటైన ఆహారం

భారతదేశపు పసిపాపలకు అనుకూలంగా ఉండేట్లు ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమ అభివృద్ధి కార్పొరేషన్ లిమిటెడ్ వారిచే ప్రత్యేకంగా తయారుచేయబడింది. తల్లిపాలవలె తియ్యగా ఉండేట్లు తయారుచేయబడింది. సులభంగా కలుపవచ్చు. తేలికగా జీర్ణం అవుతుంది. కన్నతల్లి కలలపంట కమ్మనయిన విజయస్ప్రే.



రుచికరమైన విజయస్ప్రే పుష్టికరమైనది తేలికగా జీర్ణం కాగలదు మీ పాప ఆరోగ్యానికి డాక్టరు ఇవ్వాలనుకున్న పోషక పదార్థాలన్నిటినీ విజయస్ప్రే సమకూర్చగలదు అంటే మాంసకృత్తులు ఖనిజ పదార్థాలు పిండిపదార్థాలు మరియు విటమిన్లు తల్లిపాలలాగనే తియ్యనైనది విజయస్ప్రే మీ శిశువు యొక్క జీర్ణశక్తికి అనువైనది నెమ్మది నెమ్మదిగాను క్రమంగాను విజయస్ప్రే పుష్టిని చేకూర్చి 6 మాసముల తర్వాత మీ శిశువు ఘన పదార్థాలను జీర్ణం చేసుకోగలిగే స్థితికి జీర్ణశక్తిని శరీర సౌష్ఠవాన్ని నిర్మాణం చేయగలదు

అంతర్జాతీయ ప్రమాణాలకు అనుగుణంగా తయారు చేయబడిన శిశు ఆహారం విజయస్ప్రే తయారు చేయడం ఎంతో సులభం






## విజయస్ప్రే

**కన్నతల్లి కలలపంట కమ్మనయిన విజయస్ప్రే**

అమ్మకందార్లు స్పెన్సర్ & కం. లిమి.

FDS APDDC 2748 A TEL

## సెప్టెంబరు నెల క్విజ్

### సమాధానాలు

1 — సి    2 — సి    3 — సి

4 — సి    5 — సి

6. గ్రేట్ బ్రిటన్ లేదా ఇంగ్లాండ్   7. కందుకూరి వీరేశలింగం   8. ఫ్రెడ్రి
9. 15%   10. గూడూరు.

1. పి. రామమోహనరావు, గుడివాడ, 2. ఎమ్. ఎమ్. ఎమ్. శర్మ, గుడివాడ, 3. జె. రవి, తిరుపతి, 4. పి. శివరాజు, కందుకూరు, 5. టి. వెంకట నాగరాజు, కందుకూరు, 6. ఎన్. నాగేశ్వరరావు, ఒంగోలు, 7. ఎన్. వి. చలపతిరావు, గుంటూరు, 8. పి. రవీంద్ర ప్రసాద్, హైద్రాబాద్, 9. ఇ. సదాశివ చౌదరి, తెనాలి, 10. జి. సుశీలారెడ్డి, హైద్రాబాద్, 11. ఎమ్. ప్రసాద్, గుంటూరు, 12. ఎన్. శ్రీనివాస్, కరీంనగర్, 13. పి. శ్రీరామిరెడ్డి, హైద్రాబాద్, 14. వై. మల్లేశ్వరరావు, పలాస, 15. పి. సుగుణ, పీలేరు, 16. ఆర్. శ్రీరాం, హైద్రాబాద్, 17, వి. బాలసుబ్రమణ్యశర్మ, పొన్నూర్.

ఆల్ కరెక్టు సమాధానాలు పంపిన పై పదిహేడుగురికి రూ. 6.88 చొప్పున పంచటమైంది.

## గమనిక

దీపావళి యువ ప్రత్యేక సంచిక వెలువడే సందర్భంగా 'క్విజ్', భావపరిచయ పోటీ నిమిత్తం పాఠకులకు ఇచ్చే కాలవ్యవధిలో ఏర్పడే ఇబ్బందుల దృష్ట్యా ప్రస్తుతానికి ఈ శీర్షికలను ఆపుచేస్తున్నామని తెలియబరుస్తున్నాం.

ఎడిటర్, యువ

## అక్టోబరు నెల భావపరిచయ పోటీ

### బహుమతి పొందిన వ్యాఖ్య

మానవుని పరధ్యానం - మార్జాలానికి పరమాన్నం

— బి. సరోజినీసింగయ్య, హైదరాబాద్-36.

# ౧౯౯౦ చిత్రవాణి అవార్డులకు
# న్యాయనిర్ణేతలుగా వ్యవహరించినవారు



శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి



శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు



శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ

# 1978 చక్రపాణి అవార్డు గ్రహీతల పరిచయాలు

## నవలలు

### మొదటి అవార్డు: "ఆశల ఆరాటంలో..."

**—శ్రీమతి షీలా శివరామ్**



పూర్తి పేరు : తెంజర్ల శ్రీలక్ష్మి కామేశ్వరి. స్వస్థలం: కృష్ణాజిల్లా గుడివాడ. మచిలీపట్టణంలో బి.ఎస్సి. వరకు విద్యాభ్యాసం. ప్రస్తుత నివాసం శ్రీవారి ఉద్యోగరీత్యా టిస్కో మైన్స్ వున్న బీహారులోని నవాముండి.

1972 'ఆంధ్రప్రభ' దీపావళి కథలపోటీలో 'చివరిమలుపులో' కథకి ప్రథమ బహుమతి లభించింది.

యువలో ప్రచురింపబడిన 'భ్రమర', 'నిరీక్షణ' నవలికలు పుస్తకరూపంలో వెలువడ్డాయి.

నా రచనలు తరచుగా యువలోనూ, అరుదుగా మిగిలిన పత్రికల్లోనూ వస్తూవుంటాయి అంటారు.

### రెండో అవార్డు: 'ముడిపడని బంధం'

**—శ్రీ ఏ. వి. సత్యనారాయణరావు**

యం.ఏ.,యం.ఫిల్., (ఉస్మానియా)



జననం: 1944

ములుకనూరు (కరీంనగర్ జిల్లా) స్వగ్రామం. విద్యాభ్యాసం: స్వగ్రామం, వరంగల్లు, హైద్రాబాదుల్లో. 1968-69 సంవత్సరాల్లో ఢిల్లీ ఉద్యోగం వెంట దేశమంతా తిరిగి ఆర్థికాంశాలలో పరిశోధన.

జనవరి 1970 నుండి ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రభుత్వపాలన విభాగంలో అధ్యాపకులు. సిరయ్య పదాలు ( 1963 ) ప్రచురించిననాటి నుండి రచనా వ్యాసంగంపై మక్కువ. బొమ్మలు గీయడం హాబీ.



## మూడో అవార్డు: 'ధరిత్రి'

**—శ్రీ వేమకోటి సీతారామశాస్త్రి**

వయస్సు: 39 సం॥రాలు. జననం-కర్నూలు. కాకినాడ, బొబ్బిలి, పాలకొండ లలో చదువు. సుమారు రెండు వందల కథానికలు, నూట యేభైకి పైగా వ్యాసాలూ, ఏభైకి పైగా గేయాలు, అన్ని ప్రసిద్ధ తెలుగు పత్రికం లోనూ ప్రచురితమయ్యాయి. కొన్ని బహుమతులు పొందాయి.

వెలువడిన నవలలు : బ్రతుకుబాటలో జీవన రాగం; ముక్తాఝురి.

శ్రీకాకుళంలో ఎలక్ట్రిసిటీ రెవెన్యూ ఆఫీసరు వారి కార్యాలయంలో ఉద్యోగం.

# కథలు

## మొదటి అవార్డు: 'ప్రశ్న'

**—శ్రీ సి. ఎస్. రావు**

జననం:1935. జన్మస్థలం:రాజమండ్రి తాలూకా మాధవరాయుడు పాలెం. విద్యాభ్యాసం: కాకినాడ, రాజమండ్రి, సాగర్. వృత్తిరీత్యా లెక్చరర్. రచనలు : 'ఊరుమ్మడి బతుకులు', 'గుమ్మడి గింజలు' కథలు. రాతిపువ్వు; కమలమ్మ కమతం; రాగసరాగాలు మొదలైన నవలలు; ప్రాణం ఖరీదు మొదలైన నాటికలు. చక్కని వాక్యం కనపడితే చదవడం, చక్కని వాక్యం రాయడం అంటే సరదా.





—శ్రీ ఛమిడిపాటి రామగోపాలం

జననం: 6-2-1932
విజయనగరం కాలేజీలో 1951 లో బి.ఎ. రాష్ట్ర సర్వే డిపార్టుమెంటులో హెడ్ సర్వేయరుగా 1957 నుంచి వుద్యోగం. 1971లో (తెలుగు)ఎం.ఎ. 1974 నుంచి విశాఖ పోర్టుట్రస్టులో 'డిప్యూటీ ఇనస్పెక్టరాఫ్ సర్వే' కథలు, వ్యాసాలు, రేడియో నాటికలు; మొత్తం 250 వుంటాయి, ఇప్పటి వరకు.

వంటొచ్చిన మొగాడు (కథలు-1966) వెన్నెలనీడ (కథలు-1977) కుందపెంకులు (ఆంధ్ర వారపత్రిక సీరియల్-1961) ప్రచురితమైన పుస్తకాలు.
రాయడంకన్నా చదవడం యిష్టం. అంతకన్నా-నవ్వుతూ, నవ్విస్తూ మిత్రులతో సాహితీ చర్చలు చేయడం యిష్టం. బాగా లోతైన సంగీతం (కర్ణాటకమే కాదు: హిందూస్తానీకూడా) లభ్యమైతే వింటూ మైమరచిపోడం యిష్టం. రెండేళ్లుగా "విశాఖ సాహితి" ఉపాధ్యక్షులు.

## మూడో అవార్డు: 'కూలితల్లి'

— శ్రీ వి. రాజారామ్మోహనరావు

ఈ మధ్యే వయసు ముప్పై దాటింది. నూటముప్పై వరకు కథలు, అయిదు నవలలు వివిధపత్రికలలో అచ్చుఅయ్యాయి. 'వరద' కథల సంపుటి ఎమెస్కో బుక్‌గా వచ్చింది.

స్వాతి, జ్యోతి, ఆంధ్రభూమి పత్రికల కథల పోటీల్లో బహుమతులు వచ్చాయి. నవభారత్ బుక్‌హౌస్ వారి నవలా ప్రియదర్శిని బేలట్‌పోటీలో 'కొత్త చిగురు' నవలకి బహుమతి లభించింది. పది పైగా కథలు కన్నడ, తమిళ, హిందీ, మళయాళ భాషల్లోకి అనువాదం అయ్యాయి.



—శ్రీ పి. శ్రీనివాస శాస్త్రి

ఆంధ్రభూమి దినపత్రికలో ఉపసంపాదకుడిగా ఉద్యోగం. ప. గోదావరి జిల్లా జగన్నాధపురం, మార్టేరు, నరసాపురం, విజయవాడల్లో చదువు. కథలు వ్రాస్తూన్నది 1975 నుంచి. తొలి కథ 'న్యూ కాలనీ' 'జయశ్రీ లో' వచ్చింది.

ఆంధ్రప్రభలో (1976), జ్యోతి మాసపత్రికలో (ఇటీవలే) కథలకు ప్రథమ బహుమతులు గెలుచుకున్నారు.

"మీ పెరటితోటలో గులాబీలను పూయించే సూర్యకిరణమే చీకటి పొదలమాటున గడ్డి పువ్వును కూడ వికసింప చేస్తుంది. రచయిత అలాంటి సూర్యకిరణమై వెలుగు తెలియని అలాంటి గడ్డిపువ్వును వికసింపచేస్తే—ఆ కథ మనసుమీద ముద్రవేస్తుంది" అంటారు వీరు.





అయిదో అవార్డు: 'శరన్మేఘం'

—శ్రీమతి నందుల సుశీలాదేవి

సుజాత, సరళీ స్వరాలు, చిగురాకులు మొదలైన నవలలు వ్రాసారు. యువ, పత్రిక, జ్యోతి, ప్రభ మొదలైన పత్రికలలో చాలా కథలు వచ్చాయి.

భర్త శ్రీ సుసర్ల సుబ్రహ్మణ్యం గారు బొంబాయిలో ఉద్యోగరీత్యా ఉంటున్నారు. వీరు కాకినాడ స్త్రీల కళాశాలలో వుద్యోగరీత్యా ఉంటున్నారు.

# చందమామ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 38 అక్టోబరు, 1978 సంచిక 4


ప్రతి సంవత్సరమూ వానలు కురుస్తాయి. వానలు కురువకపోతే అనావృష్టివల్ల పంటలు లేక ప్రజలు నానా బాధలు పడతారు. అంచేత ప్రతి సంవత్సరమూ వానలు కురువవలసిందే. వానలు బాగా కురిసినప్పుడు వరదలు తప్పవు. వరదలవల్ల ప్రతి సంవత్సరమూ కొన్ని లక్షల ఎకరాల పొలంలో పంటలు నాశనమవడమూ, కొన్ని వందల గ్రామాలలోని కొన్ని వేలమంది ప్రజలు నానా అవస్థలు పడడమూ జరుగుతూవుంది. వానలు కురువకుండానూ, వాన నీరు వరదగా ప్రవహించకుండానూ చెయ్యడం ఎవరికీ సాధ్యంకాదు. కాని, వరదలను సరియైన మార్గంలోకి మళ్ళించి, అవసరమైనచోట ఆ నీటిని నిలవ చెయ్యడమూ, అవసరంలేని చోటినుంచి ఆ నీరును కాలువలలోకి, చెరువులలోకి మళ్ళించడమూ సాధ్యమైన పనే. అయినా, ఈ విషయంలో ప్రభుత్వం సరియైన శ్రద్ధ చూపలేదనే చెప్పాలి. కొన్ని సందర్భాలలో చిన్న చిన్న కార్యక్రమాలను తయారుచేసినా, ఆ కార్యక్రమాలు సరిగా అమలు జరగలేదు.

వరదలు ఎక్కువగా వచ్చే ప్రాంతాలు ఏమిటో, వాటివల్ల ఏ ఏ గ్రామాలకు, ఏ ఏ రోడ్లకు దెబ్బతగులుతుందో, అనుభవంవల్ల ప్రజలకూ ప్రభుత్వానికీ తెలిసిన విషయమే. అయినా, ఆ వరదనీటిని సక్రమ వినియోగానికి మళ్ళించి, అనేక గ్రామాలకూ, లక్షల ఎకరాలలోని పంటకూ నష్టం వాటిల్లకుండా తగిన కార్యక్రమాలను రూపొందించి, వాటిని అమలు జరపడం జరగలేదు.

గత ఆగస్టు నెలలో కురిసిన భారీవర్షాలవల్ల, కృష్ణా, గోదావరి, గుంటూరు, తెలంగాణా జిల్లాలలో విశేష నష్టం సంభవించింది. ఈ ప్రాంతాలన్నీ,

మామూలుగా వరదదెబ్బ తినే ప్రాంతాలే. అధమం యాభై ఏళ్ళుగా, దాదాపు ప్రతి సంవత్సరమూ, ఈ ప్రాంతాలనుంచి ఆక్రందనలు వినపడుతూనే వున్నాయి. అచ్చటి ప్రజలు విపరీత నష్టాలనూ కష్టాలనూ అనుభవిస్తూనే వున్నారు. వారికి, ఆపత్సహాయానికి కృషి జరుగుతూనే వుంది. కాని, ఏటేటా వచ్చే యీ ఆపదనుంచి ఆ ప్రాంతాలను కాపాడడానికి తగిన కార్యక్రమాలు అమలుజరపబడలేదు,

మాటవరసకి, బుడమేరు వరదలను తీసుకుందాము ఆ ప్రాంతంలో వాన కురవడమేమిటి, బుడమేరు పొంగి వరదలు ప్రవహించడమేమిటి మామూలుగా జరిగిపోతున్న వ్యవహారమే. బుడమేరు ముంపు అనేది ఏటేటా ప్రజల నోటి నుంచి వినబడే మాటే!

స్వాతంత్ర్యం రాకముందు నుంచీ, బుడమేరు వరదలను సరియైన పద్ధతిలో మళ్ళించాలనే ప్రజాందోళన జరుగుతూనే వుంది. ఎవరూ పట్టించుకోలేదు. అంటే, పని ఏమీ జరుగలేదు. వరదలు వచ్చి విశేష నష్టం సంభవించినప్పుడు, దానిని గురించి ఆలోచించడమూ, వరదలు తియ్యగానే ఆ విషయాన్ని మరిచిపోవడమూ జరుగుతూ వున్నది వరదబాధితుల సహాయానికి రెండు మూడు సంవత్సరాలు ఖర్చుపెట్టే డబ్బును వినియోగించి, వరద నివారణ పథకాలను అమలు జరిపితే, శాశ్వతంగా ఆ ప్రాంతాలకు రక్షణ కలిగించ వచ్చును. వరదనీటిని ఉపయోగించే ఏర్పాట్లను చెయ్యవచ్చును కొన్ని ప్రాంతాలలో, కనీ వినీఎరుగని రీతిగా వానలు పడవచ్చు; వరదలు రావచ్చు. వాటిని తప్పించుకోవడం సాధ్యంకాదు కాని, దాదాపు ప్రతి సంవత్సరమూ వరదలు వచ్చే ప్రాంతాలలో కూడా వాటిని నివారించే ఏర్పాట్లు చేసుకోలేకపోవడము, మన చేతగానితనం అవుతుంది; లేదా, ప్రభుత్వపు నిర్లక్ష్యభావం అవుతుంది

ఇప్పటికైనా, ప్రభుత్వం ఈ విషయంలో శ్రద్ధవహించి, మళ్ళీ వచ్చే సంవత్సరంనాటికి, యీ వరద ప్రాంతాలు వరదదెబ్బ తినకుండా తగిన కార్యక్రమాలను అమలుజరిపి, ప్రజలకు కష్టనష్టాలు కలుగకుండా చేస్తారని ఆశిస్తున్నాము.

* * *

కేంద్రప్రభుత్వపు అధికారభాషా విధానంపట్ల మళ్ళీ దక్షిణ రాష్ట్రాలలో అసంతృప్తి ఏర్పడింది. హిందీని బలవంతంగా అమలుజరుపమని కేంద్ర ప్రభుత్వం యిచ్చిన హామీని ఉల్లంఘించి, హిందీని బలవంతంగా దక్షిణరాష్ట్రాల పైన రుద్దడానికి ప్రయత్నం జరుగుతున్నదనే ఆందోళన బయలుదేరింది ఇది, కేంద్రానికి రాష్ట్రాలకూ మధ్యగల సౌమనస్యాన్ని చెడగొట్టుతుంది త్రిభాషా సూత్రాన్ని ఆమోదించిన రాష్ట్రాలుకూడా, హిందీని విడిచి ద్విభాషా విధానాన్ని అవలంబిస్తామని ప్రకటించడం జరిగింది. ఇలాటి ధోరణికి కారణం, ఉత్తరాది

రాష్ట్రాలు త్రిభాషా సూత్రాన్ని సరిగా అమలు జరుపకపోవడమూ, ఎలాగైనా ఇంగ్లీషును తొలగించి, దాని స్థానంలో హిందీని ప్రవేశపెట్టాలని తొందర పడడమూ ఇంగ్లీషును తొలగించడం, ఎవరికీ సాధ్యమయ్యే పనికాదు. పైగా, ఇంగ్లీషు భాషను వదులుకోవడమంటే మిగతా ప్రపంచంతో సంబంధాన్ని వదలు కోవడ మవుతుంది. అది, దేశానికే నష్టం హిందీ రాని రాష్ట్రాలపై హిందీని రుద్దడానికి ప్రయత్నించడం, ఆ రాష్ట్రాలలో అలజడికి కారణం అవుతుంది. ఈ రెండు కారణాలను దృష్టిలో పెట్టుకుని, హిందీని ప్రవేశపెట్టడం విషయంలో కేంద్రప్రభుత్వం జాగ్రత్త చూపడం అవసరం. రాష్ట్రప్రభుత్వాలకు పంపే ఉత్తరాలనూ సందేశాలను ఇంగ్లీషు భాషలోనే పంపుతూ, హిందీ తర్జుమాను కూడా పంపవచ్చును. దానివల్ల నష్టం ఏమీలేదు. కాని, ఒక్క హిందీలోనే రాష్ట్రప్రభుత్వాలకు ఉత్తరాలను, సందేశాలను పంపడంవల్ల, రాష్ట్రప్రభుత్వాలు, పూర్వంలో ఇచ్చిన హామీని కేంద్రప్రభుత్వం ఉల్లంఘిస్తోందని అనుమాన పడడానికి అవకాశం ఏర్పడుతున్నది. అంతేకాదు; త్రిభాషా సూత్రాన్ని అమలు పరుస్తామని హామీయిచ్చిన కేంద్రప్రభుత్వం, ఉత్తరాది రాష్ట్రాలలో యీ సూత్రం అమలులోకి వచ్చేటట్లు చూడడంకూడా చాలా అవసరం. అప్పుడు దక్షిణ రాష్ట్రాల అనుమానానికి తావు వుండదు. ఏమైనా, ఇంగ్లీషుభాషను మనం వదలలేము వదలడం మంచిదికాదు కూడాను.

బ్రిటిషు ప్రభుత్వం మన దేశంలో స్థిరపడిన తరువాత, ఇంగ్లీషుభాష స్థిరపడడానికి నూరేళ్ళు పట్టింది. అలాగే, ప్రభుత్వ కార్యక్రమాలకు మాత్రం హిందీని అమలుజరపడానికి నూరేళ్ళు పట్టవచ్చును. దానివల్ల నష్టం ఏమీలేదు. అర్జంటుగా పదేళ్ళలో దేశంలోని ప్రజలందరూ ఇంగ్లీషును వదలిపెట్టి, హిందీ లోనే తమ వ్యవహారాలను నడుపుకోవాలంటే జరిగే పనికాదు.

అంచేత, హిందీని మాత్రమే ప్రభుత్వ వ్యవహార భాషగా వెంటనే అమలు జరుపుదామనే ప్రయత్నాన్ని కేంద్రప్రభుత్వంలోని కొందరు విరమించడం, మంచిది.

---


నవంబరు సంచికలో...

1978 చక్రపాణి రెండవ అవార్డు పొందిన

శ్రీ ఏ. వి. సత్యనారాయణ నవల: 'ముడిపడని బంధం'

రెండవ అవార్డు పొందిన 'మనోధర్మం'

శ్రీ భమిడిపాటి రామగోపాలం కథ ప్రచురింపబడతాయి.

మరో అయిదు నిమిషాలలో

# మీ జీవితమే ఉన్నతంగా మారుతుంది

[ఈ ప్రకటన పూర్తిగా చదవడానికి మీరు ఓ అయిదు నిమిషాలు వెచ్చించగలిగితే...]



## రేపు అసాధారణమైన మాసపత్రిక!

ఈ పత్రిక ఉజ్వల భవిష్యత్తుకు త్రోవ చూపుతూ మిమ్మల్ని ఉన్నతంగా తీర్చి దిద్దుతుంది. అంతరంగిక మిత్రునిలా అనుక్షణం సాయపడుతుంది. మిమ్మల్ని మీరు, ఇతరులను అర్థం చేసుకోవడానికి తోడ్పడుతుంది. జీవితంలో ప్రతి ఘట్టం కోసం తెలుసుకోవలసిన విషయాలను, మరెక్కడా లభ్యంకాని వివరాలను తెలుపుతుంది. మీరు ఎదుర్కొనే క్లిష్టమైన సమస్యలను తేలిగ్గా పరిష్కరిస్తుంది. క్లుప్తంగా చెప్పాలంటే జీవన మాధుర్యాన్ని చిలకరిస్తుంది.

**ఒక పత్రికకు ఇంతటి అద్భుతమైన శక్తి వుంటుందని మీరు విశ్వసించగలిగితే కేవలం 'రేపు' పత్రికకు మాత్రమే ఆ ఘనత దక్కుతుందని మీరు అంగీకరించితీరాలి!**

లక్షలాది మంది 'రేపు' పాఠకులలో ఏ ఒక్కరిని అడిగినా మీకు ఈ విషయాన్ని ధృవపరుస్తారు.

*• ఈ పత్రికకు చందాదారులుగా చేరడమంటే మీ జీవితాన్ని ఉన్నతంగా మలుచుకోవడమే!*

# ఇదొక అద్భుతమైన అవకాశం!

'రేపు' మాసపత్రిక వెలువడినప్పటి నుండి దీనిని అత్యద్భుతమైన మాస పత్రికగా పాఠకులు పరిగణించి కనీ వినీ ఎరుగని విశేష ఆదరణ కనబరచారు. ఈ పత్రిక ప్రచురణ ప్రారంభించి అత్యంత విజయవంతంగా ఒక సంవత్సరం ముగిసిన సందర్భంగా మేమొక పోటీని నిర్వహించాము. ఈ పత్రిక మీ జీవితాల నెలా ప్రభావితం చేసిందో తెలుపమని పాఠకులను కోరాము.

- ఈ పత్రికను చదవడంవలన పది జీవితాల అనుభవాన్ని గడించామనీ, తమ ఆలోచనాధోరణే మారిపోయిందనీ, ఎందరో యువతీయువకులు పేర్కొన్నారు.
- ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులు కావడానికీ, తమ సమస్యలను వైదొలగించుకొని, ఏకాగ్రత నలవర్చుకోవడానికి దోహదం చేసిందని విద్యార్థులు తెలిపారు.
- ఎంతోమంది మహిళలు తమ తమ జీవితాల్లో గూడుకట్టుకు వున్న విచారాన్ని, చికాకును, ఆందోళనను, నిరాశా నిస్పృహలను వైదొలగించుకొని ప్రశాంతతను అలవర్చుకోగలిగామన్నారు.
- దాంపత్యజీవితం మధురాతిమధురంగా కొనసాగడానికిది దోహదం చేసిందని వందలాదిమంది దంపతులు పేర్కొన్నారు. పిల్లల నెలా పెంచాలో నేర్చుకొన్నామని గృహిణులు కృతజ్ఞతలు తెలిపారు.

తమ బిడియాన్ని, సంశయాల్ని దూరంచేసి జీవితంలో ఏదైనా సాధించగల విశ్వాసాన్ని కలిగించిందనీ, నూతనోత్తేజాన్ని రగిలించిందనీ, ఈ పత్రికవలన తమ జీవితమే మారిపోయిందని అందరూ ముక్తకంఠంతో పేర్కొంటున్నారు.

ఇంతటి మహత్తర ప్రయోజనాన్ని మీరు కూడా పొందగోరితే

ఇప్పుడే ఈ క్షణంలోనే **రేపు** మాస పత్రికకు

చందాదారులుగా చేరండి.




రోజంతా తన ప్రతాపం చూపించిన సూర్యభగవానుడు మెల్లమెల్లగా పడమటి కొండలమాటున మాయమయి పోతున్నాడు. సంధ్యాకాంత అరుణ రాగ రంజిత మయిన మోముతో నిశికి స్వాగతం పలుకుతున్నట్టుగా పడమటి ఆకాశం ఎర్రరంగుని పులుముకుంది. వీధులు, షాపులు, బస్సులు జనంతో కిటకిటలాడిపోతున్నాయి.

---

**1978** చక్రపాణి మొదటి అవార్డు పొందిన నవల

---

తలుపు తెరిచిన శబ్దానికి టకటక మోగుతున్న టైపుమిషను మోత ఆగింది. నారాయణ వెనక్కి తిరిగి చూశాడు. గిరిజ ఓ చేతిలో హాండ్‌బ్యాగ్, మరో చేతిలో కూరల సంచీ తీసుకుని లోపలికి అడుగుపెట్టింది. నారాయణ పలకరింపుగా నవ్వి, తిరిగి ముందున్న టైపుమిషనుమీద చకచకా టైపు చెయ్యటం మొదలుపెట్టాడు.

గిరిజ కూరలబుట్ట లోపలుంచి పెరటిలోకి వెళ్ళింది. అలసిపోయి, వేడిగా వున్న మొహంమీద చల్లటి నీరు దోసిళ్ళతో చల్లుకోగానే ప్రాణం హాయి అనిపించింది. టవల్‌తో మొహం తుడుచుకుంటూ నారాయణ దగ్గరగా వచ్చింది.

"కాఫీ తాగారా? ఇవాళ స్కూల్లో మీటింగు వుండటంవల్ల ఆలస్యమయింది." దీక్షగా టైపు చేస్తున్న నారాయణని చూస్తూ అడిగింది. నారాయణ తలఎత్తి చూసి, దగ్గరగావున్న గిరిజ చేతిని తనచేతుల్లోకి తీసుకున్నాడు. మొహంవంక పరీక్షగా చూస్తూ "బాగా అలసిపోయినట్టుగా ఉన్నావు. మొహం చూడు ఎలా వాడిపోయిందో" అన్నాడు మెల్లగా.

గిరిజ మెల్లిగా నవ్వింది. "ఊహు. రోజూ వుండే ఆలసటే. కాఫీ తాగారాలేదా?"

"తాగాను. సుషమ కలిపి ఇచ్చింది."

"పిళ్ళిద్దరూ ఎక్కడికి వెళ్ళారు? ఇంకా ఆటల్నించి రాలేదా ?" బొట్టు పెట్టుకొంటూ అడిగింది.

గిరిజ, కాఫీ గ్లాసులో పోసుకుని, స్టౌమీద అన్నానికి ఎసరు పెట్టివచ్చి, నారాయణ దగ్గరగా కుర్చీ లాక్కుని కూర్చుంచి. నోటిదగ్గర పెట్టుకోబోతూ చటుక్కున ఏదో గుర్తువచ్చినట్టుగా కాఫీ గ్లాసుని కిటికీమీద వుంచి ప్లాస్టిక్‌బుట్టలో వున్న అరటి పళ్ళలోంచి రెండు పళ్ళని తుంచి తీసుకువచ్చి నారాయణకిస్తూ, "తినండి ఇవాళ బజారులో అరటిపళ్ళు చవగ్గా ఇస్తుంటే తీసుకున్నాను" అంది.

నారాయణ తనొకటి తీసుకుని, 'నువు తిను' అంటూ గిరిజకి వొకటి అందించాడు. గిరిజ కాఫీ తాగుతూ, చకచకా టైపుమిషనుమీద కదులుతూన్న నారాయణ వేళ్ళని చూస్తూ కూర్చుంది.

ఏదో గుర్తువచ్చినట్టుగా నారాయణ వేళ్ళు సడన్‌గా ఆగిపోయినాయి. "రాఘవయ్య పూర్తయిన కాగితాలు పట్టికెళ్ళాడు. ఇదిగో...ఇది లోపలపెట్టు" అంటూ జేబులోంచి ఐదురూపాయలనోటు తీసి గిరిజచేతికి అందించాడు.

గిరిజ నోటు తీసుకుంది. ఇద్దరిచూపులూ ఓ క్షణం కలుసుకుని మళ్ళీ విడిపోయినాయి. నారాయణ ముందున్న కాగితాలని దగ్గిరకి లాక్కుని టైపు చెయ్యడం మొదలుపెట్టాడు.



తలుపులు తోసుకుని సుడిగాలిలా తొమ్మిదేళ్ళ సురేష్ లోపలికి దూసుకొచ్చాడు. ఎదుట తల్లిని చూడగానే ఒక్కసారిగా వచ్చి కావిలేసుకున్నాడు గిరిజని ఆప్యాయంగా కొడుకుని దగ్గరికి తీసుకుంది. మొహంమీద పడుతున్న జుట్టుని పైకితోస్తూ 'ఆటలయినాయిరా? అక్కేది?' అంది.

"అక్క సీతావాళ్ళింట్లో తొక్కుడుబిళ్ళ ఆడుతోందమ్మా" అంటూ తల్లి చెవి దగ్గర నోరుపెట్టి మెల్లగా "అమ్మా! నేనొకటిఅడుగుతానుఇస్తావామరి?" అన్నాడు.

"ఏవిట్రా అంత రహస్యం?"

"నేను వినకూడనిదేమిట్రా నీ రహస్యం?" నారాయణ ఇద్దరినీ చూస్తూ నవ్వాడు. సురేష్ తల్లి మెడని అలా కావిలించుకునే "అమ్మా నాకో రూపాయి కావాలి. ఇవ్వవూ" అన్నాడు.

"రూపాయా? ఎందుకు?"

"ష్ అరవకు, నాన్నగారు వింటారు." రహస్యంగా అన్నాడు. గిరిజ నవ్వింది. "నీ రహస్యం నాన్నగారు వింటూనే వున్నారులే. ఇంతకీ రూపాయి ఎందుకో చెప్పు?"

"మరేమ్మా మా స్కూల్లో రంగడున్నాడే, వాళ్ళ నాన్న టిక్కెట్లు అమ్ముతునా డే" అన్నాడు.

ఏం టిక్కెట్లురా? స్కూల్లో ఏదయినా మేజిక్ షో వుందా?"

"కాదమ్మా. ఒకరూపాయి ఇవ్వమ్మా."

"ఇస్తాగానీ ఎందుకో చెప్పు."గిరిజ వాడి చేతుల్ని విడిపించుకుని లేవబోతూ ంది.

"మరి లాటరీ టిక్కెట్టుకోసం అమ్మా. ఒక్క రూపాయిపెట్టి టిక్కెట్టుకొంటే లక్షరూపాయిలొస్తాయటమ్మా. రంగడు చెప్పాడు." కళ్ళు పెద్దవిచేసి, కుతూహలంగా వున్న కొడుకుని చూసి లేవబోతున్న గిరిజ శరీరంలో శక్తినంతా ఎవరో గప్పున లాగినట్టుగా అలాగే కూలబడింది. టైపుమెషినమీద నారాయణ వేళ్ళు చటుక్కున ఆగిపోయినాయి. ఇద్దరిచూపులు ఒక్కక్షణం కలుసుకుని విడిపోయినాయి. మెల్లగా కంపిస్తున్న గిరిజ పెదవులుచూసి నారాయణ తలవంచుకొన్నాడు.

ఎప్పుడు వచ్చిందో ఏమో సుషమ, వీళ్ళ సంభాషణ అంతా వింటున్నట్టుగా, "అమ్మా! ఇవాళ మా హెడ్‌మాస్టారు రంగడిని బాగా కేకలేశారమ్మా స్కూల్లో లాటరీ టిక్కెట్లు లాటివి అమ్మకూడదని. ఇంకోసారి తెస్తే వాడిని పది బెత్తం దెబ్బలు కొడతా అన్నారు. వీడికి రూపాయి ఇవ్వమోకమ్మా" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

తల్లీ తండ్రీ ఒక్కసారి నిశ్శబ్దంగా అయిపోయేసరికి సురేష్ ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ తనన్న మాటల్లో తప్పేంవుందో తెలియక బిక్కమొహం వేసుకొని నిలబడిపోయాడు.

నారాయణ చెయ్యిచాచి సురేష్‌ని దగ్గరగా పిలిచాడు. వాడు వొచ్చి తండ్రి దగ్గరగా నిలబడ్డాడు.

"సురేష్! లాటరీ అంటే ఏమిట్రా" అంటూ ప్రశ్నించాడు.

తండ్రి ప్రశ్నతో సురేష్‌లో మళ్ళీ వుత్సాహం వచ్చింది. గిరిజ మెల్లగా కదిలి కిటికీలోంచి బయటికి చూస్తూ నిలబడింది.

సంధ్య చీకట్లు ముసురుకుంటున్నాయి. వీధుల్లో ఒక్కటొక్కటిగా లైట్లు వెలుగుతున్నాయి.

"మరి నాన్నగారూ! మనం ఒక్కరూపాయి పెట్టి టిక్కెట్టు కొంటే మనకి లక్షరూపాయిలొస్తాయిటండీ. రంగడు చెప్పాడు మద్రాసులో బీచిలో బఠాణీలు అమ్ముకునేవాడికి అలాగే వచ్చాయిటండీ ఆ పసిమొహంలో మెదులుతున్న ఆశని, ఆ కళ్ళల్లోని కుతూహలాన్ని చూడలేనట్టుగా నారాయణ సురేష్‌ని చేత్తో దగ్గరికి లాక్కున్నాడు.

"మరి టిక్కెట్టు కొన్న ప్రతివాడికీ లక్షరూపాయిలొస్తాయా ఏంరా?" తండ్రి ప్రశ్న వాడి చిన్నబుర్రకి తికమకగా కనబడింది. వెంటనే ఏం జవాబు చెప్పాలో తట్టలేదు. రంగడు చెప్పిన సంగతి చటుక్కున గుర్తుకొచ్చింది

"పోతే ఒక్కరూపాయే గదండీనాన్నగారూ! వస్తే లక్షరూపాయిలొస్తాయి." లక్ష అన్న పదాన్ని వాడు పలికిన తీరుకి నారాయణ వాడివైపు ఓక్షణం తదేకంగా చూసి కళ్ళుమూసుకున్నాడు.

'భగవాన్! ఇది వారసత్వమా? కాకూడదు. కాకూడదు!' అతని మనసు రోదిస్తోంది. ప్రార్థిస్తోంది మూగగా. చీకటిలోకి చూస్తున్న గిరిజ కళ్ళు నీటితో నిండి, మసకబారిన దృష్టికి ప్రపంచమే కదిలిపోతున్నట్టుగావుంది. కిటికీ చువ్వల్ని చేత్తో గట్టిగా పట్టుకుని వాటిమీద తలానించి కళ్ళుమూసుకుంది.

"సురేష్! ఒకసారి రూపాయిపెట్టి కొంటావు. లక్ష రూపాయలు రావనుకో. మళ్ళీ కొంటావనుకో, అప్పుడయినా వస్తుందా ?"

సురేష్ మౌనంగా నిలబడిపోయాడు.

"అప్పుడూ రాదనుకో. మరోసారి కొంటావు. ఇంకోసారి, ఆ తర్వాత మళ్ళీ మళ్ళీ అలా ఎంతకాలం కొంటూ ఉంటావురా ?"

"లక్ష రూపాయలు వచ్చేవరకు." ఇంత చిన్న విషయం అంత పెద్దమనిషికి తట్టలేదా అన్నట్టుగా వుంది వాడి గొంతు.

"అసలు ఎప్పటికయినా నీకు లక్ష రూపాయలు వస్తాయని గ్యారంటీ ఏమయినా వుందిట్రా ?"

సురేష్‌కు జవాబు తట్టలేదు.

నీకు లక్షరూపాయలు రాకపోగా ప్రతిసారి నువు రూపాయి చొప్పున ఎంత నష్టపోతున్నావో తెలుసా నీకు ? రూపాయి సంపాదించాలంటే ఎంత కష్టపడాలో, ఆ రూపాయికి ఎంత విలువ వుందో నీకు తెలుసురా సురేష్ ? రూపాయుంటే ఓ పూట కూరకి వస్తుంది. జబ్బుగా వుంటే మందు కొనుక్కో వచ్చు. నడవలేకపోతే రిక్షాలో వెళ్ళొచ్చు. ఓ గ్లాసు పాలు తాగచ్చు. ఓ నోట్సు పుస్తకం కొనుక్కోవచ్చు. మరింకెన్నో పనులు చెయ్యొచ్చు. అవునా ?"

ఒక్క రూపాయికోసం తండ్రి తలపగిలేటన్ని లెక్కలు ఎందుకు చెపుతున్నాడో వాడికి అర్థం కాలేదు

"ఈ లాటరీలనేవి చాలా చెడ్డవిరా సురేష్. నువు ఒక్క రూపాయితో లక్ష రూపాయలు సంపాదించాలనుకుంటున్నావన్నమాట. అవునా ? అంటే కష్టపడకుండా, తేలిగ్గా, డబ్బు సంపాదించాలని చూస్తున్నావన్నమాట. అంటే మనిషిలో అత్యాశ, సోమరిపోతుతనం బలిసిపోతుంది. నువు ఒకసారి వీటికి అలవాటుపడ్డావంటే అది మత్తులాగా పనిచేస్తుందిరా. ప్రతిమనిషీ కష్టపడి పనిచెయ్యాలి. డబ్బు సంపాదించాలి అప్పుడు నీకు కష్టం విలువ, డబ్బు విలువ అర్థం అవుతాయి అవునా ?"

నేరకపోయి అడిగాన్రా బాబూ అన్నభావం వాడి కళ్ళల్లో కనిపిస్తూనే వుంది

అయినా, రంగడి మాట గుర్తుకొచ్చి -

"లక్ వుంటే లాటరీ వస్తుందిటండీ" అన్నాడు సురేష్.

నారాయణ గుండెల్ని చీల్చుకుంటూ వచ్చిన నిట్టూర్పు గిరిజకి తాకినట్టుగా ఇటు తిరిగి చూసింది.

నారాయణ ఒక్క క్షణం ఎదురుగాఉన్న దైపురైటరుమీద దృష్టిని నిలిపి ఆప్యాయంగా దాన్ని చేత్తో తడిమాడు. టేబుల్‌మీద గిరిజ తనకి ఇచ్చిన అరటిపండు కనిపించింది. సురేష్‌ను దగ్గరగా కూర్చోపెట్టుకుని ఆ పండు వొలిచి తినిపించాడు. నారాయణ చేతులు పనిచేస్తూనేవున్నా మనసు ఆలోచిస్తూనే వుంది.

"సురేష్! నీకో కథ చెప్పనా ?" అన్నాడు మెల్లగా. కథ పేరు వినగానే వాడి కళ్ళలో ఉత్సాహం కనబడింది. చెప్పమన్నట్టుగా తండ్రికి మరికాస్త దగ్గరగా జరిగాడు.

"అనగనగా ఓ వూళ్ళో ఓ అబ్బాయి ఉండేవాడు. వాడికి అమ్మ, నాన్న, అన్నయ్యలు, అక్కయ్య అంతా ఉన్నారు. వాళ్ళ నాన్న ఎంతో కష్టపడి డబ్బు సంపాదించి అందర్నీ చదివించాడు. వాడి అన్నలంతా చదువుకుని, ఉద్యోగాలు చూసుకుని తలో వూరు వెళ్ళిపోయారు. ఆ అబ్బాయి హైస్కూల్లో చదువుకుంటూ ఉండేవాడు. వాడికి ఇద్దరు ముఖ్యమయిన స్నేహితులు ఉండేవాళ్ళు..."

కథ వింటున్న గిరిజకి, చెపుతున్న నారాయణకి కళ్ళముందు ఎన్నో దృశ్యాలు గిరగిరా తిరిగిపోతున్నాయి.

"అమ్మా అన్నం మాడిపోతుంటే దింపేళానమ్మా" అన్న సుషమ మాటలు కూడా వినిపించలేదు.

## 2

నారాయణ, చలపతి, శంకరం హైస్కూల్లో ఒకటే క్లాసులో వున్నారు. ముగ్గురికీ మంచి స్నేహం

ఓ రోజు ముగ్గురు మిత్రులూ పెద్దబజారు వీధిలోంచి నడిచి వస్తున్నారు. శెట్టికొట్టు ముందుకు వచ్చేసరికి 'న్నా న్నా, నారాయణా' అన్న కేక వినిపించి ముగ్గురూ తిరిగి చూశారు. కొట్టుముందు నిలబడి నత్తి సత్యన్నారాయణ పిలుస్తున్నాడు.

ముగ్గురూ దగ్గరగా వచ్చారు. చలపతికి కొంటెతనం ఎక్కువ. 'ఏ ఏ ఎందుకండీ స, స స త్తెంగారూ ?' అన్నాడు సత్యన్నారాయణని అనుకరిస్తూ.

సత్యనారాయణ తనను హేళన చేసేవాళ్ళను చూసి కోపం తెచ్చుకోవటం మానేశాడు వెంకన్నచౌదరి ఏకైక పుత్రుడు సత్యనారాయణ. హైస్కూలు చదువు దాటకుండానే చదువుకి స్వస్తి చెప్పేశాడు సత్యం. తండ్రి వెంటనే కొడుక్కి పెళ్ళిచేసేసి, శెట్టికొట్టు బాధ్యత శాస్త్రా అప్పచెప్పేశాడు. నారాయణ వాళ్ళ వీధి మొదటిలోవున్న పెంకుటిల్లే సత్యన్నారాయణది.

"ఏ ఏ ఎందుకండీ పి పి పిలిచారు ?" అన్నాడు చలపతి. శంకరం మందలింపుగా చూశాడు చలపతివైపు.

"నా నా న్నా నారాయణా ఈ కూ కూ,కూరల మా, సంచీ మా మా యింటి ద ద దగ్గర ఇచ్చేస్తావా ? పి పి పిచ్చయ్య ఎ ఎక్కడికో పో పో పోయాడు" అంటూ సత్యన్నారాయణ కూరలు వున్న కాకి సంచీని నారాయణ చేతి కిచ్చాడు.

"అలాగే ఇస్తాలెండి" అంటూ నారాయణ సంచీని అందుకున్నాడు సత్యనారాయణ కొట్టుమీద తీరుబడి వున్నప్పుడల్లా తోవనపోయే పరిచయంవున్న వాళ్ళందరినీ పిలిచి ఖబుర్లాడుతూ వుంటాడు. నారాయణకి ఆ కొట్లో వున్న రకరకాల మొకులు, కబంరి తాళ్ళు, నైలాను తాళ్ళు, వలలు మేదరి వస్తువులు అన్నీ చూస్తూ, తడుముకుంటూ మాట్లాడే సత్యన్నారాయణ మాటలు వినడం సరదా. సత్యన్నారాయణ దగ్గర ఎప్పుడూ ఏదో ఓ చిరుతిండి స్టాకులో ఉంటుంది. మరమరాలో, బఠానీలో, సెనగలో, జామకాయలో — ఇలా ఏదో ఒకటి తింటూ, నారాయణ చేతిలో కూడా కాసిని పోసి ఖబుర్లు చెపుతూ వుంటాడు.

"సత్తెంగారూ, మీరు మాటిమాటికి మద్రాసు వెళ్ళానంటా రేవిటండీ ? ఏముంది అక్కడ ?" అని అడిగాడోసారి నారాయణ.

సత్యనారాయణ ముసి ముసి నవ్వులు నవ్వి "వు వు వుందిలే ఓ ఓ ఓ రహస్యం, నీ నీ నీకు ఇప్పుడే తె తె తెలవదులే" అన్నాడు. సత్యనారాయణ లేనప్పుడు కొట్టుని పిచ్చయ్య చూస్తూ ఉండేవాడు. పెద్దలకి పిన్నలకి అందరికీ 'సత్తెం కొట్టు' అనటమే అలవాటు.

నారాయణ, చలపతి, శంకరం కలిసి సత్యన్నారాయణ ఇంటికి వెళ్ళి కూరల సంచీని అప్పచెప్పారు. తండ్రి కాళ్ళకి ఏదో కదలలేని ఇబ్బందే వుంది. ఎప్పుడు చూసినా పడక్కుర్చీలో పడుకుని చుట్టలు కాలుస్తూవుంటాడు. తల్లి కూరల సంచీ అందుకుంది. "నీ కిచ్చాడా నాయనా. కూరగాయల సంగతి మర్చిపోయాడేమో ననుకుంటున్నా. మతిమరుపాడు" అంటూ తలో సున్నివుండ ఇచ్చింది.

ఓసారి నారాయణ తల్లి నీళ్ళతోడే చేదకి తాడు తెమ్మని పంపింది. నారాయణ సత్తెం కొట్లో తాడు కొని తిరిగి వస్తుంటే, పొగాకు కాడలున్న ఓ పొట్లాన్ని నారాయణ చేతికిచ్చి, "మా మా నాయిన కిచ్చి పో, నా నా, న్నారాయణా" అన్నాడు సత్యన్నారాయణ.

నారాయణ పొగాకు ఇవ్వటానికి సత్యం ఇంటికి వెళ్ళాడు. సత్యన్నారాయణ తల్లి వరండాలో కూర్చుని బియ్యం ఏరుతోంది. కళ్ళమ్మట ధారగా నీళ్ళు కారుతున్నాయి. మధ్య మధ్య ముక్కు చీదేస్తూ ముసలాయనతో ఏదో ఘర్షణ పడుతోంది.

"నువ్విట్టాగే మెదలకుండా కూర్చో. సమస్తం ఆడిచేతికి అప్పచెప్పావు.




సచ్చినోడేమో గుర్రాలమీద అంతా తగలేసి చిప్ప చేతికిస్తాడు. అప్పుడు నువ్వు, నేను ఆ చిప్ప పట్టుకుని వీధులన్నీ తిరుగుతూ అడుక్కుతిందాం" అంటూ ఏడుస్తోంది.

"వుండే వుండు ఏడవమాక! ఆడ్ని ఇంటికి రానీ సెప్తా. పందెం గుర్రంలాగా ఆడ్ని పరిగెట్టిస్తానో లేదో చూద్దూగాని. అమ్మా, అమ్మా ఇంత దొంగెదవయిపోతాడా? పంట డబ్బు కాస్తా పెట్టి పందేలాడొస్తాడా ఈడ్ని నరికెయ్య" అంటూ కదలలేని ముసలాయన మాటల్లోనే శౌర్యాన్నంతా ప్రదర్శిస్తున్నాడు. నారాయణకి ఇక అక్కడ నిలబడి వాళ్ళ మాటలు వినటం బాగుండదనిపించింది. లోపలికి వెళ్ళి ముసలాయనకి పొగాకు కట్ట అందించి, "సత్తెంగారు ఇమ్మన్నారండీ" అన్నాడు నారాయణ

ముసలాయన కొడుకుమీది కోపాన్నంతా కొడుకు పంపిన పొగాకు మీద చూపెట్టాడు. నారాయణ అందించిన పొగాకు కట్టని విసిరి పుచ్చుకుని గోడకేసి కొట్టాడు. "ఎదవన్నెరెదవ. ఏలకి ఏలు పందేల్లో తగలేసి అణా కాని పొగాకు కొని పంపిస్తాడా?" అంటూ మాటల్ని గంతు లేయించాడాయన.

"బాగుంది నీ కోపం పొగాకుమీద చూయిస్తావేమిటి? చేతనయితే ఆడి మీద చూపించు. సర్లే బాబూ నువు పోయిరా. అమ్మావాళ్ళంతా బావున్నారా?" అంటూ ముసలాయన్ని గదిమి, నారాయణని కుశలప్రశ్న లేసిందావిడ.

"బాగానే ఉన్నారండీ" అంటూ నారాయణ ఇంటికి వచ్చేశాడు. చేదతాడు

తల్లి కిస్తూ సత్యన్నారాయణ యింట్లో తను విన్నది చూసింది అంతా తల్లికి చెప్పాడు.

"ఆ. పాపం ఒక్కడే కొడుకు గదా అని గారాబంగా పెంచారు ఆ సత్తిగాణ్ణి. వాడో భ్రష్టుడులాగా తయారయ్యాడు. ఆ తండ్రేమో కదల్లేడు. వీడు ఆడింది ఆట పాడింది పాటాను. వున్నదంతా తీసుకుపోయి గుర్రప్పందేల్లో తగలేస్తాడు. అందుకే ఘడియ ఘడియకి మద్రాసు పోతూ ఉంటాడు. పైగా పెళ్ళాం వంక. ఎందుకురా ఎప్పుడూ పట్నం పోతావు అంటే "మా ఆవిడ ఉంది గదండీ" అంటాడు వెధవ. వాడికి చిన్నతనంలోనే మేనమామ కూతుర్ని అంటగట్టి పెళ్ళిచేశారు. ఆ పిల్లకేమో మూర్ఛరోగం వుందని వీళ్ళంటారు, లేదని వాళ్ళంటారు. సత్తిగాడి మావకేమో మద్రాసులో వ్యాపారం. వీడేమో పెళ్ళాన్ని ఇక్కడికి తీసుకురాడు. దాని వంకపెట్టి మాటిమాటికి అక్కడికి పరుగెత్తుతాడు ఆ మావగార్ని అట్లాగే డబ్బంటూ పీడించుకు తింటాట్ట. అడిగిన డబ్బివ్వకపోతే కూతుర్ని ఎక్కడ చూడడోనని ఆయన భయం. అదీ, ఇదీ అంతా కలిపి ఆ గుర్రప్పందేల్లో చేతులు దులుపుకు వస్తూ వుంటాడు. మళ్ళీ వాడూ వాడి తాళ్ళకొట్టూ యధాప్రకార సిద్ధిరస్తు."

స్నానంచేసి లోపలికి వస్తున్న సుందరయ్యగారు భార్య వల్లిస్తున్నదంతా విని ఒక కేకవేశాడు. "ఎందుకీ పోరుగింటి పురాణాలన్నీ. ఏవిట్రా చెవులు దోరపెట్టుకుని వింటున్నావు ?" అంటూ.

నారాయణ పిల్లిలాగా లోపలికి వెళ్ళిపోయాడు. నత్తిగా మాట్లాడే సత్యన్నారాయణ వెనకాల ఇంత గాథ వుందని ఇవ్వాళే తెలిసింది. సత్యన్నారాయణ అందరి కోపానికి, ఛీత్కారాలకి గురవటానికి కారణమయిన ఆ గుర్రపు పందేలంటే ఏవిటో తెలుసుకోవాలన్న కుతూహలం కలిగింది నారాయణకి. ఆ సాయంత్రం శంకరాన్ని అడిగాడు వాటిని గురించి.

శంకరం కాసేపు ఆలోచించి "ఆ గుర్రాలన్నిటికి రన్నింగు రేసు పెడతారనుకుంటారా ? ఏది ఫస్టు వస్తే దానికి ప్రైజు ఇస్తారేమో" అంటూ తన ఊహాగానాన్ని బయటపెట్టాడు.

నారాయణకి ఆ సమాధానం తృప్తి కలిగించలేదు. గుర్రాలకి ప్రైజు లిస్తే అందులో సత్యన్నారాయణని తిట్టవల్సిన అవసరం ఏమిటో అర్థంకాలేదు. చలపతిని అడిగాడు. చలపతికీ మొదట్లో అర్థంకాలేదు. కానీ చలపతికి రకరకాల స్నేహితులున్నారు. రకరకాల అభిరుచులున్న బంధుబలగం జాస్తీ.

మర్నాటికల్లా నారాయణకి కావలసిన సమాచారం అంతా సమకూర్చుకొచ్చాడు. చలపతి జాకీలు, గుర్రాలు, వాటి పేర్లు, బెట్సు, జాక్‌పాట్లు అంటూ వరసగా చెపుతుంటే నారాయణ, శంకరం కళ్ళు చెవులు అప్పచెప్పి విన్నారు.

“బావ్‌రే. అయితే చూట్టానికి చాలా బాగుంటుందన్నమాట” అన్నాడు నారాయణ కుతూహలంగా.

“మరేట. మా బావ చెప్పాడు లక్షాధికారులు అక్కడికి వెళ్ళి భిక్షాధికారులు అయిపోతార్ట క్షణాల్లో” అంటూ చలపతి వాళ్ళ బావ దగ్గర నేర్చుకున్న దంతా చిలకపలుకుల్లా అప్పచెప్పేశాడు.

శంకరం గుర్తుచేసేవరకూ ఇద్దరికీ మరునాడు జరగబోయే లెక్కల పరీక్ష సంగతే గుర్తులేకపోయింది.

## 3

ఎస్ ఎస్.ఎల్.సి. పరీక్ష లయిపోయినాయి. స్కూలుకి శలవులిచ్చేశారు.

“ఏరా. ఎలా రాశావు పరీక్షలు? గట్టుదాటేటట్టుగా వుందా లేదా?” సుందరయ్యగారు ఆఫీసుకు బయల్దేరబోతూ అడిగాడు కొడుకుని.

“బాగానే రాశాను.” నారాయణ గొణిగినట్టుగా చెప్పాడు. ఆయన ఆదరాబాదరాగా భోజనం ముగించి ఆఫీసుకి బయలుదేరబోతూ “శలవుల్లో గాడిదల్లాగా తిరక్క ఉపయోగపడే పన్లేవన్నా నేర్చుకోండి” అంటూ గొడుగు పుచ్చుకుని వెళ్ళిపోయారు.

నారాయణ తండ్రి వీధి మలుపు తిరిగేంతవరకూ అటే చూశాడు. వేసవికాలం ఎండలో చెమటలు కారుకుంటూ నడిచి వెళుతున్న తండ్రిని చూస్తే నారాయణకి కడుపులో ఏదో బాధగా వుంటుంది వెంటనే ఏదో ఓ గొప్ప పనిచేసేసి, తండ్రిని కూర్చోబెట్టి సమస్త సౌకర్యాలు సుఖాలు అనుభవించేలా చెయ్యాలని వుంటుంది నారాయణకి. ఆయన కొరుపట్టిన బట్టలు వేసుకున్నప్పుడు, ఎండలో నడిచి వెళ్ళేటప్పుడు, అలిసిపోయి సాయంత్రంపూట ఇంటికి రాగానే వాలుకుర్చీలో కళ్ళు మూసుకుని పడుకున్నప్పుడు నారాయణకి మనసులో ఏదో ఆవేశం, ఆప్యాయత, కోపం అన్నీ కలిసికట్టుగా తన్నుకొస్తాయి “నేను మాత్రం అన్నయ్యల్లాగా వుండను. ఎంత కష్టపడి అయినా సరే అమ్మా నాన్నలని సుఖపెడతాను” అనుకుంటాడు ఉద్రేకంగా.

“మీ కేవిటండీ సుందరయ్యగారూ! మహా అదృష్టవంతులు. వేలకి వేలు సంపాదించే కొడుకులున్నారు. ఇంకా ఇంత శ్రమపడతారేవిటండీ హాయిగా

ఇంట్లో కూర్చుని విశ్రాంతి తీసుకోక" అంటూ బంధువులుగానీ, స్నేహితులు గానీ అన్నప్పుడు ఆయన ఓ పేలవమైన నవ్వు నవ్వి వూరుకుంటారు. తండ్రి అలా మౌనంగా. నిర్లిప్తంగా నవ్వినప్పుడు నారాయణ గుండెల నెవరో పట్టి పిండుతున్నట్టుగా బాధపడతాడు.

సుందరయ్యగారికి నారాయణపైన ముగ్గురు కొడుకులు ఓ కూతురు ఉన్నారు. పెద్దకొడుకు చదువు కాగానే తెలిసినవాళ్ళద్వారా హైదరాబాద్‌లోని సెక్రటేరియేట్‌లో ఉద్యోగం వేయించారు. ఆ వెంటనే పెళ్ళికూడా చేసేశారు. పెళ్ళి అయ్యాక మెల్లమెల్లగా తలిదండ్రులున్నారన్న విషయాన్నే మర్చిపో సాగాడు ఆ ఘనుడు. సుందరయ్యగారు బాధపడలేదు. 'లోక రీతే అంత' అనుకున్నారు.

రెండోవాడు విశ్వం చదువులో చురుగ్గా వచ్చాడు. ఆయన తాహతుకి మించినదయినా ఎమ్. ఏ. చదివించారు. చదువుతున్నప్పుడే ఓ గుజరాతీ పిల్లని ప్రేమించాడు విశ్వం. చదువు కాగానే పెళ్ళిచేసుకున్నాడు. కొడుకు పెళ్ళి అయిన తర్వాతనే ఆయనకి ఆ విషయం తెలిసింది. ఆ పిల్ల బంధువు లంతా బొంబేలో వుంటున్నారు. మావగారి పరపతితో విశ్వం మంచి ఉద్యోగాన్నే సంపాదించుకున్నాడు. మరి కొన్నాళ్ళకి భార్యతో కలిసి విదేశాలకి కూడా వెళ్ళిపోయాడు. పార్వతమ్మగారు కొడుకుని తలుచుకుని బాధపడుతుంటే ఆయన కేకలేసేవారు.

"చెట్టు నాటాం కదా అని కాయలన్నీ మనకే కావాలనుకుంటే ఎలాపార్వతీ? అవి ఎవరికి ప్రాప్తో వాళ్ళకే దక్కుతాయి. మన కర్తవ్యం ఏదో అది చెయ్యటంవరకే మన బాధ్యత" అనేవారాయన. కానీ తల్లి ప్రాణం అంత తేలిగ్గా వూరుకునేదిగాదు. గుర్తొచ్చినప్పుడల్లా తమని అంత తేలిగ్గా మరిచి పోయిన ఆ కొడుకుని తల్చుకుని ఏడుస్తూ వుంటుందావిడ. అలాటి సమయాల్లో నారాయణ మనసులో 'ఏమయినా సరే నేను ఒక్కనాటికీ అమ్మనీ, నాన్ననీ ఇలా బాధపెట్టను' అని దృఢంగా అనుకుంటూ వుంటాడు.

విశ్వం విదేశాలకి వెళ్ళేముందర వచ్చి తలిదండ్రుల్ని చూసి ఓ గంట సేపు వుండి వెళ్ళిపోయాడు 'పోనీలే గుర్తుపెట్టుకుని వచ్చావు అదే పదివేలు' అన్నారు సుందరయ్యగారు. విశ్వం ఆ మాటల్లోని తండ్రి బాధనిగానీ, ఆవేదననుగానీ అర్థం చేసుకున్నా పట్టించుకునే స్థితిని ఏనాడో దాటిపోయాడు. తల్లి బలవంతాన భోజనానికి కూర్చుని 'బాబోయ్ మన ఆంధ్రుల కారాలు

ఎవ్వరూ తినలేరు' అంటూ, తల్లి ఎంతో ప్రేమగా, ఆప్యాయంగా తన కిష్టమని తయారుచేసిన పదార్థాలన్నీ అటూ ఇటూ నెట్టేసి పెరుగుపోసుకుని తిని వెళ్ళిపోతూంటే ఆవిడ మనసు గిలగిల్లాడిపోయింది. మనసుకి కానరాని గాయం తగిలినట్టుగా మౌనంగా ఉండిపోయింది నారాయణకి తల్లిని చూసి కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి.

"పోనీ అమ్మా వెధవని. వాడికోసం బాధపడతావెందుకు?" అన్నాడు కసిగా. అమూల్యమైన తల్లి ప్రేమని అలా నిర్లక్ష్యం చేసిపోయిన అన్నగారంటే నారాయణకి ఎక్కడలేని కసి, అసహ్యం కలిగినాయి

నారాయణ పైవాడు శ్రీధరం. చదువులో అంతంత మాత్రమే సుందరయ్య గారు అతి ప్రయత్నంమీద కొడుక్కి ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటులో ఉద్యోగం వేయించారు. శ్రీధరానికి వచ్చేది అతనికే సరిపోదు దానికితోడు ఏడాదిలో ట్రాన్స్ఫర్. రైలు ఖర్చులకే బోలెడంత అవుతాయి అని రెండేళ్ళకోసారయినా రాడు శ్రీధరం. శ్రీధరం పైది శారద. మంచి వుద్యోగంలో వున్న కుర్రాడిని చూసి వెనకా ముందు బాదరబందీలు లేవంటూ హైస్కూలు చదువయినా దాటని శారదకి పెళ్ళిచేసి పంపించేశారు. చివరికి వాళ్ళదగ్గర మిగిలింది నారాయణ మాత్రమే. ఆ దంపతులిద్దరి ఆశలూ నారాయణ మీదేను చివర్రోజుల్లో నారాయణయినా తమ చేతికి ఆసరా అయ్యేట్టు చూడమని ఆ దంపతుల మూగ ప్రార్థన కానీ విధి అనేది ఏ క్షణంలో ఎవరితో ఎలా ఆడుకోవాలనుకుంటుందో అదిమాత్రం మానవ మేధకి అనూహ్యంగదా!

చలపతి, శంకరం, నారాయణ శలవలు ఎలా గడపాలన్న ఆలోచనలో వున్నారు.

"నేను మెద్రాసు మా మామయ్యగారింటికి వెడుతున్నాను మా పెదనాన్న గారమ్మాయి పెళ్ళికూడా వుంది" అన్నాడు చలపతి. "మా బావ రేస్‌కోర్స్ గ్రౌండ్స్ అవన్నీ చూపిస్తానన్నాడురోయ్." రహస్యంగా చెప్పాడు.

"మా అక్కయ్య దగ్గరికి వెళ్ళమంటోంది అమ్మ. కానీ ఆ వూళ్ళో కాల క్షేపం కాదురా బాబూ బోర్ కొట్టేస్తుంది. చూసేందుకూడా ఏమీ వుండవు." నిరుత్సాహంగా అన్నాడు నారాయణ

శంకరం మౌనంగా వాళ్ళ మాటలు వింటూ వున్నాడు శంకరానికి శలవల్లో వెళ్లి చూడతగ్గ దగ్గర బంధువులు గానీ, ఆప్యాయంగా ఆదరించేవాళ్ళుగానీ ఎవరూ లేరు. శంకరానికి ఐదో ఏటనే తల్లీ దండ్రీ ఇద్దరూ పోయారు. అప్పటికి

శంకరం చెల్లెలు గిరిజ మూడేళ్లది. బాధ్యతగా దగ్గరకి తీసుకుని పెంచే బంధువు లెవ్వరూ లేకపోయారు వాళ్ళకి. ఏమీకాని శాంతమ్మ ఆ దిక్కులేని పిల్లల్ని చూసి జాలిపడి చేరదీసింది. పెంచి పెద్దవాళ్లని చేసింది. ఆ అన్నా చెల్లెళ్లిద్దరికి ఈ ప్రపంచంలో వున్న ఆత్మీయురాలు ఆవిడ ఒక్కతే. ఆ కారణంగానే శంకరం అంత చిన్న వయసులోకూడా ఇంటి బాధ్యతంతా మీద పడినట్టుగా పెద్దతరహాగా ప్రవర్తిస్తూ వుంటాడు.

నారాయణ మౌనం గమనించిన నారాయణ అన్నాడు. "శంకరం నువుకూడా రారా మా అక్కగారింటికి. నాక్కూడా కాలక్షేపం అవుతుంది" అన్నాడు.

"ఊహు నేనెక్కడికీ రానురా మా గిరిజని, మామ్మని విడిచిపెట్టి" అన్నాడు దృఢంగా శంకరం.

ఆ శలవల్లో శారద దగ్గర కొన్నిరోజులు గడిపి మేనమామగారింటికి వెళ్ళాడు నారాయణ.

శంకరం మేనమామ జగన్నాధంగారు పేరుమోసిన లాయరు. రెండు చేతులా సంపాదిస్తున్నారు. పొలాలున్నాయి, రకరకాల కంపెనీల్లో షేర్లున్నాయి. రకరకాల సంఘాల్లో సభ్యత్వాలున్నాయి, గౌరవ పదవులున్నాయి. ఎప్పుడూ వూపిరి పీల్చుకోవటానికి కూడా టైంలేని వ్యక్తిలాగా హడావిడిగా వుంటాడు. ఆయన నిద్రలేవకముందునించే జనం ఆయనకోసం ఎదురుచూస్తూ కూర్చుని వుంటారు. అర్ధరాత్రవుతున్నా బలవంతాన వాళ్ళని వదుల్చుకుని రావల్సిందే గానీ వాళ్ళంతటవాళ్ళు వదలరు. నారాయణని అన్నిటికంటే ఎక్కువ ఆకర్షించింది ఆయన రెండుచేతులా డబ్బుని ఖర్చుపెట్టే పద్ధతి!

"ఇదుగో వెంకట్రావ్ ఈ వెయ్యి తీసుకువెళ్లి ఆ ఎరువుల బస్తాలు పొలాల్లోకివించు" అంటూ నోట్ల కట్టలు ఎగరేసేవాడు.

"రాఘవులూ కరువంతా నీ దగ్గరే మండిపోతున్నట్టుందే. మామిడి రసాలు పాతిక ముప్పైరూపాయలా? ముప్పైగిప్పైలేదు. వంద చేసుకుని ఓ వంద పంపించు" అంటూ వందరూపాయల నోటుని చింపిరి కాగితంలాగా ఎగరేసేవాడు

పదివేలు అర్జంటుగా సర్దగలరా అవసరం పడింది అంటూ ఫోనుచేసిన పెద్ద మనిషితో "పది లేవండీ కావాలంటే ఐదు సర్దగలను" అంటూ మాంత్రికుడు టోపిలోంచి నోట్ల కట్టల్ని తీసినట్టుగా ఇనప్పెట్టె తెరిచి అందులోంచి కట్టలు కట్టలుగా కట్టిన డబ్బుని లెఖ్ఖలేనట్లుగా ఖర్చుపెట్టేవాడు.




"సంపాయించేది తినటానికి కాదుటండీ! అనుభవించకపోతే ఈ సంపాదించేది ఎవరికోసం చెప్పండి. రేపు నే చచ్చిపోయిన తరువాత ఈ పిల్లవెధవలు సరిగా తద్దినాలయినా పెడతారో లేదో?" అంటూ జోక్ చేశేవాడు.

ఆయనకి ఇంటికి ఎవరొచ్చారో, ఎవరు వెళ్ళారో కూడా తెలియనట్టే వుండేది. నారాయణ వచ్చిన రెండురోజుల తరువాత భోజనం చేస్తూన్న జగన్నాథం గారు ఎదురుగా నిలబడిన మేనల్లుడిని చూశారు.

"ఓరి నీ నారాయణా! ఎప్పుడొచ్చావురా? రైలుకా, బస్సుకా? అమ్మా, నాన్నా అంతా బావున్నారా? ఏమర్రా! నారాయణకికూడా భోజనం వడ్డించండి" అంటూ హడావిడి చెయ్యటం మొదలుపెట్టాడు.

నారాయణకి నవ్వొచ్చింది. "బాగానేవుంది మీ సంబరం. నారాయణ వొచ్చి రెండురోజులయితే ఇప్పుడేనా రావటం అంటూ అడుగుతారేవిటి?" అంటూ ఆయన భార్య నవ్వింది.

ఇంతకీ ఈ రెండు రోజుల్నుంచి నారాయణ ఆయన పక్కనే వుంటూ ఆయన ప్రతి చర్యా శ్రద్ధగా గమనిస్తున్నాడు. ఆయన అడిగినప్పుడల్లా ఇంట్లోంచి డబ్బు తీసుకొచ్చి చేతికి ఇస్తూనే వున్నాడు.

జగన్నాథంగారు ఎంతో దర్జాగా బట్టలేసుకుని కార్లలో వచ్చేవాళ్ళని కూడా లెఖ్ఖలేనట్లుగా మాట్లాడటం, ఆయన కేకలేస్తున్నా కిక్కురుమనకుండా వాళ్ళు అవన్నీ భరించటం, ఆయన జారీచేసే ఆర్డర్లన్నీ క్షణాల్లో నెరవేరిపోతూ

వుండటం, విచ్చలవిడిగా రెండుచేతులా డబ్బు ఖర్చుపెట్టే తీరూ ఇవన్నీ చూసిన నారాయణకి ఇదో సరికొత్త అనుభవం

నారాయణకి ఇంటిదగ్గర సొంతానికి అంటూ ఎప్పుడూ డబ్బుండేది కాదు. ఏదయినా అవసరానికి భయపడుతూ తండ్రిని అడిగేవాడు. పది రూపాయలు అడిగితే తండ్రి ఐదు రూపాయలిచ్చేవాడు. మిగిలినవి పై నెల్లోకొందుగానిలే అనేవాడు. జగన్నాథంగారింట్లో పిల్లలుకూడా పదిరూపాయల నోట్లని లెఖ్ఖ లేనట్టుగా ఖర్చుచెయ్యటం నారాయణకి విచిత్రంగా వుండేది. నారాయణ వూరు తిరిగి వెళ్ళేటప్పుడు తను ఇన్నాళ్ళు బ్రతికింది ఎంత అర్థవిహీనమయిన బ్రతుకో, తను ఎన్నెన్ని సరదాలు, ధనలోపంవల్ల కోల్పోతున్నాడో తెలిసినట్లయింది. జీవితంలో మజా రావాలంటే ఎలా జీవించాలో, దానికో పంచాక్షరీ మంత్రం వుందని బోధపడినట్లయింది. అదే 'ధనదేవత' అనుకున్నాడు.

## 4

నారాయణ శలవలు ముగించి ఇంటికి తిరిగివచ్చేసరికి పరీక్షల రిజల్ట్సు వచ్చినాయి. శంకరం పాసయినాడు. నారాయణ, చలపతిల పరీక్ష పోయింది. పరీక్ష పోయిన దిగులుకంటే ఎక్కువగా దిగాలు పడిపోయిన తల్లిని తండ్రిని చూసి నారాయణ మరింత నిరుత్సాహపడిపోయాడు.

ఓ రోజు తెల్లవారేసరికి వూరంతా పొగలాగా గుప్పున ఓ వార్త వ్యాపించింది. 'తాళ్ళ సత్యానికి' గుర్రపు పందాల్లో ఆరు లక్షల రూపాయలొచ్చాయట! వూరిలో ఏ వీధిలో, ఏ షాపులో చూసినా, ఏ మనిషి నోటవిన్నా ఇదే మాట! నారాయణకి పరీక్ష పోయిందన్న దిగులు ఈ వార్త కలిగించిన సంచలనంలో కొంత సర్దుకుంది.

చలపతి మరో వారం రోజుల తరవాత వచ్చాడు. పరీక్ష పోయిందన్న విచారమే లేదు. మంచి స్టైయిల్స్‌లో బట్టలు కుట్టించి తెచ్చుకున్నాడు. అవన్నీ మేనమామ ప్రజంట్ చేశాడట! తను చూసిన రేస్‌కోర్సు, తిరిగిన జాగాలు, చూసిన వింతలు అన్నీ కళ్ళముందు కదిలేట్టుగా వర్ణించి చెప్పాడు. చలపతి రాక నారాయణలో మిగిలివున్న విచారాన్ని పోగొట్టింది.

మిత్రులు ముగ్గురూ వారంరోజులపాటు సత్యన్నారాయణ తాళ్ళకొట్టు ముందు నించి తిరిగారు. కొట్లో సత్యనారాయణ జాడలేదు. పిచ్చయ్య మాత్రం కొట్లో కూర్చుని కనిపించాడు. ఉబ్బిపోయిన బెలూన్‌లాగా పిచ్చయ్య మహా సంతోషంగా వున్నాడు.

"సత్తెంగారు ఎపుడొస్తాడయ్యా!" అని అడిగాడు నారాయణ.

'వచ్చెయ్యాల్సిందే ఈపాటికి. నిన్న వస్తానని రాశాడు. నిన్నరాత్రంతా ఏ కారు హారను వినిపించినా సత్యమే వచ్చాడేమోనని ఎదురు చూడటంతోనే సరిపోయింది" అన్నాడు పిచ్చయ్య.

"ఓరి నీ గొప్పలు త"లెయ్యా" అన్న చలపతి మాటలు విని గుర్రుగా చూసేడు పిచ్చయ్య. మరే వాగుడు వాగకముందే శంకరం, నారాయణ చలపతిని అవతలికి లాక్కుపోయారు.

నాలుగురోజుల తరువాత సత్యన్నారాయణ దిగాడు నల్లటి ఎంబాసిడర్ కారులో. సరాసరి కార్లో కొట్టు దగ్గరికే వచ్చాడు. మనిషి ట్రిమ్ముగా డ్రస్సయి వున్నాడు. అప్పుడే మనిషిలో డబ్బు తెచ్చిన నిర్లక్ష్యం మెల్ల మెల్లగా ప్రవేశిస్తోంది. రెండ్రోజులు తాళ్ళకొట్టు తిరనాళ్ళలాగా తయారయింది. ప్రతివాళ్ళూ రావటం, సత్యన్నారాయణని అభినందించి, అతని అదృష్టాన్ని పొగడటం, వివరాలన్నీ అడిగి తెలుసుకోవటం, లోపల్లోపలే అసూయపడుతూ 'ఓరి నీ సత్తిగా, నీకెంత అదృష్టం పట్టిందిరా నత్తి వెధవా' అనుకుంటూ తిరిగి పోవటం !

వారంరోజుల తరువాత నారాయణ అటుగా వెడుతూ తాళ్ళకొట్టువైపు చూశాడు. సత్యన్నారాయణ సిగరెట్టు కాలుస్తూ దర్జాగా కూర్చుని వున్నాడు. గ్లాస్కోలాల్చి, పంచెలో తెలుగు సినిమా హీరోలాగా వున్నాడు. నారాయణని చూస్తూనే చెయ్యూపి రమ్మన్నట్టుగా సైగ చేశాడు.

"ఏ ఏ ఏవోయ్ నారాయణా, బ్బా బ్బా బాగున్నావా ?" అంటూ పలకరించాడు.

"భలే ఛాన్సు కొట్టేశారండీ సత్యంగారూ" అన్నాడు నారాయణ ఆరాధనగా సత్యన్నారాయణ వైపు చూసి

"దా కూర్చో" అంటూ కాగితంలో వున్న వేయించి కారం చల్లిన జీడిపప్పు ఓ గుప్పెడు నారాయణ చేతిలో పోశాడు. స్థితి మారటంతో మరమరాలు కాస్తా జీడిపప్పుల్లోకి మారింది.

జేబులోంచి పది రూపాయల నోటు తీసి పిచ్చయ్య వైపు విసిరేస్తూ 'గో, గో, గోల్డ్ ఫ్లేక్' అనే లోపలే పిచ్చయ్య నోటు పుచ్చుకొని పక్కకొట్లోకి పరుగెత్తాడు.

నారాయణకి ఇందాకటినించీ ఓ ప్రశ్న మనస్సులో వేధిస్తోంది. "సత్యంగారూ, ఇంత డబ్బు ఏం చేసుకుంటారండీ?" చిట్టచివరకు అడిగేశాడు.

సత్యన్నారాయణ నోట్లోవున్న పళ్ళన్నీ వూగిపోయేట్టుగా నవ్వాడు. "ఐ ఐ ఐలే ప్రశ్న ఏ ఏ ఏళావే ?" నారాయణకి అందులో అంత నవ్వవలసింది ఏముందో అర్థంకాలేదు.

"నీ్న నీ్న, నీకే వస్తే, న్ను న్ను నువ్వేంజేస్తావ్ ?" అంటూ ఎదురడిగాడు సత్యన్నారాయణ

నారాయణకి వెంటనే జవాబు తట్టలేదు. నిజమే తనకే అంత డబ్బు ఒక్కసారిగా వస్తే ! నారాయణ గుండె ఒక్క క్షణం వేగంగా కొట్టుకుంది. అయోమయంలోపడ్డ నారాయణని చూసి సత్యన్నారాయణ నవ్వాడు.

"నా న్నా నా పనీ అట్టాగే వుంది" అన్నాడు చివరికి నారాయణకి ఎందుకో ఒక్కసారి సత్యన్నారాయణ తలిదండ్రుల్ని చూడాలనిపించింది. ఇదివరకల్లా ఇద్దరూ సత్యన్నారాయణకున్న చెడుఅలవాటుని చూసి తిట్టి,ఏడ్చారు. ఇప్పుడదే దారి తప్పి అదృష్టంగా మారి సత్యన్నారాయణ గళసీమని అలంకరించింది. ఈ హఠాత్ ధనప్రాప్తికి ఆ ముసలివాళ్ళిద్దరూ సంతోషపడుతున్నారా దుఃఖపడుతున్నారా అన్న కుతూహలం కలిగింది.

నారాయణ ఇంటికి వెళుతూ సత్యన్నారాయణ ఇంటి దగ్గర ఆగి లోపలకు చూశాడు. ఇంటి ముందర ఓ కారు ఆగి వుంది మెడనిండా నగలు దిగేసుకుని, ఖరీదయిన జరీ చీర. పెద్దముడిచుట్టూ పూలు చుట్టుకొనివున్న ఓ లావుపాటి ఆవిడతో సత్యన్నారాయణ తల్లి సంతోషంగా ఖబుర్లు చెపుతోంది. ఎప్పుడూ లేనిది లోపల్నించి ముసలాయన నవ్వు పెద్దగా వినిపిస్తోంది. వాళ్ళంతా చాలా సంతోషంగా వున్నట్టు రూఢి అయింది నారాయణకి. డబ్బు సపాదించే మార్గం ఏదయినా ఫరవాలేదు. జీవితంలో సంతోషంగా, సుఖంగా వుండటానికి మాత్రం డబ్బు ముఖ్యం అనుకున్నాడు నారాయణ. ఇంటికి రాగానే తల్లి పక్కింటివాళ్ళతో అనటం వినిపించింది నారాయణకి. సత్యన్నారాయణ భార్య పెళ్ళి అయిన అయిదేళ్ళ తరువాత అత్తారింటికి వచ్చేసిందిట !

## 5

శంకరం కాలేజీలో చేరిపోయాడు. నారాయణ, చలపతి సెప్టెంబరుకి కట్టి మళ్ళీ తప్పారు. మార్చికి కట్టి ఎలాగో పాసయ్యారు.

సత్యన్నారాయణ శ్రీనివాసపురంలో వెయ్యిగజాల స్థలంలో బ్రహ్మాండమయిన మేడ కట్టించాడు. అన్ని హంగులతోనూ మేడ పూర్తయిన రోజున వూళ్ళోని పెద్దలందరికి ఘనమయిన విందు చేశాడు. 'గజలక్ష్మి సదన్' అని రాసివున్న

తెల్లటి పాలరాతి ఫలకాన్ని గేటుకి తాపడం చేయించాడు. సత్యన్నారాయణ భార్య ఆ పాలరాతిని చూసుకుని మురిసిపోయిందిట. ఆవిడ పేరు గజలక్ష్మి.

మరో ఏడాది గడిచింది. నారాయణ, చలపతి కాలేజీలో మొదటి సంవత్సరం పూర్తిచేశారు. శంకరం బి ఎ.లో చేరాడు. సత్యన్నారాయణ వాళ్ళ వార్డులో కౌన్సిలరుగా నిలబడి గెలిచాడు. మెయిన్ రోడ్డుమీద "సత్యన్నారాయణ సిల్కు ప్యాలెస్" అంటూ ఓ వస్త్ర దుకాణం వెలిసింది. దాని ఓనరు తాళ్ళ సత్యన్నారాయణే! పెద్దకాలువ రోడ్డుమీద "సత్యనారాయణ టింబరు డిపో" వెలిసింది. దాని ఓనరు కూడా సత్యన్నారాయణే !

పూర్వపు తాళ్ళకొట్టు సత్యం బ్రతుకు పూర్తిగా మారిపోయింది. 'ఏరా సత్యం, సత్తిగా' అనే వాళ్ళంతా గౌరవంగా 'బాబూ సత్యన్నారాయణా' అంటూ గౌరవంగా పిలుస్తున్నారు. కౌన్సిలరు సత్యన్నారాయణగారు అంటున్నారు అతనితో పని వున్నవాళ్ళంతా. సత్యన్నారాయణ వేషం మారింది, హోదా పెరిగింది, ఫ్రెండ్స్ సర్కిల్ మారింది. నలుగురిలోనూ గౌరవం పెరిగింది. వూళ్ళోని 'పెద్దవాళ్ళు' అనబడే వాళ్ళంతా సత్యన్నారాయణతో స్నేహం కలిపారు.

కార్లలో తప్ప తిరగడు. ఖరీదయిన సిగరెట్లు తప్ప కాల్చడు. మడత నలగని బట్టలు తప్ప మరోటి తొడగడు. గుర్రపు పందేల వ్యసనం మరింత పెరిగింది. అయినా అతన్నిప్పుడు తలితండ్రులు తిట్టటం, శపించటం చెయ్యటం లేదు. 'బాబూ ఈ అలవాటు తగ్గించుకోరా సత్యం. లక్ష్మీదేవి చాలా చపలమయిందిరా. ఎట్టా వచ్చిందో అట్టాగే పోయే గుణం వున్నది. వున్నది జాగ్రత్త చేసుకుని ఇంక ఆ జోలికి పోకు నాయనా' అంటూ తల్లి నచ్చచెప్పబోయింది. కొడుకు అయిష్టాన్ని గమనించి మారు మాట్లాడక వూరుకుంది.

సత్యన్నారాయణ ఎంత మారినా అతని దగ్గర నారాయణ చనువు మాత్రం తగ్గలేదు. నారాయణ సరాసరి "సత్యన్నారాయణ సిల్క్ పేలెస్" లోకి వెళ్ళిపోతాడు సత్యన్నారాయణ ఆ సమయానికి అక్కడుంటే కుర్చీ తెప్పించి వేసి నారాయణని కూర్చోపెడతాడు. చల్లటి గోల్డుస్పాట్ తెప్పించి ఇస్తాడు. "ఏ ఏ ఏంటి కబుర్లు న్నా న్నా నారాయణా" అంటూ చిరునవ్వుతో పలకరిస్తాడు.

సత్యన్నారాయణ వొంటి నుంచి వెదజల్లుతున్న సెంటువాసనల్ని ఆఘ్రాణిస్తూ, ఫేనుకింద చల్లటి గోల్డ్‌స్పాట్ తాగుతున్న నారాయణకి తానో

స్వర్గం వచ్చానా అన్న అనుమానం కలుగుతూ వుంటుంది. చుట్టూ నిగనిగలాడే ముచ్చటయిన బీరువాలు, వాటినిండా కనువిందు చేస్తూ, తళతళా మెరుస్తూ రకరకాల బట్టలు, తెల్లగా మెరిసిపోతున్న కౌంటరు, కొట్టునిండా కిటకిట లాడుతూ రకరకాల మనుషులు—వీటన్నిటిని నారాయణ ఆశ్చర్యం నిండిన కళ్ళతో చూస్తూవుంటాడు. జీవితంలో తనుకూడా ఎప్పుడయినా ఇలాటి జీవితాన్ని అనుభవించగలడా లేకపోతే తండ్రిలాగానే మున్నూట అరవై రోజులూ గాడిద చాకిరీ చేస్తూ చాలీ చాలని జీతంతో, చస్తూ బ్రతికే ఆ జీవితమే తన మొహాన రాసిపెట్టివుందో. ఏమయినా సరే, ఏనాటికియినా తను సత్యన్నారాయణలాగా దర్జాగా బ్రతుకుతాడుగానీ, తండ్రిలాగా ఆ బండెడు బరువు మోస్తూ ఆ సారవిహీనమయిన జీవితాన్ని మాత్రం గడపలేడు అనుకుంటూ వుంటాడు నారాయణ.

సత్యన్నారాయణకి నారాయణ మొహంలోని ఆరాధన, కళ్ళలోని ఆ తన్మయత్వం తన ఎదుగుదలకి కొలమానం అనిపించింది. నారాయణ బుర్రలో మెదుల్తున్న ఆలోచనల్ని పసిగట్టినట్టుగా చిరునవ్వు నవ్వేవాడు తృప్తిగా. మనిషికి ధనసంపదలు వుండగానే తృప్తి కలగదు. వాటిని చూసి నలుగురూ ఈర్ష్యపడినప్పుడే తృప్తి కలుగుతుంది. సత్యన్నారాయణకి అలాటి తృప్తి నారాయణ దగ్గర దొరికేది,

"నే్న నే్న నేను ప వ పట్నం పోతున్నా న్నా న్నా నారాయణా, ను ను నువు కూడా వస్తావా?" అన్నాడో రోజున. నారాయణ ఎగిరి గంతేసి నంత పనిచేసి "నిజంగానాండీ" అన్నాడు.

"కొ్క కొ్క కార్లో వెడుతున్నా, ను ను నువ్వు గూడా రా" అన్నాడు సత్యన్నారాయణ. నారాయణ వెంటనే ఒప్పుకొన్నాడు.

తండ్రితో అక్కగారి వూరు వెడుతున్నానని మొదటిసారిగా అబద్ధం ఆడి, సత్యన్నారాయణ వెంట మద్రాసు వెళ్ళాడు. సత్యన్నారాయణకి వందిమాగధ బృందం ఎక్కువయింది. నారాయణలాటి మరో నలుగుర్ని వెంటవేసుకుని మద్రాసంతా తిప్పి చూపించాడు.

నారాయణకి ముఖ్యంగా నచ్చింది రేస్‌కోర్సు. అక్కడ మంచినీటి ప్రవాహంలా ప్రవహిస్తూ, క్షణాల్లో చేతులు మారిపోతున్న డబ్బు నారాయణ కళ్ళని మిరుమిట్లను గొల్పింది. ఆ జనం, ఆ హుంషారు, ఆ కేకలు, ఆ ఆదుర్దా, పోగొట్టుకున్నవాళ్ళ ఏడుపు మొహాలు, గెల్చినవాళ్ళ సంరంభం-అదో విచిత్ర

ప్రపంచం. ఆకాసేపూ అదే నిజ ప్రపంచం. అక్కడున్న కాసేపు జీవితంలోని ఏ బాధలూ, భయాలూ గుర్తుకి రావు సత్యన్నారాయణ పక్కనే వుండి అన్నీ గమనిస్తున్నాడు నారాయణ ఆసారి సత్యన్నారాయణ పదివేల రూపాయలు గెల్చుకున్నాడు. ఆ నోట్ల కట్టల్ని చూసి నారాయణ ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు. ఖుషీగా జల్సాగా ఖర్చుపెడుతున్న సత్యన్నారాయణ కొత్తవ్యక్తి లాగా కనిపించాడు నారాయణ కళ్ళకి. ఏమయినా సరే తను మాత్రం పైసా పైసాకి పీక్కుచచ్చే జీవితం మాత్రం గడపలేడు. కాకిలా కలకాలం బ్రతికే కంటే హంసలా అరఘడియైనా చాలు అన్న నిశ్చయానికి వచ్చాడు. తిరుగు ప్రయాణంలో శారద వాళ్ళవూరిలో ఓ పూట వుండి వచ్చాడు. తండ్రికి తన అబద్ధం తెలుస్తే కోపంతో ఉగ్రుడయిపోతాడని తెలుసు నారాయణకి.

* * *

రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాల్ని తనలో కలుపుకుంటూ కాలచక్రం గిర గిర తిరుగుతూనే వుంది. మరో అయిదు సంవత్సరాలు గడిచినాయి. శంకరం బి. ఎ. పూర్తిచేసి ఎల్. ఐ. సి.లో వుద్యోగం సంపాదించుకున్నాడు. చలపతి ఇంటరు పూర్తికాకుండానే చదువుకి స్వస్తి పలికాడు. నారాయణ బి. ఎ. డిగ్రీతో కుస్తీ పట్టి ఫలితంలేక వదిలేశాడు. సత్యన్నారాయణ మున్సిపల్ ఛైర్మన్ అయ్యాడు.

## 6

వసుంధరాదేవి వీక్లీ చదువుతూ తన గదిలో ఫోమ్‌బెడ్ మీద పడుకుని వుంది.

"మమ్మీ, మమ్మీ" కేకలు పెడుతూ పైకివచ్చాడు చలపతి.

"చలం ఏవిట్రా ఆ కేకలు. ఇక్కడున్నా ఇలారా" అంటూ పిల్చిందావిడ.

చలపతి తల్లిగదిలోకివచ్చి "హాయ్ మమ్మీ, నువ్విక్కడున్నావా? నీ కోసం ఇల్లంతా వెతికేను మమ్మీ" అంటూ నీరసం పోజు పెట్టి తల్లి పక్కన కూర్చున్నాడు

ఆవిడ ప్రేమగా కొడుకు వీపు నిమిరింది. షర్టుమీద పడ్డ ముడతని సరిచేస్తూ "ఏవిటి బాబూ, ఏం కావాలి?" అంటూ ప్రేమగా అడిగింది.

"మమ్మీ నాకో వెయ్యి రూపాయలు కావాలి" పది పైసలు కావాలన్నంత తేలిగ్గా అడిగేశాడు చలపతి.

"వెయ్యి రూపాయలా? మొన్ననే గదురా ఎనిమిది వందలు కావాలని పట్టికెళ్ళావు. అంత క్రితం వారం వెయ్యిరూపాయలు పట్టుకెళ్ళావు?"

"అబ్బ ఏమిటి మమ్మీ నువ్వుకూడా డాడీకిమల్లే క్రాస్ ఎగ్జామినేషన్ చేస్తావు. నువ్వు ఇల్లు కదలవు. నీకు బయటి ప్రపంచం సంగతి ఏం తెలుస్తుంది ? అలా ఓసారి బయటికి వచ్చిచూడు ధరలు ఎలా మండిపోతున్నాయో. సినిమా టిక్కెట్టు నాలుగు రూపాయలు చేసి పారేశారు. టాక్సీ రేట్లు పెంచేశారు. డ్రింక్స్ ధర పెరిగిపోయింది. ఆఖరికి పుచ్చు బెండకాయలు కిలో నాలుగు రూపాయలంట." ఉపన్యాసం దంచేశాడు చలపతి.

"అబ్బబ్బ, సరేరా. ఇంతకీ నీకు డబ్బెందుకు?" వసుంధరాదేవి కళ్ళజోడు సవరించుకుంటూ అడిగింది.



మద్రాసు వెళ్ళాలనీ, రాజ్యం రమ్మనమని లెటర్ వ్రాసిందనీ బొంకాడు చలపతి. తల్లి సంతోషించింది. కాని ఆవిడ దగ్గర డబ్బు లేదు. తండ్రిని అడగమంది. తాను తోడు వస్తానంది.

చలపతికి కొండంత ధైర్యం తల్లిఅండని చూసుకుని. చకచక మేడ మెట్లు దిగి తండ్రి గదిలోకి రాగానే అడుగులు ఆగిపోయినాయి. తన రాకని సూచిస్తూ మెల్లిగా దగ్గాడు.

టేబుల్ ముందు కూర్చుని ఏవో లెక్కలు చూసుకుంటున్న రాజేశ్వర్రావు తలఎత్తి చూసి, మళ్ళీ తన పనిలో మునిగిపోయాడు.

చలపతి టేబుల్ దగ్గరగా వచ్చి "డాడీ, నాకో వెయ్యి రూపాయలు కావాలి !"

ఆయన చటుక్కున తల ఎత్తి కొడుకువైపు నిదానంగా ఓ క్షణం చూసి మళ్ళీ తన పనిలో మునిగిపోయాడు. చలపతికి తండ్రితో మాట్లాడాలంటే భయం. ఆయన చిటికి చిటికి ఏదో ఒకటి తేల్చడు ఆయన దగ్గరకొచ్చేసరికి చలపతికి మాటల్లో ఫోర్సు కాస్తా తగ్గిపోతుంది. నిస్సహాయంగా చూస్తున్న చలపతికి సహాయంగా వసుంధరాదేవి లోపలికి అడుగుపెట్టింది.

"వాడేమిటో అడుగుతున్నాడు. విన్నారా !" అందావిడ ధాటిగా.

ఆయన తలఎత్తి 'ఓహో నువ్వూ వచ్చావు' అన్నట్టుగా ఓ చూపుచూసి, "విన్నాను. ఎందుకు అని అడుగుతున్నాను" అంటూ మళ్ళీ తనపని చేసుకో సాగాడు.

ఆవిడ మనుషుల్లోని నిర్లక్ష్యవైఖరిని ఎంతమాత్రమూ భరించలేదు. భర్త ధోరణి చూసి కోపం పొంగుకొచ్చింది.

"ఎందుకేమిటి ? బయటతిరిగే మగపిల్లవాడికి ఎన్నో ఖర్చులుంటాయి. వాడేమయినా ఆడపిల్ల గనుకనా ఇల్లు కదలకుండా ఓ మూల కూర్చోటానికి. ఎందుకు, ఏవిటి అంటే ఏం చెపుతాడు ?" అందావిడ.

"నువు చెప్పింది బాగానే వుంది. వాడి సంపాదన వాడు ఎలా ఖర్చు పెట్టుకున్నా నేను అడగను. కాని ఇవ్వాల్సింది నేను గాబట్టి ఎందుకో కారణం తెలుసుకోవాల్సిన బాధ్యత నాకుందనుకుంటాను" అన్నాడాయన శాంతంగా తల ఎత్తకుండానే.

చలపతి మొహం ఎర్రబడింది. వసుంధరాదేవి ముక్కుపుటాలు అదిరినాయి కోపంతో.

"మీకు మీ వ్యాపారం, బిజినెస్సు, మిల్లులు ఇవి తప్ప మరోదేదీ బుర్రకి ఎక్కదా ? పెళ్ళాం పిల్లలు ఎలాపోయినా మీకు అక్కర్లేదన్నమాట, అంతేనా ?"

"అబ్బబ్బ వసూ నేనేమన్నానని ఇంత రాద్ధాంతం చేస్తావు? వాడికి అంత డబ్బు ఎందుకో అడిగాను. తప్పా?" ఆయన విసుగ్గా పుస్తకాలు మూసి టేబుల్ మీద పడేశాడు.

"మీరు ప్రతిదానికి ఇలాగే ఆరాలు తీస్తూవుంటే వయసొచ్చిన పిల్లవాడు ఎంత అభిమాన పడతాడో ఎప్పుడయినా ఆలోచించారా! మీ బుర్ర ఎప్పుడూ లెక్కల్లో తప్ప మరి దేంట్లోనూ పనిచెయ్యదయ్యే." ఆవిడ కోపం క్షణక్షణానికి పెరిగిపోతోంది.

"వయసొచ్చిన పిల్లవాడు గనుకనే వాడి బాధ్యత వాడికి గుర్తుచేస్తున్నాను. చదువూ సంధ్యా లేకుండా, కానీ సంపాదించే తెలివితేటల్లేకుండా వీడు వేలకివేల డబ్బుతో చేసే ఘనకార్యం ఏవిటీ అని అడుగుతున్నాను. అసలు వాడు ఇలా పాడయిపోవటానికి కారణం ఎవరో తెలుసా? నువ్వు. క్షణక్షణం వాడిని వెన కేసుకొచ్చి వాడి వెధవపనులన్నీ కప్పిపెడుతున్ననువ్వు వాడికి చదువుఎందుకు అంటలేదోతెలుసా. నువ్వు, నీ గారాబం. పాతికేళ్ళొస్తున్నా వాడికి తనకాళ్ళమీద తను నిలబడాలన్న జ్ఞానం, ఎందుకు కలగలేదో తెలుసా? నువ్వు, నీ గారాబం! వాడు బయట తిరిగి చేసే ఘనకార్యాలేవిటో ఏనాడన్నా తెలుసుకున్నావా?' రాజేశ్వర్రావు అలా గట్టిగా, కోపంగా మాట్లాడగానే వసుంధరాదేవికి తను తగ్గక తప్పదని తెలుసు. గొంతుని మృదువుగామార్చి అంది.

"వాడు పాడుచెయ్యటానికి డబ్బు అడగలేదు. మా అన్నయ్యగారింటికి వెడదామనుకుంటున్నాడు. రాజ్యం రమ్మని రాసిందట" అందావిడ.

ఆయన నమ్మలేనట్టుగా చూశాడు.

"ఏవిటీ? రాజ్యం వీడిని రమ్మని రాసిందా? భలే! ఎందుకు'' అంటూ నవ్వా డాయన.

"ఎందుకేమిటి, మీకసలు ఏదీ అర్థంకాదు. మా అన్నయ్య రెండుచేతులా సంపాదిస్తున్నాడు. వద్దన్నకొద్దీ డబ్బు వచ్చిపడుతోంది. వాడికి కొడుకయినా కూతురయినా అది ఒఖత్తె. రేపా ఆస్తిపాస్తులన్నిటికి అధికారిణి అదేగదా. ఆ రాజ్యాన్ని మనవాడికి ముడిపెట్టేస్తే మా అన్నయ్య ఆస్తంతా మనదే అవ్వదూ ? ఈమాత్రం ఆలోచన లేకపోయాక ఎంత వ్యాపారంచేసి ఏంప్రయోజనం ? అదేమో వాడిని రమ్మని రాసిందిట. మగపిల్లవాడు, చేతిలో రూపాయి డబ్బు

ల్లేకుండా వాళ్ళింటికి ఎలా వెడతాడు? వాళ్ళ తాహతుకి తగినట్టుగా ఖర్చుపెట్టక పోతే వీడినసలు ఖాతరు చేస్తుందా ఆరాజ్యం అసలే దానికి అన్నీ మా అన్నయ్య పోలికలు. మీరేమో ఈ వరస, ప్రతిదానికీ లెఖ్కాలు పత్రాలంటూ."

రాజేశ్వరరావు ఇంకా ద్వైదభావంలోనే వున్నాడు, భార్య చెప్పింది నిజంగా నమ్మాలా వద్దా అన్నట్టుగా. తను ఎంత కంఠశోషపడినా చివరికి భార్యదే పైచెయ్యి అని ఆయనకి తెలుసు. ఆవిడవైపు ఓక్షణంచూసి, గాడ్రెజ్ బీరువా తెరిచి వెయ్యిరూపాయలు తీసుకొచ్చి భార్యముందు పడేశాడు నోట్లని.

"తీసుకుపో, నువ్వు నీ కొడుకు ఏ గంగలో దూకినా సరే!" అంటూ గట్టిగా అలమారు తాళం వేశాడు.

తల్లి అందించిన నోట్లని భద్రంగా జేబులో పెట్టుకొన్నాడు సంతోషంగా. "థాంక్యూ మమ్మీ, థాంక్యూ" అంటూ తన గదిలోకి వెళ్ళిపోయాడు.

'రాజ్యం ఈసారికి నా అవసరం గడిపేవు థాంక్యూ వెరీమచ్' అంటూ ఎక్కడోవున్న రాజ్యానికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

## 7

శంకరం మొదటినెల జీతం అందుకున్నరోజున ఆ పే పేకెట్‌ని చూసి సంతోషంతో ఉబ్బిపోయాడు. ఆప్యాయంగా గుండెలకానించుకుని జేబులో పెట్టుకున్నాడు. శంకరం తల్లిప్రేమగానీ, తండ్రి ఆదరణగానీ ఎరగడు. అతనికి తెలిసినదల్లా తమని తల్లికన్న మిన్నగా చూసే మామ్మ మాత్రమే! శంకరం ఇంటికి వచ్చి సరాసరి మామ్మదగ్గరగా వచ్చాడు.

శాంతమ్మ నేలమీద కూర్చుని పత్తితో వత్తులు చేస్తోంది. శంకరం సుడిగాలిలాగా వచ్చి ఆవిడని రెండుచేతులతోనూ చుట్టేశాడు. శాంతమ్మ బిత్తరపోయి చూసింది.

"ఒరేయ్ ఒరేయ్ ఏవిట్రా ఇది, వదులునాయనా, ముసలిదానితోనా నీ సరసాలు" అంటూ ప్రేమగా కేకవేసింది.

శంకరం ఆవిడ గుప్పిటతెరిచి జీతంవున్న కవరు ఆవిడచేతిలోపెట్టి గుప్పిట మూసేశాడు. ఆవిడ కాళ్ళమీద తలపెట్టి ఆ కాళ్ళని భక్తిగా కళ్ళకి అద్దుకున్నాడు.

"ఏమిట్రా ఇది శంకరం."

"నా మొదటినెల జీతం మామ్మా" అంటున్న శంకరం గొంతు బొంగురుపోయింది.

శాంతమ్మ కళ్ళనిండా నీళ్ళు తిరిగినాయి. ఆవిడ ఎండిపోయిన తనచేతుల్ని చాచి శంకరాన్ని దగ్గరగా తీసుకుంది. తన పంచెకొంగుతో శంకరం కళ్ళని అద్దింది. శంకరం ఆవిడ రెండుచేతుల్ని ప్రేమగా తన చేతుల్లోకి తీసుకుని కళ్ళమీదుంచుకున్నాడు. "మామ్మా నీ రణం మేం ఎలాతీర్చుకోగలం" అంటున్న శంకరాన్నిచూసి నవ్వ్వింది ఆవిడ.

"అయితే నా రుణం తీర్చుకుని నన్ను పంపెయ్యాలని చూస్తున్నావేంరా శంకరం?" అందావిడ.

"నీది తీర్చుకోలేని రుణం మామ్మా. తల్లీ తండ్రీ లేక, బంధువులందరు వది లేసిన ఇద్దరు అనాధబిడ్డల్ని ఇంతవాళ్ళని చేశావు. నువు తిన్నావో పస్తులే వున్నావో ఏనాడూ మాకు ఆకలిబాధ లేకుండా చేశావు. నీ నీడలో పెరిగి పెద్ద వాళ్ళం అయ్యాం. ఈనాడు మేము ఇలా వున్నామంటే ఇదంతా నీ చలవే మామ్మా. మాకు తల్లీ, తండ్రీ, దైవం అన్నీ నువ్వే." శంకరం ఆవిడని తన చేతుల్లోకి తీసుకుని మెల్లగా అన్నమాటలకి మామ్మ చలించిపోయింది.

వాడిలిపోయిన బుగ్గలమీదుగా కన్నీరు ధారలుకట్టింది.

"ఇది మీ అదృష్టం కాదురా శంకరం, నాది. ఒకే ఒక్క క్షణంలో కట్టుకున్న భర్తని,కన్నబిడ్డల్ని గంగమ్మతల్లి తన గర్భంలో కలిపేసుకుంది. 'భగవంతుడా నన్ను మాత్రం ఎందుకు బ్రతికించావు నాయనా' అని ఏడుస్తుంటే ఆదేవుడే జాలిపడి మీ ఇద్దరినీ నాకు అప్పచెప్పాడు 'చచ్చి ఏంసాధిస్తావు? పసిబిడ్డల్ని పెంచి పెద్దచెయ్యి నీ జీవితం తరిస్తుంది ' అని ఆ భగవంతుడే చెప్పినట్టు అని పించింది. నేను పోగొట్టుకున్న ఆనందాన్ని నాకు పంచిపెట్టిన దేముళ్ళురా మీ ఇద్దరూ. నేనుకాదు దేవతని. మీరు." శాంతమ్మ కంఠం దుఃఖభారంతో పెగల్లేదు.

మల్లెపూలు వడిలో పోసుకుని వచ్చిన గిరిజ ఇద్దరినీ ఆ స్థితిలో చూసి కంగా రుగా పిలిచింది. 'మామ్మా, అన్నయ్యా' ఏమయిందర్రా ఇద్దరూ అలా మూగ పోయిన విగ్రహాల్లాగా కూచున్నారూ' అంటూ దగ్గరగా వచ్చింది.

శాంతమ్మ కళ్ళు తుడుచుకుంది. శంకరం ఇచ్చిన డబ్బు కవరుని గిరిజకి ఇస్తూ, 'ఇది దాయవే గిరిజా శంకరం మొదటిజీతం, అందులోంచి పదిరూపా యలు తీసి విడిగాపెట్టి, ఒరేయ్ శంకరం, ఈసారెప్పుడయినా తిరపతి వెళ్ళి నప్పుడు ఆ డబ్బు డిబ్బీలో వెయ్యి" అందావిడ.

గిరిజ మూతిముడుచుకుని అన్నగారివైపు కోపంగా చూసింది. "చూశావా

మామ్మా అన్నయ్యకి నువ్వంటేనే ప్రేమ. తన మొదటిజీతంలో నాకేదయినా కొనితెద్దామని వుందేమో చూశావా? అంతా తీసుకొచ్చి నీ చేతుల్లో పెట్టేశాడు," అంటున్న గిరిజనిచూసి మామ్మ, శంకరం నవ్వేశారు.

''కోపం ఎందుకే గిరిజా రేపు వాడి సంపాదనంతా దాచి నీపెళ్ళి చెయ్యాల్సింది వాడేగదే'' అందావిడ.

"ఆ, ఆ పెళ్లి తరవాత చేస్తాడుగానీ ముందర నాకో మంచి పెన్ను కొని ఇమ్మను."

"ఎందుకమ్మా గిరిజా? నువు గూడా రచయిత్రివి అయిపోతావా?" అంటూ భయం నటిస్తున్న అన్నగారిని చూసి గిరిజ నవ్వేసింది.

"అలాగే నవ్వి హేళనచెయ్యి. రేపు ఓ రచయిత్రే మా వదినగారుగా రాక పోతే చూడు" అంది.

"వద్దమ్మా చెల్లెలా. నాకు వంట చెయ్యటం రాదు" అన్నాడు బెంగగా.

"పోన్లే నీకు వంటనేర్పించినతరువాతే ఆవిడని రాసుకోమని చెబుతాలే" అంది గిరిజ నవ్వుతూ.

"మామ్మా, అన్నయ్యతో చెప్పు పెన్ను కావాలని" అంది.

"మామ్మా, మూడునెలల్లో నాలుగు పెన్నులు పాడు చేసింది. ఇలా అయితే ఎలా మామ్మా." గిరిజని కవ్విస్తూ అన్నాడు శంకరం.

"అణాకానీ పెన్నులయితే పాడవ్వవా ఏం? ఒక్కమంచి పెన్ను పట్రమ్మని చెప్పు మామ్మా."

వాళ్ళిద్దరి వాదన చూసి శాంతమ్మ ముచ్చటగా నవ్వింది.

"నా సిఫారసు ఎందుకే మధ్య? నేనివాళున్నాను, రేపు వుంటానని నమ్మకం ఏముంది? నే పోయినా గూడా ఇలాగే కీచులాడుకుంటారేమర్రా? ఒరేయ్ శంకరం! నీకుఇప్పుడే చెపుతున్నాను దానిమనసుకి కష్టంకలిగేట్టుగా ఎప్పుడూప్రవర్తించకు తెల్సిందా! దానికి తల్లివయినా తండ్రివయినా అన్నవయినా నువ్వే. గిరిజా! నీక్కూడా చెపుతున్నా గుర్తుంచుకో. వాడికి ఈ ప్రపంచంలో ఎవరూలేరు నువు తప్ప. ఒక్కగానొక్క తోబుట్టువ్వి. వాడి మంచి చెడ్డలు చూడాల్సిన బాధ్యత నీదే తెలిసిందా?" అంది శాంతమ్మ.

ఆవిడ అప్పగింతలకి గిరిజ, శంకరం పకపకా నవ్వారు.

"మా యిద్దరికీ తోడూ నీడా అన్నీ నువ్వే మామ్మా. లే నాకు ఆకలేస్తోంది. నువు చేసుకున్న ఫలహారం ఏదయినా అట్టిపెట్టావా నాకు" అంటూ శాంతమ్మని లేపి లోపలికి తీసుకువెళ్ళాడు శంకరం.

"మామ్మా పూలుకట్టి వస్తున్నాను. అంతా వాడికే పెట్టెయ్యకు. నాక్కూడా అట్టిపెట్టు" అంటూ కేక పెట్టింది గిరిజ పూలు గుచ్చుతూ.

ఆ రాత్రి శాంతమ్మ గిరిజని, శంకరాన్ని వెంటబెట్టుకుని శివాలయానికి వెళ్ళింది. పార్వతీ అమ్మవారికి కుంకుమపూజ చేయించి తిరిగి వచ్చారు.

ఆ రాత్రి నిశ్చింతగా నిద్రపోయిన శంకరానికిగానీ, గిరిజకిగానీ త్వరగా మెలకువరాలేదు. ఎండ మొహమ్మీద పడి ఉలిక్కిపడి లేచిన శంకరం 'ఇంకా మామ్మ లేవలేదా ఏం చెప్మా? లేకపోతే నన్ను అంతసేపు పడుకోనిచ్చేదిగాదే' అనుకుంటూ మామ్మ పక్కదగ్గరగా వెళ్ళాడు. శాంతమ్మ నిండా ముసుగు పెట్టుకుని నిద్రపోతోంది.

శంకరం ఆత్రుతగా వంగి దుప్పటితీస్తూ 'మామ్మా, వంట్లో బాగాలేదా, ఇంతసేపు పడుకున్నావేం' అంటూ వంటిమీద చెయ్యివేసినవాడు కాస్తా మామ్మా! అంటూ గట్టిగా కేకపెట్టాడు. ఉలిక్కిపడి లేచిన గిరిజ కంగారుగా శంకరం దగ్గరికి వచ్చింది.

"ఏమయిందన్నయ్యా" అంటూ శాంతమ్మమీద చెయ్యివేసిన గిరిజ చల్లటి మంచుగడ్డలాటి శరీరం చేతికి తగలగానే చప్పున చేతిని వెనక్కి లాక్కుంది. శాంతమ్మ ఇహలోకంలో తను వచ్చినపని పూర్తయిపోయిందన్నట్లుగా ప్రశాంతంగా నిద్రపోతోంది. ఆమొహంలో బాధగానీ, వేదనపడిన చిహ్నాలుగానీ లేవు. అంతులేని తృప్తి నిండివుంది.

శాంతమ్మ శరీరం మీదపడి పసిపిల్లలకి మల్లే ఏడుస్తున్న అన్నాచెల్లెళ్ళని చూసి ఇరుగుపొరుగు కళ్ళుకూడా చమర్చాయి.

"ఎంత అదృష్టవంతురాలో, రోగం రొచ్చుతో తీసుకోకుండా హాయిగా ఒక్కక్షణంలో కన్నుమూసింది. ఎంత పుణ్యాత్మురాలో" అంటూ నలుగురూ తలోపనిచేసూ శాంతమ్మ అంతిమయాత్రకి సన్నాహాలు చేశారు.

ఈ వార్తతెలిసిన నారాయణ, చలపతి వెంటనే వచ్చారు. స్నేహితుడికి అండగా నిలబడి, కావల్సిన సహాయం చేశారు. అంతిమయాత్రకి తరలి వెళ్ళిపోతున్న శాంతమ్మగారి ముందుగా నిప్పుకుండతో నడుస్తున్న శంకరాన్నిచూసి వెక్కివెక్కి ఏడుస్తున్న గిరిజని పార్వతమ్మగారు ఓదార్పు మాటలతో ఊరడించసాగింది.

## 8

నారాయణకి అర్హత సరిపోతుంది అని అనుకున్న వుద్యోగాలన్నిటికీ దరఖాస్తులు పెట్టిస్తున్నారు సుందరయ్యగారు. చివరిదశలో తమకి చేదోడుగావుండి

వుద్ధరిస్తాడనుకున్న నారాయణ ఇప్పుడాయనకో పెద్ద సమస్యగా తయారయ్యాడు. నారాయణ కాలేజీ చదువు మానేసి నాలుగేళ్ళవస్తోంది. ఇంతవరకు ఏ ఉద్యోగమూ రాలేదు. ఇదంతా తమ ఖర్మేనా, లేక దేశంలో నిరుద్యోగ సమస్య ఇంత తీవ్రంగా వుందో ఆయనకి అర్థంకావటంలేదు. నారాయణతో పాటుగా చదివిన కుర్రాళ్ళెంత మందో చిన్నదో పెద్దదో ఏదో ఒక ఉద్యోగంలో చేరిపోయారు. కొంతమంది పెళ్ళిళ్ళుకూడా చేసేసుకున్నారు. నారాయణ ఖర్మ ఇలా వుందని పార్వతమ్మగారు బాధపడటం అలవాటయిపోయింది.

పేపరు చూస్తున్న సుందరయ్యగారు ఒకచోట కనబడిన ప్రకటనచూసి తటాలున లేచి కూర్చున్నారు.

'నారాయణా' అంటూ కేకవేసేరు. పిల్లిలాగా నడుస్తూ నారాయణ వచ్చాడు. ''ఇదిగో, ఇది చూశావా'' అంటూ పేపరు చూపించారు. హైదరాబాదులోని ఓ ప్రైవేటు కంపెనీలో క్లర్కు-పోస్టుకి పడిన ప్రకటన అది

"సీతారామయ్యగారు ఆ కంపెనీ డైరెక్టరు. మనకి దూరపు బంధువవుతాడు. వెంటనే అప్లై చెయ్యి. నేనాయన్ని కలుసుకుని ఏమయినా తంటాలు పడతాను...'' అన్నారాయన.

నారాయణచేత వెంటనే దరఖాస్తు పంపించి, ఆయన వెంటనే హైదరాబాదు వెళ్ళి ఆ కంపెనీ డైరెక్టరయిన సీతారామయ్యగారిని కలుసుకున్నారు. తమ దూరపు బంధుత్వాన్ని గుర్తుచేసి, తన ప్రస్తుత పరిస్థితులన్నీ వివరించి ఎలాగయినా నారాయణకి ఆ వుద్యోగం వచ్చేట్టు చూడమని ప్రాధేయపడ్డారు. సీతారామయ్యగారు బాగా ఎదురుదెబ్బలు తిని పైకివచ్చిన మనిషి. ఆయన ఇలాటి కష్టనిష్ఠూరాలన్నీ బాగానే అర్థంచేసుకోగలరు. సుందరయ్యగారి స్థితివిని జాలి కలిగింది. పైగా నారాయణకి వున్న అర్హతలు ఆ ఉద్యోగానికి సరిపోతాయి. గనుక తాను తప్పక సహాయం చేస్తానని మాట ఇచ్చారాయన. కొండంత సంతోషంతో తిరిగి వచ్చారు సుందరయ్యగారు.

సుందరయ్యగారు ఎలాగో వందరూపాయలు అప్పుపట్టుకొచ్చి నారాయణకి ఇచ్చి ఇంటర్వ్యూనాటికి హైదరాబాదు పంపించారు. ఎప్పటికప్పుడు దరఖాస్తులకి, ఇంటర్వ్యూలకయే ఖర్చే ఆయనకి తలకిమించినదిగా వుంటుంది. ఈసారి కొడుక్కి వుద్యోగం వచ్చేసినట్లే ఆయన భావిస్తున్నారుకనుక ఇంక ఈ బెడద వుండదురా బాబూ అనుకుంటూ నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నారు.

నారాయణ హైదరాబాదు వెళ్ళక వెళ్ళాడు. తిరిగి వచ్చాడు. ఎన్నాళ్ళయినా




వుద్యోగం వచ్చినజాడమాత్రం లేదు. ఒకరోజు సీతారామయ్యగారి దగ్గరనుంచి వచ్చిన వుత్తరంచూసి సుందరయ్యగారు నిలువునా కుప్పకూలినట్టయిపోయారు. నారాయణ ఇంటర్వ్యూకి రానికారణం తనకి తెలియదని, అతనికి మరేదయినా మంచి వుద్యోగం వేరేచోట దొరికివుంటుందని ఆశిస్తున్నానని ఆయన రాశారు.

సుందరయ్యగారిలో కోపం, నిరాశ, పెనవేసుకుని ఏంచెయ్యాలో తెలియని అయోమయంలో పడ్డారు. తను ఇంత శ్రమపడి, ఏర్పాట్లుచేసివస్తే నారాయణ అసలు ఇంటర్వ్యూకే వెళ్ళలేదట. ఎంత మోసం! నారాయణ ఎందుకు ఇలా చేశాడు. ఇలా జరిగింది ఇప్పుడేనా? ఇంతకుముందుగూడా ఇలాటి నాటకమే ఆడుతూవచ్చాడా?

"నారాయణా" అంటూ గావుకేకపెట్టారు. ఆ కేకవిని రావటానికి నారాయణ ఇంట్లోలేడు. అసలు నారాయణ ఇంటిపట్టున వుండటమే చాలా అరుదుగా ఉంటుంది. ఎక్కడ తిరుగుతున్నాడో ఏంచేస్తున్నాడో ఎవరికీ అంతుపట్టని విషయం. ఎప్పుడో ఇంటికి వస్తాడు. వచ్చినా వెంటనే వెళ్ళిపోడన్న నమ్మకం లేదు. ఏది అడిగినా నారాయణ మౌనమే సమాధానం అన్నిటికీను.

"నారాయణా" అంటూ ఉగ్రస్వరూపంతో సుందరయ్యగారు పిలిచేసమయానికి నారాయణ ఇంట్లోలేడు. కాస్మాపాలిటన్ క్లబ్బులో చలపతితో కలిసి రంజయిన పేకాట మధ్యలో వున్నాడు.

సుందరయ్యగారు తనకోపాన్ని తనలోనే దిగమింగుకుంటూ, నిస్సహా

యంగా పడకకుర్చీలో వాలి మనసుని సమాధానపరుచుకోవటానికి ప్రయత్నిస్తున్నారు.

"టెలిగ్రాం" అంటూ ఎర్ర సైకిలు మెసింజరు కేకతో కళ్ళుతెరిచి చూశారు. వణికే చేతుల్తో సంతకంచేసి, కవరుతెరిచి చూసిన సుందరయ్యగారు కుప్పకూలి నట్టుగా కూలబడిపోయారు.

"శారద భర్త గుండెజబ్బుతో అకస్మాత్తుగా కాలంచేశాడు." అని ఉంది ఆ టెలిగ్రాంలో, పార్వతమ్మ స్పృహతప్పి పడిపోయింది. నారాయణ వున్నాడేమోనని వచ్చి ఇద్దరినీ ఆ పరిస్థితుల్లో చూసి అయోమయంలో పడిన శంకరం ఉపచారాలతో మెలమెల్లగా కోలుకున్న పార్వతమ్మగారి దుఃఖం పట్టశక్యంకాక పోయింది. సుందరయ్యగారు ఏడుపు అనే పదాన్నే మర్చిపోయినట్టుగా, కఠిన శిలలాగా మారిపోయి, గాజువారిన కళ్ళతో చూస్తూ కూర్చున్నారు.

శంకరం వూరంతా తిరిగి చివరికి క్లబ్బులో పేకాటమధ్యలోవున్న నారాయణని పట్టుకని జరిగిన ఘోరాన్ని వివరించి ఇంటికి తీసుకువచ్చాడు.

కూతురి పెళ్ళికి చేసిన అప్పు పూర్తిగా తీరకుండానే, ముగ్గురుపిల్లలతల్లి అయి నుదుట కుంకుమ చెరుపుకుని మళ్ళీ పుట్టింటికే తిరిగివచ్చిన శారదనిచూసి ఆ తలిదండ్రుల దుఃఖం వర్ణింప శక్యంగానిది.చిన్నవయసులో, ముగ్గురిపిల్లలతో ముందుజీవితం భూతంలాగా మింగుతానంటూ మీదికి దుముకుతుంటే నవ్వనేదే మర్చిపోయిన శారద హఠాత్తుగా చనిపోయిన భర్తని తలుచుకుని కుమిలి కుమిలి దుఃఖిస్తూవుంటే వృద్ధదంపతుల హృదయాలు, "భగవాన్ ఇన్నికష్టాలు మానొసట నెందుకురాశావు తండ్రీ. ముందుగా మమ్మల్నే తీసుకుపోకపోయవా" అంటూ ఆక్రోశించటం తప్ప మరేమీ చెయ్యలేకపోయాయి.

## 9

నారాయణ ఇంట్లోకి అడుగుపెట్టేసరికి 'రాధ' మంచంలో మూలుగుతూ పడుకొనివుంది. పట్టీలాగా నుదుటిమీద వేసిన చల్లటి తడిబట్ట క్షణాల్లో ఎండి పోతోంది జ్వర తీవ్రత ఉధృతంగా వుందనటానికి నిదర్శనంగా శారద మంచం పట్టీకి తలఆనించి కూర్చునివుంది దిగులుగా కూతురివైపు చూస్తూ, జ్వరతీవ్రతలో, రాధ 'నాన్నా నాన్నా' అంటూ కలవరిస్తూనేవుంది

శారద ముగ్గురి పిల్లలలోనూ రాధపెద్దది. ఎనిమిదేళ్ళ రాధ తరువాత ఆరేళ్ళ గోపి, నాలుగేళ్ళ రమ శారద సంతానం. రాధకి తండ్రిదగ్గర చేరిక ఎక్కువ. నిద్రలేస్తూనే తండ్రికోసరం వెతుకుతుంది. తండ్రితోపాటే భోజనం చేస్తుంది.

సూర్యం ఆఫీసుకివెళ్ళేటప్పుడు దోవలో రాధని స్కూలుదగ్గర దింపి వెళతాడు. రాత్రిపూట రాధ తండ్రి మంచంమీద పడుకునే నిద్రపోతుంది. నిద్రపోయే ముందు కొంచెంసేపు తండ్రితో స్కూలు ఖబుర్లవీ చెపితేగానీ ఆ పిల్లకి నిద్ర పట్టదు. రాధకి కాళ్లో ముల్లుగుచ్చుకుందంటే చాలు సూర్యం ప్రాణం ఎగిరిపోయి నట్టుగా హడావిడి చేసేవాడు. శారద అతని ఖంగారు, హడావుడి చూసి భర్తని మందలిస్తూవుండేది. పిల్లల్ని అంత గారాబం చెయ్యొద్దని. సూర్యం నవ్వేసే వాడు.

"రాధ మా అమ్మపోలిక శారదా. మా అమ్మే మళ్ళీ ఇలా పుట్టింది నాకోసం. కాదమ్మా రాధా?" అనేవాడు రాధని ముద్దుపెట్టుకుంటూ.

రాధ మంచంకోటికి తల ఆనించి కూర్చున్న శారదకి భర్త బ్రతికున్ననాటి దృశ్యాలు కళ్ళముందు మాటిమాటికి కదుల్తూ మాయమవుతున్నాయి. కన్నీరు బుగ్గలమీదుగా కారిపోతున్నా ఆ స్పృహే లేనట్టుగా దిగాలుపడి కూర్చున్న శారదని చూడగానే నారాయణ గుండెలు ద్రవించిపోయినాయి. 'నాన్నా నాన్నా' అంటూ కలవరిస్తున్న రాధని చూడగానే కళ్ళనిండా నీళ్ళుతిరిగాయి

సూర్యంపోయి నెలదాటింది. శారదని ఆదరించి, పిల్లల బాధ్యతవహించదగ్గ పెద్దలుగానీ, బాధ్యతకలవాళ్ళుగానీ సూర్యంవైపు ఎవరూలేరు అంతాపదిరోజులు గడిచిపోగానే ఎవరిదోవన వాళ్ళు సర్దుకున్నారు. సుందరయ్యగారు పార్వతమ్మ కూతుర్ని పిల్లల్ని తమతో తీసుకువచ్చేశారు. వచ్చినదగ్గరనుంచి రాధని జ్వరం పట్టుకుంది. ఆ పిల్లకి తండ్రిమీద బెంగవల్లే అలా వచ్చిందని అందరికీ తెలుసు కాని దానికి మందేమిటో ఎవరికీ తెలియకుండావుంది.

"రాధా!" నారాయణ రాధవద్ద కూర్చుని మెల్లగా పిలిచాడు. రాధకి ఎక్కడి నుంచో తండ్రిపిలుస్తున్నట్టుగా వినిపించింది. తెరిపిడి పడని కళ్ళని బలవంతాన తెరవటానికి ప్రయత్నించింది. ఎంతో ఆశగా తెరవబడిన ఆ కళ్ళు నారాయణని చూడగానే నిరాశగానే వాలిపోయినాయి.

నారాయణ రాధ చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని మృదువుగా నిమిరాడు. "రాధా ఎలా వుందమ్మా? అరే ఇవాళ జ్వరం తగ్గిపోయిందే! వొళ్ళు ఎక్కువ వేడిలేదు, చూశావా? రేపటికి లేచి తిరిగేస్తుంది మా రాధ" అన్నాడు

నారాయణ మాటలు విని రాధ మెల్లిగా నవ్వింది. నారాయణ వచ్చేటప్పుడు రాధకి కాగితంతోచేసిన వస్తువుల్ని అమ్మేవాడిదగ్గర తెరిచిమూసే రంగురంగుల గొడుగొకటి పట్టుకొచ్చాడు. అది విప్పి రాధకిచ్చాడు.

"రాధా! నీకోసం తెచ్చాను బాగుందా" అన్నాడు.

రాధ చిక్కిపోయిన చేతిని చాచి ఆ రంగుల గొడుగుని మెల్లిగా పట్టుకుంది. దానివైపు ఒక్కక్షణం చూసి బాగుంది అన్నట్టుగా మెల్లగా తలూపింది.

నారాయణ చాలాసేపు రాధదగ్గరే కూర్చుని వేడిగావున్న వొంటిని ఆప్యాయంగా రాస్తూ, మెల్లగా ఖబుర్లు చెపుతూ, నవ్విస్తూ కూర్చున్నాడు.

రాధ ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోయింది. తెల్లవారేసరికి జ్వరం కొంచెం తగ్గుముఖం పట్టింది.

శారదని చాటుగా పిల్చి కేకలేశాడు. "అక్కయ్యా! నువు పిల్లలముందు అలా బాధపడకు. రాధ చూడు అసలే బెంగతో జ్వరం తెచ్చుకుంది. నువు దాని ఎదురుగా ఏడుస్తూంటే అది మరీ బెంబేలు పడిపోతుంది. పిల్లలకోసమయినా నువు ధైర్యం తెచ్చుకోవాలి" అంటూ తనకంటె చిన్నవాడయిన నారాయణ పెద్దరికంగా చెప్తున్నమాటలు విని శారద దుఃఖం ఆపుకోలేకపోయింది. తమ్ముడి భుజంమీద వాలి వెక్కి వెక్కి ఏడ్చింది. నారాయణ అక్కగారి వీపు నిమురుతూ, ధైర్యం చెబుతూ, మాటల్లో పెట్టి దుఃఖాన్ని మరిపించాలని చూసాడు.

"రాధా! చూశావా ఈ కార్టూన్లు. పాపం గణపతికి మిగలకుండా ప్రసాదాలన్నీ ఈ ఎలుకే తినేసింది. బలే! గణపతి మొహం ఆకలితో ఎలా వాడిపోయిందో చూశావా?" రాధని నవ్వించాలని రకరకాల కార్టూన్లు చూపించి చెప్పేవాడు.

రాధకోసం రోజూ బజారునుంచి చిన్న చిన్న బహుమతులు, రాధ కిష్టమయిన వస్తువులు తెచ్చేవాడు. పదిరోజులకి రాధ జ్వరం మెల్లగా తగ్గింది. నారాయణ దగ్గర రాధకి చేరిక ఎక్కువయింది.

నారాయణ యింటికి రావటం ఆలస్యం అయితే ఎదురుచూస్తూ వీధిలో కూర్చునేది. రాధ దిగులుగా ఉన్నట్టు చూస్తే నారాయణ రాధని వెంటబెట్టుకుని బజార్లు తిప్పి చూపించేవాడు, పిల్లలు ముగ్గురిని పార్కుకి తీసుకువెళ్ళేవాడు. నాలుగునెల్లు నడిచేసరికి రాధకి తండ్రిమీద బెంగ వెనకపడసాగింది. నారాయణకి మరింత దగ్గరయింది.

గోపీ, రమ పక్కయింటి పిల్లలతో కలిసిపోయి ఆడుతూవుండేవాళ్ళు. రాధమాత్రం ఇంట్లో తల్లి దగ్గర తిరుగుతూనో, వాకిటివైపు కుర్చీలో బుగ్గన చేయి పెట్టుకుని కూర్చుని వీధిలో తిరిగేవాళ్ళని చూస్తూనో గడిపేది. అలా

చూస్తున్న రాధ హఠాత్తుగా వీధిలోంచి విడిచి వెళుతున్న ఓ మనిషిని చూసి పరుగెత్తుకుంటూ గుమ్మం వరకు వచ్చి ఆగిపోయింది. అతనెవరో దూరం నించి అచ్చుగా సూర్యంలాగే వున్నాడు. తరచుగా సూర్యం వేసుకునే రంగు బట్టలే వేసుకున్నాడు. సంభ్రమముగా చూస్తున్న రాధని దాటుకు వెళ్ళిపోయాడతను. కనీసం తల తిప్పికూడా చూడలేదు. రాధకి దుఃఖం పొంగుకు వచ్చింది. తండ్రి గుర్తుకి వచ్చాడు. ఏడుస్తూ అక్కడే నిలబడిపోయింది.

నారాయణ ఇంటికి వస్తూ దూరంనించే రాధని చూసి చెయ్యి ఊపాడు. రాధ ఎప్పటిలా నవ్వలేదు. ఆ పిల్ల కళ్ళనించి కారుతున్న కన్నీటిని చూసి చటుక్కున రాధని చేతుల్లోకి తీసుకున్నాడు.

"ఏమ్మా రాధా! ఎందుకు ఏడుస్తున్నావు ? అమ్మ కేకలేసిందా ?" అంటూ బుజ్జగించాడు.

రాధ జవాబు చెప్పలేదు. తండ్రిలాటి మనిషి వెళ్ళినవైపే చూస్తోంది.

"ఏం జరిగింది చెప్పమ్మా!" రాధ కన్నీరు తుడుస్తూ ప్రతిమాలాడు

"మావయ్యా! ఆయన అచ్చు నాన్నలాగా లేరూ ?" దూరంగా తిరుగుతున్న మనుషులవైపు చెయి చూపిస్తూ అంది రాధ. నారాయణకి రాధ దుఃఖానికి కారణం అర్థం అయింది. ఆ పిల్ల మొహం చూసిన నారాయణకీ గిర్రున కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఈ చిన్న మనసులో తండ్రి జ్ఞాపకాలు ఎలా దూరం చెయ్యటం !

"రాధా! మనం షికారుకు వెళదామా సైకిలుమీద" అన్నాడు రాధ వుత్సాహంగా చూసింది.

నారాయణ సైకిలుమీద బజార్లన్నీ కాసేపు తిప్పి శంకరం ఇంటికి వచ్చాడు.

శంకరం రాధని చూస్తూనే ఎదురొచ్చి చెయి పుచ్చుకుని లోపలికి తీసుకు వచ్చాడు. నారాయణ వెనకకే వచ్చి కూర్చున్నాడు.

"గిరిజా! రాధ వచ్చిందమ్మా" అంటూ పిల్చాడు. శాంతమ్మ పోయిన తరువాత గిరిజకి ఒంటరిగా ఇంట్లో తోచటం కష్టంగా వుంది. శంకరం ఆఫీసుకి వెళ్ళిన సమయాల్లో వంటచేసి మహిళాసమితికి వెళుతోంది. ఇంటరు పరీక్షకి ప్రయివేటుగా కట్టించాడు శంకరం. కాసేపు బుక్స్ చదువుతుంది. వంట చేస్తుంది.

గిరిజ వంట చేస్తోంది. రాధని పిల్చి దగ్గర కూర్చోపెట్టుకుంది. కబుర్లు చెపుతూ కూర తరుగుతోంది.

రాధకి గిరిజ ఖబుర్లు నచ్చినాయి. గిరిజ వెంట వెంట తిరుగుతూ అన్నీ పన్లని గమనించటం సరదాగా వుంది. గిరిజ ఎంబ్రాయిడరీ ఎంతో బాగా చేస్తుంది. రాధకి చిన్న చిన్న కుట్లు నేర్పింది. గిరిజ సినిమా ఖబుర్లు చెపుతుంటే పకపక నవ్వేది రాధ.

"రాధతో చక్కగా కాలక్షేపం అవుతుంది అన్నయ్యా" అనేది గిరిజ. రాధ కూడా గిరిజ దగ్గర సంతోషంగా ఉంటుందని గ్రహించాడు శంకరం. రాధ దిగులుగా వున్నప్పుడల్లా తీసుకువచ్చి గిరిజదగ్గర విడిచి వెళ్ళేవాడు. కాసేపయిన తరువాత గిరిజ రాధని తీసుకొచ్చి వాళ్ళ ఇంటి దగ్గర దింపివెళ్ళేది.

"రాధ వచ్చాక మా గిరిజకి బాగా కాలక్షేపంగా వుందిరా నారాయణా!" అనేవాడు శంకరం.

"రాధ దిగులుగా, బెంగగా వుంటే నేను చూడలేనురా శంకరం. నిజంగా భగవంతుడు వీళ్ళకి ఇంత దురదృష్టాన్ని ఎందుకు కలిగించాడో తెలియదు." నారాయణ కంఠం బరువుగా పలికేది.

"దీనికే మరీ వాళ్ళనాన్న దగ్గర అలవాటు చిన్నవాళ్ళిద్దరూ ఫరవాలేదు. దీంతో మరీ కష్టంగా వుంది," అనేవాడు నారాయణ.

రాధకి గిరిజ దగ్గర, శంకరం దగ్గర బాగా చనువు పెరిగింది.

## 10

నారాయణకి ఇప్పుడు జీవితంలో ఒకటే గమ్యం. తనంటే దూరంగా పారిపోయే అదృష్టలక్ష్మిని ఏ విధానయినా వెతికిపట్టుకోవాలన్న పట్టుదల ఒక్కటే నారాయణ జీవితాన్ని నడిపిస్తోంది. అందుకుగల అడ్డుమార్గాల నన్నిటిని కూలంకషంగా పరిశోధిస్తున్నాడు. ఆ వూరిలో ధనదేవత ముద్దుబిడ్డ లయి, పనిపాటులేక తిరిగే చలపతిలాంటివాళ్ళు మరికొందరున్నారు. చలపతి వీరందరికీ నాయకుడులాటివాడు. నారాయణ చలపతికి నమ్మిన బంటులాటివాడు. ఆ గుంపంతా ఎటు తిరుగుతూవుంటే నారాయణా అటే పోతూ వుంటాడు. నారాయణని తమతోపాటుగా మద్రాసు, బెంగుళూరు హైదరాబాదు తీసుకుపోతూ వుంటారు. నారాయణ లక్ష్యం తను ఏనాటికయినా సత్యన్నారాయణలాగా క్షణాల్లో ఎదిగిపోవాలన్నదే!

ఒకరోజు నారాయణ గది బూజు దులుపుతుంది శారద. చీపురుకి తగిలి అటకమీదుగా నున్న చిన్న అట్టపెట్టె కింద పడింది. దాంట్లోంచి గదంతా వెదజల్లబడిన కాగితం ముక్కల్ని చూసి శారద ఆశ్చర్యపోయింది.




అవన్నీ లాటరీ టిక్కెట్లు. అన్ని స్టేట్సు లాటరీ టిక్కెట్లు వున్నాయి అందులో. శారద మరో విషయం గమనించలేకపోయింది. అందులో రేసులకి సంబంధించిన టిక్కెట్లు గూడా వున్నాయి.

వాటిని చూడగానే శారద ప్రాణం ఉసూరుమంది, ఎన్ని వందల వేల రూపాయలు తగలపోస్తున్నాడో అనిపించి. కాణీ సంపాదనలేని నారాయణకి ఇంత డబ్బు ఎక్కడినించి వస్తున్నట్టో ! తండ్రిమీద జాలివేసింది. ఆయన రెక్కలు విరుచుకుని సంపాదిస్తుంటే వీడు ఇలా తగలేస్తున్నాడన్నమాట అనుకుంది.

నారాయణ పేకాటలో కూడా తన అదృష్టాన్ని పరీక్ష పెట్టాడని శారదకి తెలియదు.

శారద పెళ్ళికి చేసిన ఐదువేల రూపాయల అప్పు ఈనాటివరకు పూర్తిగా తీర్చలేకపోయారు సుందరయ్యగారు. మరో వెయ్యిరూపాయలు తీర్చవలసివుంది. బాకీదారు వత్తిడి చేస్తున్నాడు. ఆయన మరో మార్గంలేక ఉన్న రెండు ఎకరాల పొలంలోనూ అరఎకరం అమ్మేశారు. రెండువేల రూపాయలు వచ్చింది. ఆ డబ్బు తీసుకుని తనే వెళ్ళి బాకీ తీరుద్దామనుకున్నారు.

ఆ ఎండల్లో ప్రయాణం చెయ్యటానికి భయపడ్డారు. అప్పుడే నారాయణ ఇంటికి వచ్చి భోజనం చేస్తున్నాడు. సుందరయ్యగారు కొడుకుని పిల్చి డబ్బు యిచ్చి పక్కవూరిలో ఉన్న పరంధామయ్యగారి బాకీ తీర్చి రమ్మని చెప్పారు. రైల్లో ప్రయాణం చేసేటప్పుడు డబ్బును ఎలా జాగ్రత్త పెట్టుకోవాలో, అక్కడికి వెళ్ళిన తరువాత చెయ్యవలసిన పనేమిటో అన్నీ ఒకటికి పదిసార్లు హెచ్చరించి మరీ పంపారు.

## 11

"బాబూ, శంకరం" అన్న పిలుపుకి తల ఎత్తి చూశాడు శంకరం. పార్వతమ్మగారు గుమ్మంలో నిలబడి వుంది.

"రండి అత్తయ్యా, లోపలికి రండి" అన్నాడు మర్యాదగా లేస్తూ.

"నారాయణ రెండు రోజులబట్టి ఇంటికి రాలేదు నాయనా! నీగ్గానీ ఏమయినా చెప్పాడేమోనని..." ఆవిడ గుమ్మంలో నిలబడే అడిగింది.

"ఏదో అనబోయిన శంకరం చటుక్కున ఆగిపోయాడు. అలసటగా, దిగులుగా, నీరసంగా కనిపిస్తున్న ఆవిడని చూసి నోటిలోని మాటలు నోట్లోనే ఆగిపోయినాయి.

"నా కేం చెప్పలేదత్తయ్యా." ఆవిడవైపు సూటిగా చూడలేక నేలవైపు చూస్తూ జవాబిచ్చాడు.

"ఉస్సురంటూ ఆవిడ వెనక్కి తిరిగి "సరే వస్తా శంకరం. ఏదయినా ఖబురు తెలిస్తే చెప్పు" అన్నారు.

"లోపలికి రాకుండానే వెళ్ళిపోతున్నారేం అత్తయ్యా?" లోపల్నించి వచ్చిన గిరిజ మాటలు విని పార్వతమ్మగారు తిరిగి చూసింది.

"ఏంలేదమ్మా శంకరాన్ని ఖబురు కనుక్కుందామని వచ్చాను మళ్ళీ వస్తాలే" అంటూ వెళ్ళిపోయారావిడ.

గిరిజ ప్రశ్నార్థకంగా అన్నగారివైపు తిరిగి చూసింది. శంకరం ఉస్సురంటూ కుర్చీలో కూలబడి ఆవిడ వెళ్ళినవైపే చూస్తున్నాడు.

"ఏమయిందన్నయ్యా ?"

"ఏముందమ్మా అయ్యేందుకు. మామూలే. హైదరాబాదులో సీజను మొదలయింది గదూ. అక్కడికే ఉడాయించాడన్నమాట.

"ఏం సీజనూ ?" అయోమయంగా ప్రశ్నించిన గిరిజని చూసి శంకరం జాలిగా, కోపంగా నవ్వాడు.

"ఇంకా ఏం వుంది ? రేసులు." అప్పటికి అర్థమయింది అన్నగారి కోపమంతా స్నేహితుడిమీదేనని.

"నారాయణ రేసులుగ్గూడా వెడతాడా అన్నయ్యా? ఆడతాడా ? చూడటానికేనా ?"

"చూడటానికి వెళ్ళినా ఆడాలనే అనిపిస్తుందమ్మా."

"పాపం ఆవిడకి ఆ సంగతి చెప్పకపోయావా ? కొడుకు యింటికి రాలేదని ఆవిడ ఖంగారు పడటంలా ?" అంది.

"చెప్పి మరింత ఏడిపించటం ఎందుకమ్మా. వస్తాడుగా. వచ్చాక గోడ కట్టినట్టుగా ఏదో ఓ కట్టుకథ చెబుతాడు ఆవిడకి." కోపంగా అంటున్న శంకరాన్ని చూసి మరేం అడగలేకపోయింది గిరిజ

* * *

నీరసపడిన శరీరాలతో, నిరాశ నిండిన మొహాలతో రేసుకోర్సునుంచి బయటపడ్డారు చలపతి, నారాయణలు.

"హోటలు అద్దె చెల్లించటానికయినా మిగిలిందా లేదా గురూ ?" చలపతి ప్రశ్న విని నారాయణ జేబులు తడుముకున్నాడు. ఇరవై రూపాయ లున్నాయి లెక్కపెట్టగా.

చలపతి జేబులన్నీ దులిపి పాతిక రూపాయలు బయటికి తీసాడు.

"వెంటనే ఖండా ఎత్తెయ్యాలి గురూ, లేకపోతే ప్రమాదం" అన్నాడు చలపతి.

నారాయణకి హఠాత్తుగా తను పోగుట్టుకున్న పదివందల రూపాయలు కళ్ళముందు కదిలినాయి. ఒక్క క్షణం అడుగులు తడబడ్డాయి. మైకం దిగిపోయినట్టయింది. అర ఎకరం అమ్మి, తనమీద నమ్మకముంచి తండ్రి తన చేతికి ఇచ్చిన మొత్తం అది. పొరుగూరిలో బాకీ తీర్చి రమ్మని పంపిన తండ్రికి తనేం సమాధానం చెప్తాడు నారాయణకి కాళ్ళు వణికి, కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. చలపతి చూడకుండా కళ్ళు అద్దుకున్నాడు.

ఆ వెయ్యి రూపాయలకి తనేం సమాధానం చెప్పాలా అన్న ఆలోచనతోటే నారాయణకి తిరుగు ప్రయాణం అంతా గడిచిపోయింది.

## 12

నారాయణ సిగరెట్ తాగుతూ శంకరం ఎదురుగా కూర్చున్నాడు.

నారాయణని పరీక్షగా గమనిస్తున్నాడు శంకరం. అతని చూపులు నారాయణకి ఇబ్బందిగా వున్నాయి.

"ఇదేం బాగాలేదు నారాయణా." హఠాత్తుగా అన్నాడు శంకరం. ఉలిక్కి-పడ్డ నారాయణ ప్రశ్నార్థకంగా చూశాడు శంకరంవైపు

"వెళ్ళి రేసులు ఆడొచ్చిందేకాక, బాకీ తీర్చటానికి వెడుతుంటే రైల్లో ఎవడో పాకెట్ కొట్టేశాడని ఇంట్లో చెబుతావా ?'' ఆ డబ్బు ఎంత కష్టపడి మీ నాన్నగారు జతపరిచారో నువ్వెప్పుడయినా ఆలోచించావా ?"

"నారాయణ సిగ్గుతో తలవంచుకున్నాడు అంతలో రోషం తన్నుకొచ్చింది. "నీ కీ విషయాలన్నీ ఎవరు చెప్పారు ?" అన్నాడు తీక్షణంగా చూస్తూ.

శంకరం మెల్లగా నవ్వాడు. ''పిల్లి కళ్ళుమూసుకుని పాలు తాగుతూ, నన్నెవరూ చూడటంలేదు అనుకుంటుందిట!"

చర్రున వచ్చిన కోపాన్ని సిగరెట్ మీద చూపించాడు నారాయణ మౌనంగా కాలుతున్న సిగరెట్ చివరని చూస్తూ కూర్చున్నాడు.

"ఇప్పటికయినా ఏదో ఒక వుద్యోగం చూసుకో నారాయణా. ఎన్నాళ్ళు ఇలా గడుపుతావు ?"

''నా క్వాలిఫికేషన్‌కి ఏ మాదిరి వుద్యోగం దొరుకుతుందంటావు?" నారాయణ తాపీగా ప్రశ్నించాడు.

"నీ పొట్ట నీవు పోసుకోవటానికి ఏదో ఒకటి దొరక్క-పోదు."

"దొరుకుతుందనుకో ! ఏమాత్రంది ? ఏ ఎల్.డి.సి.యో, అలాటిదే మరొకటో దొరుకుతుందనుకో. ఎంత జీతం ఇస్తారంటావు ? నెలంతా ఒళ్ళు విరుచుకుని చాకిరీ చేసినా వాళ్ళిచ్చే జీతం నువు ఒక్క-పూట జాలీగా గడప టానికి సరిపోతుందా ? నా తల్లిదండ్రుల్ని పువ్వుల్లోపెట్టి పూజించాలని నాకు వుంది. అందుకు మరి నా జీతం సరిపోతుందా ? మరి పెళ్ళవుతుందనుకో. నా భార్యని కాలు కదపనివ్వకుండా ప్రేమగా చూసుకోవడానికి వీలవుతుందా ? నా అక్క-చెల్లెళ్ళకి వాళ్ళు కోరిన చీరెసారె సంతోషంగా ఇచ్చేంత స్తోమత వుంటుందంటావా ?"

నారాయణ తర్కానికి శంకరం ఆశ్చర్యంతో అవాక్క-యినట్టు ఉండి పోయాడు.

"వచ్చే జీతం చాలలేదని అసలు ఉద్యోగాన్నే వొద్దనుకుంటారా ఎవరయినా అని గదూ నీ ఆశ్చర్యం! కాకిలా కలకాలం బ్రతికేకంటే, హంసలా ఆరు ఘడియలు బ్రతికినా చాలు శంకరం!" నారాయణ అదే స్థాయిలో అన్నాడు.

"అంటే నీ ఉద్దేశ్యం..."

"మరేంలేదు. ఈ అణాకాణీ వుద్యోగాలు చెయ్యాలంటే నా ప్రాణం పోయినట్టుగా వుంది. అదృష్టం కలిసివచ్చి ఏ జాక్‌పాటో తగిలిందనుకో, ఇలాటి వెధవ ఉద్యోగాలు లక్షా తొంభై కొనిపారేయగల్ను. మావాళ్ళందరినీ పువ్వులు పరిచి నడిపిస్తాను నేనే పదిమందికి ఉద్యోగాలిస్తాను. తెలిసిందా ?"

శంకరం చిరునవ్వుతో నారాయణని చూస్తూ అడిగాడు. "అవునూ, ఇదంతా ఎప్పుడు ? నీకు ఆ జాక్‌పాట్ ఏదో వచ్చినప్పుడుగదా ? అది నీకు వస్తుందని గ్యారంటీ ఏమయినా వుందా ?"

నారాయణ నవ్వాడు శంకరం అమాయకత్వాన్ని చూసి అన్నట్లుగా.

"రాదని గ్యారంటీ కూడా ఏం లేదుగా. తాళ్ళ సత్యానికి ఆరు లక్షలు రాలా ? కూటికి గతిలేనివాడు ఈ రోజు ఈ జిల్లాలోని బిజినెస్సంతా గుత్తకి తీసుకోలా ?"

"నువు చెప్పింది బాగానే వుంది నారాయణా, ఒకడికి ఆరు లక్షలో, ఆరు వందలో రావాలంటే నీలాటివారెందరు నష్టపోవాలో ఎప్పుడయినా ఆలోచించావా ?"

"అలా అని చెప్పి చేతులు ముడుచుకు కూర్చుంటే అదృష్టదేవత నీ దరిదాపులకే రాదు బ్రదర్. ఏ పనయినా సాధనతో సమకూరుతుందని చదువుకోలా ?"

నారాయణకి తను మరింకే జవాబు చెప్పలేనట్టుగా శంకరం మౌనంగా కూర్చుండిపోయాడు. శంకరం చూపుల్లోని జాలిని నారాయణ అసలు భరించ లేదు. చటుక్కున లేచి నిలబడి సిగరెట్ బయటికి విసిరేశాడు.

"నావాళ్ళంటే నా కెంతో ప్రేమ శంకరం. చెప్పలేనంత. కాని ఈ ప్రపంచంలో ఈ ప్రేమని ప్రదర్శించుకోటానికి డబ్బు మినహా మరే మార్గం వుందో చెప్పు! ఎప్పటికయినా దాన్ని సాధించాలనే నా ప్రయత్నమంతా! తెలిసిందా ?" నారాయణ కళ్ళల్లో నిలిచిన నీటిని శంకరం గమనించకుండా చకచకా బయటికి వెళ్ళిపోయాడు.

తలుపు పక్కగా నిలబడి ఈ సంభాషణ అంతా వింటున్న గిరిజ ఆశ్చర్యంతో బొమ్మలాగా వుండిపోయింది. మాటిమాటికి నారాయణ చివరిగా అన్న మాటలే చెవుల్లో మ్రోగసాగాయి. అతని రూపమే కళ్ళముందు కదులుతూ వుండిపోయింది.

## 13

పాతికేళ్ళు దాటుతున్నా నిలకడలేని కొడుకుని చూసే పార్వతమ్మగారి దిగులంతాను. బాధ్యత తెలియని కొడుకంటే తండ్రికి కోపం. శక్తి వుడిగిపోతున్న తన రెక్కలకి ఆసరాగా ఒక్క కొడుకూ లేడే అన్నది ఆయన బాధ. మిగిలిన ముగ్గురు కొడుకులూ రెక్కలు వచ్చిన పక్షుల్లాగా ఎవరిదోవన వాళ్ళు వెళ్ళిపోయారు దగ్గరున్న నారాయణయినా తనకి ఆసరా అవుతాడేమో అనుకుంటే ఆ ఆశ నిరాశే అయింది. రెక్కాడితే గానీ డొక్కాడని సంసారాలు భర్తని పోగొట్టుకొన్న కూతురు, పిల్లలు ఆయనకి మరో బంధం.

నారాయణ, పిల్లిలాగా ఇంట్లోకి ప్రవేశించాడు మూడు రోజులుగా కొడుకు కోసరం చూస్తున్న పార్వతమ్మగారి గుండె కుదుటపడింది.

"ఎప్పుడొచ్చావురా నారాయణా ? ఇన్నాళ్ళు ఎక్కడికి వెళ్ళావ్" అందావిడ ఆత్రుతగా.

"మాధవయ్యగారు భీమవరంలో ఏదో ఉద్యోగం ఉందని రాశారు. వెంటనే పరిగెత్తుకెళ్ళాను" అన్నాడు నారాయణ.

కొడుకు మొహంలోని అలసట చూసి ఆవిడ ద్రవించిపోయింది. "ఆహా ఏమయింది ఇంతకీ? వుద్యోగం వచ్చినట్టేనా ?"

నారాయణ మొహం నిరాశతో నిండిపోయింది. "మరొకడెవడో మినిష్టరుగారి రికమెండేషను తెచ్చాట్ట వాడికిచ్చేశారు. ఇవ్వక తప్పేదేముంది ? ఈసారి వేకెన్సీ వస్తే మాధవయ్యగారు ఖబురు పెడతానన్నారు" అన్నాడు నిస్త్రాణగా.

వెలగబోయిన దీపం గుప్పున ఆరిపోయినట్లయింది పార్వతమ్మగారి ఆశ కాస్తా. వాళ్ళ సంభాషణ వింటున్న సుందరయ్యగారు కోపంతో పళ్ళు పటపట లాడించారు. నారాయణని హైద్రాబాదులో రేసుల దగ్గర చూశామని చెప్పారు ఆయనకి తెలిసిన మనిషి తల్లితో పచ్చి అబద్ధాలు సునాయాసంగా ఆడే కొడుకుని చూసి ఆయన గుండెలు మండిపోయినాయి. నారాయణని చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది ఆయనకి ఆ కోపంలో తనేం చేస్తాడో తనకే తెలియదని, చకచకా వీధిలోకి వెళ్ళిపోయారాయన.

నారాయణ తల్లి ఆప్యాయంగా పెట్టిన భోజనం తిని, వీధికేసి బయల్దేరాడు. లాటరీ టిక్కెట్ల షాపులో టిక్కెట్లని పరీక్ష చేస్తున్నాడు నారాయణ ఆ షాపువాడికి రెగ్యులర్ కస్టమర్. అతను అన్ని లాటరీల వివరాలు, డ్రా డేట్లు, ప్రైజు ఎమౌంట్లు, ఏ టిక్కెట్లు తీసుకోవాలో అన్నీ నారాయణకి వివరిస్తున్నాడు







శ్రద్ధగా. నారాయణ అన్నీ పరిశీలించి పెద్ద మొత్తాలున్న టిక్కెట్లని తీసుకుని డబ్బు చెల్లిస్తూవుండగా భుజంమీద చెయ్యి పడింది. ఎవరా అని తిరిగి చూస్తే శంకరం! "హలో కనపడటంలేదేం" అంటూ పలకరించాడు నారాయణ చేతిలోని టిక్కెట్లవంక పరీక్షగా చూస్తూ.

నారాయణ శంకరం చూపుని గమనించాడ. టిక్కెట్లని జేబులో పెట్టుకుంటూ "మళ్ళీ పిట్టమీద ఉపన్యాసం దంచబోకు నాయనా ! నేను చెప్పిన థియరీ ఇన్నిటికీ వర్తిస్తుందని తెలుసుకో. సాధనమున సమకూరు పనులు" అంటూ నవ్వాడు

శంకరం కూడా నవ్వాడు "అవును నారాయణా,సాధన అనేది కత్తిలాటిది. పళ్ళు కోసుకోవచ్చు, మెడా తెగ్గోసుకోవచ్చు" అన్నాడు.

"మరి ఇంత శంకరాచార్యులవారిలాగా తయారవకు శంకరం. జీవితం ఆనందించటానికే అన్నది గుర్తుంచుకో" అంటున్న నారాయణని జాలిగా చూడటం తప్ప మరేం చెయ్యలేకపోయాడు.

"ట్రై ఎండ్ ట్రై. విజయం నీదే. వస్తా పనుంది" అంటూ నాలుగడుగులు వేశాడో లేదో చలపతి ఎదురొచ్చాడు.

"నువ్విక్కడున్నావా నారాయణా. వెతకలేక చస్తున్నాం. ఓ హేండ్

తక్కువయింది. నిన్ను పట్టుకుందామనే ఊరంతా తిరుగుతున్నాను" అంటూ నారాయణని కాస్మోపాలిటన్ క్లబ్బువైపు నడిపించుకుపోయాడు చలపతి.

## 14

నారాయణ పిల్లిలాగా ఇంట్లోకి ప్రవేశించాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ వుండుండి వెక్కిళ్ళలాగా వినవస్తున్నాయి. పిల్లల గోలతో తల్లి మందలింపులతో ఎప్పుడూ సందడిగా వుండే ఇల్లు ఇలా వుందేమిటా అన్న శంక నారాయణ మనసులోకి వచ్చింది. చీకటిగావున్న ఓ మూల కుర్చీలో ఎవరో వున్నట్టుగా గమనించి దగ్గరగా వచ్చిచూశాడు. తండ్రి కళ్ళు మూసుకుని మడతకుర్చీలో పడుకునివున్నాడు. ఆయన మెలకువగావున్నాడో నిద్రపోతున్నాడో నారాయణకి తెలియలేదు. తల్లి గుమ్మం మీద తలపెట్టుకుని వంటగది గుమ్మంలో పడుకుంది. చిన్నపిల్లలిద్దరూ దొడ్లో బావిగట్టుమీద కూర్చుని ఏంచెయ్యాలో తోచనట్టుగా ఏడుస్తున్న తల్లివైపు బిక్కుబిక్కు చూస్తున్నారు. ఓ మూలగా అరుగుమీద కూర్చుని చేతుల్లో మొహం దించుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్న అక్కగారిని చూడగానే నారాయణకి ఇంట్లో జరగరానిదేదో జరిగిపోయిందన్న విషయం తట్టింది.

"అమ్మా ఏమయింది ?" అంటూ తల్లి దగ్గరగావచ్చి మెల్లగా పలకరించాడు. ఆవిడ కళ్ళు తెరిచి చూసింది. గట్టుతెగిన ప్రవాహంలా కన్నీరు చెంపలమీదకి దూకింది. నారాయణ ఖంగారు మరింత ఎక్కువయింది. తమ్ముడి గొంతువిని శారద ఎక్కిళ్ళు మరింత ఎక్కువయ్యాయి.

"ఏమయిందమ్మా !"

"ఏముంది నాయనా అయేందుకు. రాధ మన్ని విడిచి వెళ్ళిపోయిందిరా నారాయణా !" ఆవిడ దుఃఖం మళ్ళీ పొంగుకొచ్చింది.

నారాయణ నిశ్చేష్టుడయి నిలబడిపోయాడు.

"పిచ్చితల్లి ఆ దేవుడి దగ్గరకెళ్ళిపోయిందిరా నాయనా."

నారాయణ కలలో నడుస్తున్నవాడిలాగా అక్కగారి దగ్గరకు నడిచాడు. శారద కుళ్ళి కుళ్ళి ఏడుస్తోంది. నారాయణ దగ్గరగా వచ్చి నిలబడ్డాడు. ఏం మాట్లాడాలో ఏం చెయ్యాలో తెలియని విమూఢుడిలాగా నిలబడి చూస్తున్నాడు. అసంకల్పితంగానే అతని చెయ్యి శారద వీపుని, తలని నిమిరింది. దుఃఖంతో శారద గుండెలు ఎగిసిపడుతున్నాయి.

''వూరుకో అక్కయ్యా. వూరుకో.'' ఆ మాటలు తనకే వినిపించినవో లేదో అన్నంత మెల్లగా పలికాడు.

పిల్లలిద్దరూ నారాయణ దగ్గరగా వచ్చి నిలబడ్డారు బితుకు బితుకు మంటూ.

"మావయ్యా రాధకి జ్వరంవచ్చి చచ్చిపోయింది మావయ్యా," ఆరేళ్ళ రమ నారాయణ చొక్కా పుచ్చుకుని చెప్పింది బిక్కమొహం వేసుకుని.

"కాదు మావయ్యా. రాధ గాజులు పోయాయని బెంగపెట్టుకుని చచ్చిపోయిందట." ఎనిమిదేళ్ళ గోపి ఆరిందాలాగా అన్నాడు.

నారాయణ తలమీద పిడుగు పడిన వాడిలాగా శారద పక్కన కూర్చుండి పోయాడు.

పక్కింటి హనుమాయమ్మగారు పెరటి తలుపు తీసుకుని లోపలికి వచ్చింది. నారాయణని చూస్తూనే, "చూశావా నాయనా ఎంత ఘోరం జరిగిపోయిందో. నువ్వు వూళ్ళో లేవు. రెండు రోజులు జ్వరం కాసి మూడోనాటికల్లా అన్నీ ముగించుకొని వెళ్ళిపోయింది పిచ్చిపిల్ల. వూరుకోమ్మా శారదా! ఎంతకాలమని ఇట్టా ఏడుస్తావు. నువు ఏడుస్తే మాత్రం పోయిన పిల్ల తిరిగొస్తుందా చెప్పు? ఊ చెప్పమ్మా! ఊరుకో మరి!"

శారద దుఃఖం ఆవిడ ఊరడింపుకు ఎక్కువయిందే గానీ తరగటంలేదు. నారాయణ గాజుబుడ్లలాటి కళ్ళతో ఆవిడవైపే చూస్తున్నాడు.

"ఇంతకీ ఖర్మం తోసుకొస్తే అలాగే జరుగుతాయనుకో. రాధమ్మకి తలంటి పోస్తూ చేతుల్నున్న బంగారపు గాజులు తీసి గూట్లో వుంచిందట శారద. ఓ రెండుగంటలయ్యాక చేతులకి తొడుగుదామని చూస్తే గాజుల్లేవుట. ఎంత వెతికినా కనపడలేదట. పనిదాన్ని అడిగితే తెలియదంటూ వట్లూ, సత్యాలూ పెట్టుకుండిట. ఈ పిచ్చిపిల్ల ఆ గాజుల కోసరం ఒకటే వరసన ఏడుపు. అవి వాళ్ళ నాన్న బతికి ఉన్నప్పుడు దానికి చేయించాట్ట. ఆ గాజుల్ని ఒక్క క్షణం తీయదుట చేతుల్నించి. ప్రాణం విసిగిపోయి కూతుర్ని నాలుగు బాదిందట మీ అక్కయ్య. ఆ సాయంత్రానికి బిళ్ళపెట్టుగా జ్వరం వచ్చిపడింది. రెండు రోజులు అట్లాగే బాధపడింది. డాక్టరు చూసి ఏదో విషజ్వరం అన్నాడు. వెయ్యవలసిన మందలెన్నో వేశారు చెయ్యవలసినదంతా చేశారు. ఇంతకీ ఎంత చేసి ఏం ప్రయోజనం మనకి ప్రాప్తం లేకపోయాక. పోయే ముందుగూడా 'గాజులు, గాజులు' అంటూనే ప్రాణం విడిచింది." హనుమాయమ్మగారు కళ్ళు వొత్తుకుంటూ నారాయణ లేని ఈ వారంరోజుల్లోనూ జరిగినదంతా ఏకరువు పెట్టింది.

నారాయణ చెవులు వింటున్నా, కళ్ళు చూస్తున్నా అవేమీ మనసుకి ఎక్కటం

లేదు. తలమీద మంచుపర్వతాన్ని పెట్టినట్లుగా మనసంతా స్తబ్దుగా వుంది. కళ్ళముందు, 'మావయ్యా, మావయ్యా' అంటూ గిలకలాగా హుషారుగా తిరుగుతూ తెల్లగా బొద్దుగా ముద్దుగా వుండే రాధే గిరగిరా తిరుగుతోంది. శారద పిల్లలు మగ్గురిలోకీ రాధంటే నారాయణకి ఇష్టం బాధ్యతారహితంగా తిరిగే నారాయణంటే ఇంట్లో పెద్దంతా ముభావంగా వుంటే, ఇంట్లోవున్న కాసేపూ నారాయణకి రాధతో కాలం గడిచిపోతుంది. మాయా మర్మాలు, కల్మషాలు ఎరగని ఆ చిన్న రాధ కళ్ళు తిప్పకుంటూ, ముసిముసి నవ్వులు నవ్వుతూ మాట్లాడుతుంటే నారాయణకి మనసులోని బాధలు, నిరాశలు అన్నీ 'ఉఫ్'న ఎగిరిపోయినట్లుగా మనసు ప్రశాంతంగా వుండేది బుట్టబొమ్మలాగా పరికిణీ, జాకెట్ వేసుకుని, రెండుజడలు ఊపుకుంటూ తిరిగే రాధ, 'గాజులు, గాజులు' అంటూ మంచంలో మరణయాతన పడే దృశ్యమే నారాయణ కళ్ళముందు గిరగిర తిరుగుతోంది. మాటా మంతీ లేకుండా బిగుసుకుపోయినట్లుగా కూర్చున్న నారాయణని చూసి హనుమాయమ్మగారు భయపడింది. "నారాయణా! ఇప్పుడే వూరినుంచి వచ్చినట్టున్నావు. లే. లేచి స్నానం అదీ కానిచ్చి కాస్త ఎంగిలిపడు. నీతోబాటు శారదగ్గూడా ఓ ముద్ద తినిపించు. మూడు రోజుల్నించి కటిక ఉపవాసాలు చేస్తోంది" అందావిడ.

## 15

ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్నట్లుగా వినబడింది, వంటపనిలోవున్న గిరిజకి. ముందు గదిలోకి వచ్చి చూసిన గిరిజ ఆశ్చర్యపోయింది. నారాయణ కుర్చీలో కూర్చుని టేబుల్‌మీద రెండు చేతుల్లో తల ఆనించి వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. గిరిజకి ఒక్క క్షణం ఏం చెయ్యాలో అర్థంకాలేదు. శంకరం ఇంకా ఆఫీసునుంచి ఇంటికి రాలేదు. నారాయణ గిరిజని గమనించనేలేదు. మనసులో కొండలాగా పేరుకుపోయిన భారాన్ని కరిగించుకోవటానికా అన్నట్టు వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

''ఏమయింది? మమ్మల్నే. ఏమయిందండి'' అంది గిరిజ మృదువుగా. నారాయణ ఆ మాటల్ని విన్నట్టులేదు.

"ఎందుకు? రాధ పోయినందుకేనా! అనుకోనిది జరిగిపోయింది హఠాత్తుగా. కళ్ళముందే కదులుతోందల్లే వుంది." ఓదార్పుగా అన్న గిరిజ గొంతు కూడా బొంగురుపోయింది.

"లేదు గిరిజా లేదు. నేను పాపిని, హంతకుడిని. రాధ చచ్చిపోలేదు. నేనే

చంపాను. నా పాపానికి శిక్ష లేదు. లేదు" కుమిలి కుమిలి ఏడుస్తున్న నారాయణ మాటలు గిరిజకి అర్థంకాలేదు

"అరే అంతగా ఏడవకండి. ఏం చేస్తాం. భగవంతుని ఆజ్ఞని మనం ధిక్కరించలేం గదా. కాసొప్పి వస్తుంది. అంత బాధపడకండి." గిరిజ టేబుల్ దగ్గరగా వస్తూ అంది.

నారాయణ దుఃఖం మరింత ఎక్కువయింది తలని టేబుల్‌కేసి కొట్టుకుని ఏడుస్తున్నాడు. గిరిజకి ఏం చెయ్యాలో పాలుపోలేదు నారాయణని పట్టుకుని ఆపాలని వచ్చిన చెయ్యి వెనక్కి తీసుకుంది పరాయిమగవాడిని తాకాలంటే ఏదో సంకోచం. పసిపిల్లవాడిలా ఏడుస్తున్న నారాయణని చూస్తే ప్రతి స్త్రీలోనూ సహజంగా వుండే తల్లిమనసు గిరిజని వూరుకోనివ్వటంలేదు

"వూరుకోండి నారాయణగారూ బాధపడకండి." నారాయణ నుదురు చిట్లి రక్తం చిమ్మింది. గిరిజ మరింక ఆగలేకపోయింది రెండుచేతుల్తోనూ నారాయణ తలని పట్టుకొని బలవంతాన అతన్ని కుర్చీలో సరిగ్గా కూర్చో పెట్టింది ఫేను స్విచ్ ఆన్‌చేసి, లోపలికి వెళ్ళి టవల్ తడిపి తీసుకు చ్చి నారాయణ నుదుటి మీదినుంచి బొట్లుగా కారుతున్న రక్తాన్ని తుడిచి తడి టవల్‌ని అదిమి పెట్టింది. చల్లటి టవల్ మొహానికి తగలగానే నారాయణ మనసులోని మంట కాస్తంత తగ్గినట్టుగా వుంది. చల్లగా వేస్తున్న ఫేనుగాలికి అలిసిపోయినట్టుగా కుర్చీ వెనక్కి వాలిపోయి కళ్ళు మూసుకూర్చున్నాడు ఈ సందడిలోవున్న నారాయణగానీ, గిరిజగానీ ఎదురు వీధిలోని పంకజమ్మగారి మనవడి పుట్టినరోజుకి పిలవటానికి వచ్చిన ముత్తైదువుల్ని గమనించనేలేదు వాళ్ళు క్షణం గుమ్మంలోంచి తొంగిచూసి, తలుపు టకటకలాడించారు తిరిగి చూసిన గిరిజ గుమ్మంలో నిలబడ్డ ఆడవాళ్ళనిచూసి చప్పున చేతిలోని టవల్‌ని టేబుల్‌మీద పడేస్తూ 'రండి' అంటూ గుమ్మంవైపు వచ్చింది

వాళ్ళో క్షణం లోపలికి రామా వద్దా అన్నట్టుగా ఊగిసలాడి "బొట్టు పెట్టించుకో గిరిజా. రేపు పేరంటానికి తప్పకుండా రా" అంటూ ఓసారి లోపలికి తొంగిచూసి "పార్వతమ్మగారి నారాయణ గదూ?" అన్నది ఓ సన్నగా వాసంబద్దలాగా వున్న ఆవిడ.

ఆవిడ మాటల్లోని సందేహాన్నిగానీ, అనుమానాన్నిగానీ గిరిజ గుర్తించనే లేదు. "ఊ అన్నయ్య కోసరం వచ్చారు" అని మాత్రం అంది.

"ఊహు. మీ అన్నయ్య లేడల్లేవుందే" అందో ఆరిందాలాటి, వయసొస్తున్న పిల్ల.

"లేదు. ఇంకా ఆఫీసునుంచి రాలేదు" అంది గిరిజ.

"ఊహు. సరే వస్తాం. తప్పకుండా పేరంటానికి రామ్మా" అంటూ వాళ్ళు వెళ్ళిపోయారు.

గిరిజ లోపల్నుంచి కాఫీ కలిపి తీసుకొస్తుండే శంకరం ఇంటికి వచ్చాడు. నుదుట చేతులుంచుకొని, అలిసిపోయినట్లుగా కళ్ళు మూసుకుని కూర్చున్న నారాయణని ఆశ్చర్యంగా చూస్తూ లోపలికి వచ్చాడు. గిరిజ అన్నగారిని పక్కగా పిలిచి అంతా చెప్పింది. "అవును పాపం వీడిదగ్గర రాధకి బాగా చేరిక! హఠాత్తుగా ఖబురు వినటంతో తట్టుకోలేక పోయినట్టున్నాడు" అన్నాడు శంకరం.

గిరిజ కాఫీ కప్పుల్ని టేబుల్‌మీద వుంచి, తడి టవల్ని లోపలికి తీసుకు వెళ్ళింది.

"నారాయణా! కాఫీ తాగు." శంకరం గొంతు విని నారాయణ కళ్ళు తెరిచాడు. స్నేహితుడిని చూడగానే నారాయణ కళ్ళనించి జల జల కన్నీళ్ళు రాలినాయి. శంకరం అనునయంగా స్నేహితుడి భుజంమీద చెయ్యివేసి కాఫీ కప్పు చేతికి అందించాడు.

కాఫీ తాగినంతసేపూ మిత్రులిద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు వున్నారు. నారాయణలో అరగంట క్రితం వున్న ఆవేగమూ, ఆవేశమూ తగ్గినాయి. శంకరంతో చెపుదామని నోటి చివరివరకు వచ్చిన మాటలు నోటిలోనే ఆగిపోతున్నాయి. శంకరం మనసులో ఏదో అనుమానం నీలి నీడలాగా తారట్లాడుతోంది. నారాయణని ఆ మాట అడగడమా మానటమా అన్నట్లు సందేహిస్తున్నాడు శంకరం. మిత్రులిద్దరి చూపులూ రెండు మూడుసార్లు కలుసుకుని విడిపోయినాయి.

"నారాయణా ?" శంకరం పిలుపు విని నారాయణ ఉలిక్కిపడ్డాడు. మిత్రుడివైపు చూశాడు.

"నారాయణా ! ఆ గాజులు అపహరించింది నువ్వేగదూ" అని అడగాలనుకున్న శంకరం మాటలు నారాయణవైపు చూడగానే నోటిలోనే ఆగిపోయినాయి.

క్షణాలు గడిచిపోతున్నాయి.

"శంకరం!"

నారాయణ పిలుపు విని శంకరం ఆత్రుతగా చూశాడు.




"ఆ గాజులు నేనే దొంగిలించాను శంకరం. ఆ పసిబిడ్డ ప్రాణాన్ని తీసింది నేనే. నేనే ఆ హంతకుడిని. మహాపాపిని నేనే శంకరం" అని నారాయణ చెప్పాలనుకున్న మాటలు బయటికి రానేలేదు. శంకరంవైపు చూసి తల దించుకున్నాడు. శంకరం అంతా అర్థమయిందన్నట్లుగా జాలిగా మిత్రుడివైపు చూశాడు.

శంకరం ఓ రోజు సాయంత్రంవేళ ఆఫీసునుంచి తిరిగి వస్తూంటే ఉమామహేశ్వరంగారు పిలిచారు. శంకరం వాళ్ళ వీధి మొదటిలోనేవుంది ఆయన ఇల్లు. బాధ్యతలన్నీ తీరిపోగా రిటైరయి హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నారు. శంకరంతో చనువుగా మాట్లాడుతూ వుంటారు. ఆ రోజూ అలాగే పిలిచారు.

కుశలప్రశ్నలు అయ్యాక ఆయన అసలు విషయంలోకి వచ్చారు. "శంకరం! గిరిజకి ఏవయినా సంబంధాలు చూస్తున్నావా?" అన్నారు.

"ప్రైవేటుగా ఇంటరుకి కట్టింది బాబాయిగారూ. అదయ్యాక చూడొచ్చుగదా అని..."

"చూడు బాబూ నేను పెద్దవాడినిగా చెప్తున్నాను విను. ఓ వయసు వచ్చిన తరవాత ఆడపిల్లలని ఎంతత్వరగా మరోయింటికి పంపితే మన బాధ్యత అంత తేలికవుతుంది. ఈ ప్రపంచం వుందే మహా విచిత్రమయింది. దీనికి చెవులుతప్ప కళ్ళులేవు. నలుగురు కలిసి గుర్రాన్ని గాడిదఅంటే అవుననే సమాజంలో బతుకుతున్నాం. అరటాకు ముల్లు సామెత నీకు తెల్సినదేగదా!

త్వరగా ఏదో ఓ మంచిసంబంధం నిశ్చయంచేసి ఆ బాధ్యత తీర్చుకో!" అన్నారాయన.

అప్పటికిగానీ ఆయన మనసులో ఏదో పెట్టుకని మాట్లాడుతున్నారన్న విషయం శంకరానికి తట్టలేదు.

"అసలు సంగతేమిటి బాబయ్యగారూ?" ఆత్రుతగా అడిగాడు శంకరం.

"నేను అరవైఏళ్ళ ప్రపంచాన్ని చూసినవాడిని. లోకరీతిని చెప్పాను. నీవు లేనప్పుడు నీ స్నేహితు లెవర్నీ ఇంటికి రానివ్వకు" అన్నారాయన

తనకి ఇంటికి వచ్చే స్నేహితు లెవరున్నారని, చిన్ననాటి స్నేహితుడు నారాయణ తప్ప గిరిజని, నారాయణని గూర్చి ఎవరో అసత్యంగా మాట్లాడి వుంటారని అతనికి అప్పటికి తట్టింది అతనికి కోపం ముంచుకొచ్చింది. ముఖం ఎర్రబడి పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

అతని ముఖకవళికలు గమనించిన ఉమామహేశ్వరంగారు అతని వీపుని అనునయంగా తట్టి "ఆవేశం అన్నివిధాల అనర్థం బాబూ కాగల కార్యంచూడు" అంటూ సాగనంపారాయన.

కోపంగా ఇంటికివచ్చిన శంకరానికి గిరిజని చూడగానే ఆ కోపం చల్లబడి పోయింది. నిర్మలంగా, నిష్కల్మషంగా నవ్వే ఆ మొహం చూడగానే అతని మనసులోని మాటలు లోపలే అణిగిపోయినాయి. తన కర్తవ్యమేమిటా అన్న ఆలోచనలో పడిపోయాడు.

## 16

గిరిజని ముగ్గురు సంబంధాలవాళ్ళు చూసివెళ్ళారు కుదిరిపోయిందనుకున్న ప్రతి సంబంధం చిట్టచివరికి ఏదో ఓ కారణంతో విరమించుకోవటంతో శంకరానికి రోజురోజుకి గుండెల్లో బరువు హెచ్చసాగింది. మరో పెద్దమనిషి శంకరాన్ని మొహంమీదే అడిగేశాడు. "ఏమయ్యా శంకరం! నారాయణ కాదన్నాడా? బయట సంబంధం వెతుకుతున్నావేమిటి?" అంటూ.శంకరానికి ఆయనతో దెబ్బలాడాలన్నంత కోపం వచ్చింది. చివరికి నష్టం ఎవరిదో తెలుసుకనుక మౌనంగా వుండిపోయాడు.

ఈ మధ్య శంకరంలో కలుగుతున్న చిరాకునీ, కోపాన్నీ చూసిన గిరిజకి కారణం తెలియక తికమకపడసాగింది. శంకరం తనను తప్పించుకుని తిరుగుతున్నాడని, తనతో పూర్వంలా వుండటంలేదని, తన రాకనిగూడా అతను ఇష్టపడటంలేదని నారాయణ గ్రహించటానికి చాలారోజులే పట్టింది.

ఆ రోజు శంకరానికి మనసేమీ బాగాలేదు తన తాహతుకి మించిన కట్నం ఇవ్వటానికి ఒప్పుకుని ఓ సంబంధాన్ని ఖాయపరిచాడు. ఏదోవిధంగా గిరిజ పెళ్ళి జరుగుతుందిగదా అన్న సంతోషంలోవున్న అతని ఆశల్ని కూలుస్తూ ఓ ఉత్తరం వచ్చిం ఆ రోజే. డబ్బుకంటె ముఖ్యంగా గుణసంపదకల కోడలు కావాలన్నదే తమ అభిలాష అంటూ కొన్ని కారణాలవల్ల తాము ఆ సంబంధాన్ని వదులుకుంటున్నట్టుగా రాశాడా పెళ్ళిపెద్ద. శంకరానికి మండుతున్న గుండెలమీద కారం చల్లినట్టుగా వున్నాయామాటలు. విచారంగా విసుగ్గా ఇంటికి రాగానే గిరిజ చిరునవ్వుతో ఎదురొచ్చింది.

"నారాయణ వచ్చి వెళ్ళాడన్నయ్యా నీకోసం" అంటూ కాఫీ ఇస్తూ. ఆ మాటలు వినగానే శంకరం అగ్గిమీద గుగ్గిలంలా మండిపడ్డాడు.

"వచ్చాడా? ఎందుకు రానిస్తావా వెధవని? వాడిమూలానే అన్నీ ఇట్లా తగలడుతున్నాయి" అంటూ రౌద్రంగా అరిచాడు.

"ఏంజరిగిందన్నయ్యా? గిరిజ బిక్కమొహంవేసుకొని అన్నగారి కోపానికి భయపడుతూ మెల్లగా అడిగింది,

శంకరం ఉత్తరాన్ని తీసి గిరిజమీదకి విసిరేశాడు "చదువుకో... ఇన్నాళ్ళనుంచీ ఏ సంబంధం చూసినా ఎందుకు కుదరటంలేదో" అంటూ లోపలికి వెళ్ళిపోయాడు విసురుగా.

శంకరం ఆవేశం తగ్గగానే అనవసరంగా చెల్లెలిమీద కోపగించుకున్నందుకు సిగ్గుపడుతూ ముందుగదిలోకి వచ్చాడు.

గిరిజ ఉత్తరాన్ని చేత్తోపుచ్చుకొని, బుగ్గన చెయ్యానించుకుని నేలవైపు చూస్తూ కూర్చునుంది శంకరం దగ్గరగా వచ్చి ప్రేమగా చెల్లెలి తలమీద చెయ్యివేసి పక్కన కూర్చున్నాడు. గిరిజ కళ్ళెత్తి అన్నగారిని చూసింది. ఆ చూపుకి చలించిపోయాడు శంకరం.

"నీమీద నాకేం కోపంలేదమ్మా గిరిజా. వాడు తరుచుగా మనింటికి వస్తూ వుండటంతో లేనిపోని అభాండాలన్నీ సృష్టించారు ఈ వెధవజనం. ఏంచెయ్యాలో పాలపోవటంలేదమ్మా." గుండెల్లో గూడుకట్టుకుంటున్న భారాన్ని చెల్లెలితో చెప్పుకుంటేనయినా కాస్త బరువు తీరుతుందనుకున్నాడు శంకరం.

"ఈసంగతి నాకు ఇన్ని రోజుల్నించి చెప్పలేదేం అన్నయ్యా" అంది గిరిజ మెల్లగా. తనని గురించి లోకమంతా కోడై కూస్తున్న విషయం తనకే తెలియక పోవటం నిజంగా ఈ ప్రపంచంలోని ఒక ఆశ్చర్యకరమైన వింతే అనుకుంది

గిరిజ. భారంగా, మౌనంగా క్షణాలు, నిముషాలు గడుస్తున్నాయి. ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళున్నారు.

"నారాయణకి మాత్రం ఏం తక్కువన్నయ్యా?" గిరిజ సూటిగా అడిగిన మాటలకి శంకరం ఉలిక్కిపడి ఆశ్చర్యంగా చెల్లెలివైపు చూశాడు, నమ్మలేనట్లుగా. చిట్టచివరికి తెప్పరిల్లిన శంకరం కోపంగా అన్నాడు." వాడా వడ్డీ అబద్ధాలకోరు, దొంగ, జూదరి!"

గిరిజ మెల్లగా నవ్వింది. "కానీ వాటన్నిటితోబాటు మనిషిలో మంచితనం కూడా వుందన్నయ్యా." గిరిజ మాటల్ని శంకరం నమ్మలేనట్టుగా చూశాడు. లోకం అనుకునే మాటలన్నీ నిజమా ఏవిటి అన్న సందేహం కూడా వుంది ఆ చూపులో. అన్నగారి ఆలోచలను పసిగట్టినట్టే అంది గిరిజ 'నీవు అన్నతర వాతే నేను నారాయణగురించి ఆలోచిస్తున్నానన్నయ్యా. ప్రతిమనిషిలోనూ కొన్ని బలహీనతలతోపాటు మంచితనంకూడా వుంటుందన్నయ్యా. మంచి తనాన్ని బయటకి తీసుకురాగలిగేశక్తి మనకి వుంటే ఆ మనిషి మంచిమార్గాన పడ్డట్టే.''

శంకరం చెల్లెలిమాటల్నిగూర్చి ఆలోచిస్తున్నాడు, పసిపిల్లలాటి తనచెల్లెలు ఇంతగా ఎప్పుడు ఎదిగిపోయిందని! నిజమే నారాయణలో క్షణాల్లో డబ్బు సంపాదించాలన్న యావతో బాటు మంచి గుణాలుకూడా వున్నాయి. స్నేహానికి విలువనిస్తాడు, వినయంగా, మర్యాదగా మాట్లాడతాడు. స్త్రీలంటే గౌరవంవుంది. ఎన్నివున్నా తనకాళ్ళమీద తను నిలబడలేని మగాడిని 'అసమర్థు'డనే అంటుంది ఈ సంఘం. నారాయణ వ్యక్తిత్వంలో గిరిజని ఆకర్షించిన విషయమేవిటో ఎంత తన్నుకున్నా శంకరానికి అర్థంకాలేదు.

## 17

నారాయణ పూర్తిగా ఇల్లుపట్టకుండా తిరగటం ఎక్కువయింది. ఎప్పుడో వస్తే వస్తాడు, లేకపోతే లేనేలేదు. వచ్చినా ఒక్కోరోజు భోజనం చేస్తాడు. ఒక్కొక్కసారి అదీ చెయ్యడు. తలిదండ్రు లిద్దరికీ నారాయణ విప్పలేని సమస్య. ఏళ్ళు పైబడుతున్నా కొడుకు తాడూ బొంగరంలేని వాడిలాగా అలా తిరగడం ఆ ఇద్దరినీ లోలోపల విచారంతో కుంగదీస్తోంది.

"పోనీ నారాయణకి పెళ్ళిచేద్దామండీ. బాధ్యతలు మీదపడి అప్పుడయినా కుదురుగా వుంటాడేమో" అంది పార్వతమ్మ.

తాడెత్తున ఎగిరిపడ్డారు సుందరయ్యగారు. "ఇలాటి సుపుత్రుడిని కన్నది చాలక ఇంకో పిల్లగొంతుకూడా కొయ్యటం ఎందుకే ? వాడికే తిండి సంపాదించుకోలేనివాడు పెళ్ళాంపిల్లల్ని ఏం పెట్టి పోషిస్తాడంటావు. లేకపోతే వాడి సంసారాన్నికూడా నేనే మొయ్యాలనా నీ ఉద్దేశ్యం.

ఏళ్ళతరబడి ఇద్దరిమధ్యా ఈ సంభాషణ ఇలా జరుగుతూనేవుంది. ఏమయినా సరే నారాయణకి ఏదోవిధాన పెళ్ళిచెయ్యాలని పార్వతమ్మగారు పట్టుపట్టింది. సుందరయ్యగారు తలవంచక తప్పలేదు.

* * *

'నారాయణా! గిరిజని చేసుకోవటం నీకు ఇష్టమేనా' అని శంకరం అడిగినప్పుడు నారాయణ ప్రపంచం అంతా తలక్రిందులైనట్టుగా ఆశ్చర్యంగా, అయోమయంగా చూశాడు స్నేహితుడివైపు. చాలసేపటికిగానీ మాటల్ని కూడదీసుకోలేకపోయాడు.

"నేనా? గిరిజనా? నీకేం మతిగానీ పోలేదుగదా?" అన్నాడు.

"అవును నువ్వే నీకు ఇష్టమో కాదో చెపితే మీవాళ్ళతో మాట్లాడతాను."

"చూడు శంకరం నవు నన్నెందుకు ఎంచుకున్నావో నాకు అర్థంకావటంలేదు. నా చిన్ననాటి స్నేహితుడివి. నీ దగ్గర నేను దాయగలిగిందేమీ లేదు."

"నిన్ను ఎన్నుకుంది నేనుగాదు, గిరిజే."

నారాయణ నమ్మలేనట్టు చూశాడు. కళ్ళు తళతళమెరిశాయి ఒక్కక్షణం.

"గిరిజకి నావిషయాలేమీ తెలియకపోతే నువు చెప్పెయ్యి" అన్నాడు చివరికి.

''తనకి నిన్నుమార్చగలశక్తి వుందనుకుంటుంది గిరిజ'' ముభావంగా అన్నాడు శంకరం. అతనికి అంతరాంతరాల్లో ఈ పెళ్ళి ఏమాత్రం ఇష్టలేదు. నారాయణ శంకరంవైపు చూశాడు. అతని ముఖంలో గిరిజే కనిపించింది. అయినవాళ్ళందరు తనని వేరుగా, దూరంగా చూస్తున్న తరుణంలో మరోయువతి తనని కోరుకుంటూ, తన జీవితంలో ప్రవేశించాలనుకుంటుంది. ఎంత విచిత్రం. నారాయణ జీవితంలో ఎప్పుడూ ఎరగని అనుభూతి ఇది.

నారాయణకి, గిరిజకి పెళ్ళయిపోయింది. ఈ యేడుపేదో ముందరే ఏడువకూడదూ అనుకున్నారు లోకులు. 'తండ్రీ ఇప్పటికయినా వాడికి కుదురు నివ్వు' అంటూ తలిదండ్రులు మొక్కుకున్నారు. 'భగవాన్ నా చెల్లెలి జీవితం పచ్చగా నిత్యకళ్యాణంలాగా మూడుపువ్వులు ఆరుకాయలుగా సాగిపోనీ' అంటూ వేడుకున్నాడు శంకరం.

నారాయణకి త్వరలో నే తను పెళ్ళిచేసుకుని ఎంత పొరపాటుచేశాడో తెలియ సాగింది. గిరిజతో కొత్తజీవితం మధురంగానేవుంది కానీ దానితోపాటుగా మరికొన్ని సమస్యలుకూడా ఎదురయ్యాయి.

"మీరు ఏదోఒక ఉద్యోగం చూసుకోండి లేకపోతే నలుగురిలో చులకనయి పోతాం మిమ్మల్నిబట్టేగదా నాకు గౌరవం" అంది గిరిజ

ఇది జగమెరిగిన సత్యమే అయినా నారాయణకి మింగుడు పడని సమస్యే. మరొకళ్ళ కింద పనిచెయ్యటమనేదే నారాయణ తత్వానికి వ్యతిరేకం కొత్తభార్య మాటల్ని తీసివెయ్యలేక ఇదిగో అదిగో అంటూ గడుపుతూ వచ్చాడు. నారాయణకు మరో కొత్త బాధ తలకి చుట్టుకుంది. ఇదివరకు తెగినగాలిపటం లాగ ఎక్కడ తిరిగినా చీకూచింతా వుండేదిగాదు. ఇప్పుడు నారాయణ ఏ పని చేస్తున్నా గిరిజే మనసులో మెదులుతోంది. తనని కట్టుకుని గిరిజ అవమానాల పాలవుతోందేమోనన్న ఆవేదన సంపాదనలేని మొగుడి భార్య ధీమాగా తలెత్తు కుని నలుగురిలోనూ ఎలా తిరగ్గలదు' నారాయణకి తండ్రి కంట పడ్డ లంటే ఇదివరకు లేని బెరుకు పట్టుకుంది శక్తి ఉడిగిపోయి ముసలిఎద్దులాగా సంసా రాన్ని ఈడుస్తున్న తండ్రిమీద తన భార్య మరోభారం ఇంటికివస్తే ఏక్షణాన బయిటికి పోదామా అన్నట్టు ముళ్ళమీదున్నట్టుగా గడిపేవాడు. వీటన్నింటికి పరిష్కారం ఒకటే, తను చేతుల్నిండా డబ్బుసంపాదించాలి ఎలా? నారాయణ మునపటి అలవాట్లు మరికాస్త విస్తరించినాయి. పదిరాళ్ళు విసిరితే ఒకటయినా తగలకపోతుందా అన్న ఆశ ఎక్కువయిపోయింది.

నారాయణ తీరు మార్చుకోమని గిరిజ ఎంతగానో నచ్చచెప్పేది. బతిమాలేది కళ్ళనీళ్ళు పెట్టుకునేది. బెదిరించేది. నారాయణ అన్నిటికీ ఒకటే జవాబు చెప్పే వాడు

"కొద్దిరోజులు ఓపికపట్టు గిరిజా. నాజాతకంలో బ్రహ్మాండమయిన మార్పు రాబోతుంది. మహాలక్ష్మీ యోగం రాసిపెట్టివుంది నాకు అప్పుడు చూసుకో నా తడాఖా. నేనంటే లెఖచెయ్యనివాళ్ళే రేపు నాకాళ్ళు పట్టుకుంటారు. నిన్నూ, అమ్మనీ, నాన్ననీ అందర్నీ కింద నడవనిస్తా ననుకున్నావా?"

"ఎప్పుడో పట్టబోయే యోగం సంగతి ఎందుకు? ఈరోజు జరగబోతున్న దాన్ని గురించి ఆలోచించండి. ఇంతకాలం మనిద్దరమే ఇప్పుడు మరోప్రాణి మనమధ్యకి రాబోతోంది." నారాయణని మార్చాలన్న తన ప్రయత్నాలన్నీ వ్యర్థమయిపోయాయన్న విసుగు, విచారం, ముందురోజులు ఎలా వెడతాయో అన్న భయం గిరిజలోని సంతోషాన్ని హరించేస్తున్నాయి

నారాయణకి ఈ వార్త, సంతోషాన్ని కలిగించి తా మరికాస్త భయాన్నికూడా వెంటతెచ్చింది. నారాయణ అతికష్టంమీద ఓ గేరేజీ యజమానికి సహాయంగా పనిచెయ్యటానికి ఒప్పుకున్నాడు ఈ వార్త విన్న గిరిజ సంతోషానికి అవధు ల్లేవు తల్లిదండ్రి 'వాడి చెడ్డరోజులు పోయినట్టున్నాయి కుదురు ఏర్పడు తోంది' అంటూ మురిసిపోబోయారు అందరి సంతోషం మూడునాళ్ళ ముచ్చటే అయింది. నెలరోజులు గడవకుండానే ఆ ఉద్యోగానికి గుడ్‌బై చెప్పేశాడు నారాయణ

శంకరం ఒకరోజు ఆఫీసునించి వస్తుంటే షావుకారు మాధవయ్య కనిపిం చాడు. "శంకరంగారూ! మీ బామ్మర్దిగారిని కాస్తంత త్వరగా బాకీ తీర్చమని చెప్పరూ డబ్బు అవసరంపడింది" అన్నాడు.

శంకరానికి విషయం అర్థంకాలేదు "బాకీ ఏమిటండీ?" అన్నాడు.

"నోటురాసి వెయ్యిరూపాయలు తీసుకున్నాడండీనారాయణగారు ఏడాదిదాటి పోయింది. ఇదిగో అదిగో అంటాడు. గట్టిగా అడిగితే వడ్డీ ఇస్తున్నాగాదుటయ్యా అంటాడండి అన్నీ బిగిసిపోయిన బేరాలే అవుతే మాకుమాత్రం చెయ్యేట్టా తిరుగుద్దండి" అన్నాడు మాదవయ్య.

"నువు ఏ ఆధారం చూసుకుని నారాయణకి బాకీ పెట్టావయ్యా ఎలాతీర్చ గలడనుకున్నావు?" అన్నాడు శంకరం. అతనికి గిరిజ భవిష్యత్తు రోజురోజుకి అంధకారంలోకి జారిపోతున్నట్లుగ అనిపించసాగింది

"అలా అంటారేటండి మీరు. ఇల్లుందిగదండి. రెండెకరాలు పొలంవుంది గదు టండీ! పైగా సుందరయ్యగారు మాట తప్పని మనిషండి" అన్నాడు షావుకారు.

"ఇంటికీ పొలానికీ నారాయణ ఒక్కడే గాదయ్యా వారసుడు మరి ముగ్గురున్నారు. ఆ సంగతి తెల్సా?" శంకరం కోపంగానే అన్నాడు.

"అయన్నీ నే చూసుకుంటా లెండి మీకెందుకు. మీరు నారాయణతో బాకీ త్వరగా తీర్చమన్నానని చెప్తురూ." శంకరం మాటలువిని మాధవయ్యలో కంగారు పుట్టింది.

"మాధవయ్యగారూ! మీరు నాకో సహాయం చెయ్యగలరా?" అన్నాడు.

"చెప్పండి" అన్నాడు మాధవయ్య.

"ఇకముందు మీరుగానీ, మీకు తెలిసినవాళ్ళు గానీ నారాయణకి అప్పు ఇవ్వకుండా చూడండి. అదే మీరు చెయ్యగల పెద్ద ఉపకారం" అంటూ వెళ్ళి పోతున్న శంకరాన్ని చూసి 'బలేవోడే పంతులు' అంటూ సణుక్కున్నాడు మాధవయ్య.

శంకరం నారాయణ అప్పుల సంగతి గిరిజతో చెప్పాడు. "విన్నావా సంగతి ? ఇంకెన్ని అప్పులున్నాయో భగవంతుడికే తెలియాలి. నేనప్పుడే చెప్పాను కదామ్మా. ఈ మానవుడిని మార్చటం బ్రహ్మతరం కూడా కాదని. ఛీ, ఛీ మనిషయి పుట్టగానే సరా, బరువు బాధ్యతలు, పరువు ప్రతిష్ఠలు గుర్తించని మనిషి పశువుకంటే హీనం."

ఖిన్నురాలయి వింటున్న గిరిజని చూడగానే శంకరానికి దుఃఖం పొర్లుకొచ్చింది. దుఃఖంలో వున్న చెల్లెలిని అనునయించటానికి బదులు మరింత బాధ పెడుతున్నాడు మాటలతో. ఇందులో తన తప్పూ వుంది. నారాయణ ఎలాటి వాడో తెలిసి కూడా ఈ పెళ్ళి జరిపించటం తన బుద్ధితక్కువతనమూ, పొరపాటూ గాదూ; గిరిజకి గర్భిణీ స్త్రీలో వుండవలసిన సంతోషంగానీ,మెరుపు నిగారింపులు గానీ లేవు. మనిషి చిక్కింది. శంకరానికి చటుక్కున ఏదో అనుమానం వచ్చింది.

"అమ్మా గిరిజా! నీ గొలుసు వుందా మెళ్లో?" అన్నాడు మెల్లగా. గిరిజ పమిట కొంగుని మెడచుట్టూ కప్పుకుని వుంది. ఆ కళ్ళనుంచి రాలిన నీటి బిందువులే శంకరానికి సమాధానాన్ని చెప్పాయి. సంగతులన్నీ విన్న సుందరయ్యగారు కోపం పట్టలేక నారాయణని ఎడాపెడా చివాట్లుపెట్టి ఇంట్లోంచి బయటికి పొమ్మన్నారు. నారాయణ రోషంతో ఇంటికి రావటం మానేసి క్లబ్బులోనే మకాం పెట్టాడు. గిరిజ దుఃఖం, పార్వతమ్మగారి ఆవేదన చూడలేక శంకరం నచ్చచెప్పి నారాయణని ఇంటికి తీసుకువచ్చాడు. ఒక మనిషి బాధ్యతారహితమయిన ప్రవర్తన ఎంతమంది జీవితాల్లో నిప్పులు పోస్తుందో, నిరాశని నింపుతుందో, ఎన్ని సంసారాలు నరక సదృశంగా మారతాయో నారాయణని చూస్తే చాలు.

## 18

రాత్రి పన్నెండు గంటల వేళ నారాయణ క్లబ్బులోంచి బయటికి వచ్చాడు. క్లబ్బు బాయ్ రామం వెనకే వచ్చాడు 'బాబూ'అంటూ. ''బాబూ ఒక్క అయిదు రూపాయలుంటే ఇవ్వండి.' సంకోచిస్తూనే అడిగాడు.

"ఎందుకురా?" నారాయణ వాడివైపు చూస్తూ అడిగాడు. వాడు సిగ్గుపడ్డాడు జవాబు చెప్పటానికి. "ఏంలేదు బాబూ మరి మా ఆవిడ నీళ్ళోసుకుంది. తీపి తినాలనుందంట బాబూ" అంటూ నసిగాడు.



నారాయణ ఒక్క క్షణం వాడివైపు చూసి జేబులోంచి ఐదు రూపాయల కాగితాన్ని తీసి వాడికిచ్చాడు. వాడు ఓ నమస్కారం పెట్టి క్లబ్బు తలుపులన్నీ ముయ్యటానికి వెళ్ళిపోయాడు. నారాయణ నడిరోడ్డుమీద నిలబడిపోయాడు ఓ క్షణం.

అవును, గిరిజ కూడా తన బిడ్డకి తల్లి కాబోతోంది. తనకికూడా మనసులో ఏవేవో కోర్కెలు వుండే వుంటాయి. ఒక్కనాడూ నోరుతెరిచి తననేదీ అడగ లేదు. తనయినా ఏ ఒక్కనాడూ ఏ చిన్నవస్తువయినా ప్రేమగా తీసుకువెళ్ళి గిరిజకి ఇవ్వలేదు. పాపం ఎన్ని ఆశలతో, కోర్కెలతో తనని వివాహం చేసుకుందో! ఇప్పుడందుకు విచారిస్తోందేమో! నిజానికి తనెందుకు నలుగురిలా జీవించలేకపోతున్నాడో నారాయణకే అర్థంకావటంలేదు.

జేబులో మిగిలిన ఆఖరి రూపాయినోటు చేతికి తగిలింది. గిరిజకి ఇష్టమయిన దేదయినా తీసుకువెళ్ళాలన్న కోరిక కలిగింది. రూపాయికి ఏం వస్తుందని!

నడుస్తుంటే సినిమాహాలు దగ్గర పూలదండల్ని అమ్ముతున్న పూల సాయేబు కనిపించాడు. గిరిజకి మల్లెపూలంటే ఎంతో ఇష్టం. నారాయణ రూపాయి ఇచ్చి వాడి దగ్గరున్న మల్లెదండలన్నిటినీ పొట్లం కట్టించి తీసుకున్నాడు.

ఇంటికి వచ్చిన నారాయణ పిల్లిలాగా నడుస్తూ తన గదిలో ప్రవేశించాడు. గిరిజ తన మంచంమీద పడుకుని నిద్రపోతోంది. లైటువేసి మెల్లగా దగ్గరగా వచ్చి తట్టి లేపబోయిన నారాయణ ఆ లైటు వెలుతురులో గిరిజ మొహం చూసి చటుక్కున ఆగిపోయాడు. గిరిజ చెంపలమీద కన్నీరు చారికలు కట్టివుంది.

విశాలమయిన కళ్ళక్రింద నల్లటి నీలి నీడలు. ఆ మొహంలో బాధ, ఆవేదన, దుఃఖం అన్నీ పెనవేసుకుని వున్నాయి. నారాయణ మనసు బాధతో, సిగ్గుతో ముడుచుకుపోయింది. చేతిలోని పూల పొట్లాన్ని గిరిజకు దగ్గరగా పెట్టి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు కిటికీలోంచి బయటి చీకటిలోకి చూస్తూ ఎంతసేపు అలా కూర్చున్నాడో నారాయణకే తెలియదు. డ్రాయరు తెరిచి డైరీ అందుకుని అందులో రాసుకున్నాడు. "అదృష్ట దేవతా నన్ను త్వరగా కరుణించు. నా వాళ్ళందరినీ ఎప్పటికి సుఖపెట్ట గలుగుతానో."

* * *

సత్యన్నారాయణ చాలా బిజీ మనిషి అయిపోయాడు. ఆతన్ని పట్టుకోవా లంటే గంటలతరబడి వేచి వుండాల్సి వస్తోంది. నారాయణ ఆ ప్రొద్దుటినించీ ప్రయత్నించి సాయంత్రం వేళకి సత్యన్నారాయణని కలుసుకోగలిగాడు. ఎప్పటిలాగే చిరునవ్వుతో ఆహ్వానించి చల్లటి గోల్డ్‌స్పాట్ తెప్పించి ఇచ్చాడు. కుశల ప్రశ్నలు అడిగాడు

నారాయణ ఎందుకో విచారంగా వున్నట్టుగమనించాడు సత్యన్నారాయణ. "సత్యంగారూ మీరు నాకో సహాయం చెయ్యాలండీ!" చివరకు ఎలాగో గొంతు పెగుల్చుకుని మెల్లగా అడిగాడు నారాయణ.

సత్యన్నారాయణ ఆశ్చర్యంగా వింతగా చూశాడు.

"నాకేదయినా వుద్యోగం ఇప్పించండి" అన్నాడు మళ్ళీ

"ఉ ఇ, ఇ ఇన్నాళ్ళకి మ్మమ్మ, మంచి బుద్ధి క క కలిగిందోయ్ నా న్నా నారాయణా" అంటూ నవ్వాడు సత్యన్నారాయణ

నారాయణకి ఆ క్షణంలో తను ఇంతవరకూ విడిచిపెట్టుకున్న అవకాశాలన్నీ గుర్తుకొచ్చి బాధ కలిగింది. తన ప్రవర్తనతో తండ్రికి ఎంత ఆవేదన కలిగించాడో తల్చుకుంటే సిగ్గువేసింది

"ఏ ఏ ఏ వుద్యోగం ఇ ఇప్పించమంటావు?" అంటూ నారాయణనే ఎదురు ప్రశ్నించాడు. నారాయణ మౌనంగా బట్టలకొట్లోకి వచ్చిపోతున్న జనం వైపూ లైట్ల వెలుగుకి తళతళా మెరుస్తున్న బట్టల తానులవైపూ చూస్తున్నాడు.

సత్యన్నారాయణ మాత్రం క్షణాల్లో ఏ వుద్యోగమని ఇప్పించగలడు! "త్వరగా చూపించండి చీరలు," అంటూ తొందరచేస్తున్న కస్టమర్స్‌ని, కొట్లోని రష్‌కి తట్టుకోలేకుండావున్న గుమాస్తాల్ని చూస్తున్న సత్యన్నారాయణకి ఒక ఆలోచన వచ్చింది.

"కొ కొట్లో చేరిపో న్నా న్నారాయణా. మ మ మరో మంచి వుద్యోగం చూ చూసేవరకు" అన్నాడు.

నారాయణ ఆ మాటలు విని ఓసారి ట్యూబ్‌లైట్ల వెలుగుకి దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ షాపునీ, జనాన్నీ పరిశీలనగా చూసి తల వంచుకున్నాడు. ఆఖరికి బట్టలు అమ్మే సేల్సుమన్‌గానా తన జీవితం నడవబోయేది. కళ్ళల్లో నీళ్ళు తిరిగినట్లయింది. గిరిజ మొహం కళ్ళముందు మెదిలింది. రాత్రి నిద్రలో ఆ మొహంలో గమనించిన బాధను, దుఃఖాన్ని నారాయణని మారు మాట్లాడ నివ్వలేదు.

"రేపటినించి వస్తాను" అంటూ లేచి వచ్చేశాడు నారాయణ

## 19

నారాయణకి మొదట్లో ఆ వుద్యోగం సరదాగానే వుంది. వచ్చే పోయే రకరకాల జనం. రకరకాల మనస్తత్వాలు. కానీ ఆ తసేపు నిలబడి పనిచెయ్యా లంటే కాళ్ళు నొప్పి పెట్టసాగాయి. అయినా వోర్చుకున్నాడు నారాయణ. నారాయణ గాక మరో ముగ్గురు వున్నారు షాపులో. నారాయణ వాళ్ళదగ్గర నించి పనిలోని మెళుకువలన్నీ నేర్చుకున్నాడు.

సుందరయ్యగారికి కొడుకులోని ఈ మార్పు అర్థంగాలేదు. అంతకంటే ఎన్నో మంచి అవకాశాలు వదులుకుని ఆఖరికి 'సేల్స్‌మన్'గా ఎందుకు చేరినట్టో ఆయనకి ఆశ్చర్యం కలిగించినా ఏమీ లేనిదానికంటే ఏదో ఒకటి మేలేగదా అని సంతోషపడ్డాడు.

పార్వతమ్మగారు కొడుకు కలెక్టరు అయిపోయినట్టుగా సంతోషపడింది. "నే చెప్పలేదుటండీ, పెళ్ళిచేస్తే బాధ్యతలన్నీ మీదపడి వాడే మారతాడని. తండ్రి కాబోతున్నాడు. వాడికి మాత్రం బరువు బాధ్యతలు తెలియకుండా వుంటాయా?" అంటూ పొంగిపోయిందావిడ.

ఈ వార్త గిరిజకీ సంతోషాన్నే కలిగించింది. భర్తలో మార్పు వస్తున్నం దుకు, ఈ మార్పు స్థిరం కావాలని మొక్కుకుంది దేముళ్ళకి.

నారాయణకి క్షణక్షణం ఆలోచనలతో పోరాడటమే సరిపోతుంది. తను కలలుగన్న జీవితం ఏమిటి? తను చేసే పనేమిటి? సత్యన్నారాయణ లాగా ఠీవిగా కార్లలో తిరుగుతూ, కౌంటరు దగ్గర దర్జాగా కూర్చుని ఆర్డర్లీ చెలా యించాలనుకున్నాడు. రెండుచేతులా డబ్బు సంపాదించాలనుకున్నాడు గానీ,

ఇలా పొద్దస్తమానం నిలబడి చేసే గుమాస్తా పనా తను కోరుకుంది. నారాయణకి తనమీద తనకి కోపం, తనవాళ్ళందరి మీద క్రోధం. ముఖ్యంగా గిరిజమీద. తనీ పెళ్ళి చేసుకోకుండా వుంటే ఎంత హాయిగా వుండేది! తను వాళ్ళ బాధని చూడలేడు. ఈ జీవితానికి అనుగుణంగా మారనూలేడు. ముందు నుయ్యి వెనుక గొయ్యిలాగా వుంది నారాయణ పరిస్థితి.

పళ్ళబిగువున నెలరోజులు గడిచినాయి. సత్యన్నారాయణ మిగిలినవాళ్లతో బాటుగా నారాయణకి కూడా వందరూపాయలు చేతిలో పెట్టాడు. ఆ నోటు చూడగానే నారాయణ ప్రాణం వుసూరుమంది. ఈ నోటుతో ఎన్ని అవసరాలు తీరతాయని? నెలరోజుల కష్టానికి ఇది ఫలితమా? హోటల్లోనే ముప్ఫయి రూపాయల వరకు ఇవ్వాలి. సిగరెట్ల బడ్డీలో పదిరూపాయలు ఇవ్వాలి. మరింకెన్నో ఖర్చులు. అన్నీ పోయి గిరిజకి ఇవ్వటానికి ఇందులో ఏం మిగులుతుందని.

నారాయణకి పిచ్చెత్తినట్టుగా వుంది. నెలరోజులుగా చలపతివాళ్లతో కలిసి తిరగటానికి వీలులేకుండా వుంది. ఈ నెల లాటరీ టిక్కెట్లు కొననేలేదు. నారాయణ ఏభై రూపాయలు తన దగ్గర వుంచుకుని మిగిలిన యాభై గిరిజ చేతికి ఇచ్చాడు, ఇంటికి వెళ్ళగానే. ఆ డబ్బు చూడగానే గిరిజ మొహం సంతోషంతో వెలిగిపోయింది. భర్త సంపాదనలో మొదటిసారిగా తన చేతికిచ్చిన డబ్బు అది. భక్తిగా కళ్ళకి అద్దుకుంది.

"అత్తయ్యకి ఇవ్వనా" అని అడిగింది నారాయణని.

"ఏదో చెయ్యి" అన్నాడు నారాయణ విసుగ్గా. భోజనంచేసి వెంటనే బయటికి వెళ్ళిపోయాడు.

మధ్యాహ్నం ఒంటిగంటవేళ నారాయణ కొట్లో ఒక్కడే వున్నాడు. మిగిలిన వాళ్ళంతా భోజనాలకి వెళ్ళి ఇంకా తిరిగి రాలేదు. సత్యన్నారాయణ లేనప్పుడు కొట్టు అజమాయిషీ చేసే నీలకంఠం కేష్ దగ్గర కూర్చుని పెర్రీమేసన్ నవల చదువుతున్నాడు. షాపుముందు ఓ పెద్దకారు ఆగింది. సినిమా స్టార్లని మించిన మేకప్పులో వున్న ఓ లావుపాటి ఆవిడ మరో నలుగుర్ని వెంటేసుకొని వచ్చింది.

నీలకంఠం చదువుతున్న పుస్తకాన్ని మూసిపెట్టి వాళ్ళని మర్యాదగా ఆహ్వానించాడు.

ఆవిడ ఠీవిగా లోపలికి వచ్చింది. రకరకాల సినిమాలపేర్లు చెప్పి, ఆపేర్లున్న చీరలన్నీ చూపించమంది. నారాయణ ఒక్కటొక్కటితీసి ముందు పడేస్తున్నాడు.

ఆవిడ బృందం అంతా ఒకొక్క చీరే సుతారంగా ఇలాచూసి అలా పెట్టేస్తు న్నారు జార్జెట్లు, షిఫాన్లు, పోలిస్టర్లు, వూలీలు, మరి వంద రకాలు గుట్టలు పడ్డాయి కౌంటరుమీద. అసలు వాళ్ళకి ఏవీ కొనే వుద్దేశ్యం లేనట్టుగా అర్థమ యింది నారాయణకి.

"కంచి చీరలున్నాయా? తెల్లచీరకి ఎర్రబార్డరు, హంసలువున్న చీర కావాలి" అంది జీడిగింజలాంటి రంగున్న వాసంబద్దలాటావిడ.

నారాయణకి వొళ్ళు మండింది. అసలే చిరాగ్గా వున్నాడు

"ముందర ఇవి కానివ్వండి. అవి తరువాత చూద్దురుగాని" అన్నాడు కోపాన్ని అణిచిపెడుతూ.

"ఇవన్నీ పాతఫేషనయిపోయాయండీ. ఇంకేవన్నా కొత్తరకాలుంటే చూపించండి" అంది లావుపాటి మేకప్పావిడ

నారాయణ కోపం కట్టలు తెంచుకుని ప్రవహించింది.

"చాల్లేవమ్మా మహా కొన్నావు. లక్షరకాలు తీయించావు ఇవి నచ్చలేదుట. ఇహ కంచిచీరలు కొంటుందిట. వెళ్ళెళ్ళు, నీకు టైము గడవకపోతే ఏ మ్యాటినీ కయినా పో. మా ప్రాణాలు తియ్యమోకు" అంటూ చకచకా చీరలన్నీ బీరువాల్లో సర్దెయ్యసాగాడు

నారాయణ విదిలింపులకి వచ్చినవాళ్ళు తెల్లబోయారు. ఆపైన అవమానంతో ఎర్రబడిపోయారు. కోపంతో మాడిపోయారు. లావుపాటి ఆవిడ చెప్పులు విరిగేట్టుగా నేలని బాదుతూ నీలకంఠం ముందుకి వెళ్ళి నిలబడింది. నీలకంఠం గంట నించి ఈ తమాషా అంతా గమనిస్తూనే వున్నాడు. అతనికి విసుగ్గానే ~~వుంది. కానీ వ్యాపారంలో ఇలాంటి చికాకులెన్నో దాచుకోవాలి. కొంతమంది~~ తలతిక్కల్ని భరించాలి. ఓర్పు, సహనం లేందే వ్యాపారం సాగదు. వాళ్ళు కొనకపోయినా చిరునవ్వుతో అడిగినవన్నీ చూపించటమే వ్యాపార రహస్యం.

"ఏవండీ సత్యన్నారాయణ గారెక్కడ. మీ షాపుకి వచ్చేవాళ్ళని ఇలాగే ట్రీట్ చేస్తూ వుంటారా ? ఇంత ఇన్‌సల్ట్ చేస్తాడా ఆఫ్ట్రాల్ ఒక గుమస్తా ? సత్యన్నారాయణగారు రాగానే నాకు ఫోన్ చెయ్యమనండి. ఈ కుర్రాడిని తీసి పారేసేవరకు మీ షాపుకి ఎవ్వరూ రారని గుర్తుంచుకోండి" అంటూ ఆవిడ బృందాన్ని వెంటేసుకుని వెళ్ళిపోయింది ధుమధుమలాడుతూ. నీలకంఠం నెత్తీ నోరూ కొట్టుకున్నాడు. నారాయణని మందలించాడు. ఆవిడెవరో తెలియ చెప్పాడు. "ఆవిడ సత్యానికి చాలా దగ్గర మనిషయ్యా నారాయణా. నువ్విలా

మాట్లాడావని తెలిస్తే సత్యం అగ్గిమీద గుగ్గిలమైపోతాడు. ఇంత ఓర్పులేకపోతే నువ్వేం వుద్యోగం చేస్తావయ్యా". అంటూ చివాట్లేశాడు నారాయణని.

నారాయణకి అసహ్యం హద్దులు దాటిపోయింది. "సత్యన్నారాయణగారొచ్చాక చెప్పండి. నేను వుద్యోగం మానుకుంటున్నాను" అంటూ వెళ్ళిపోయాడు నారాయణ.

"వెధవ వుద్యోగం, ప్రాణాల్ని తీసింది. పీడా వదిలిపోయింది" అంటూ హాయిగా ఊపిరి పీల్చుకుని షాపు బయటపడిన నారాయణ. సరాసరి కాస్మోపాలిటన్ క్లబ్బుకేసి నడిచి వెళ్ళాడు.

## 20

సుందరయ్యగారు రిటైరయినారు. గిరిజకి ఆడపిల్ల కలిగింది. సుషమ అని పేరు పెట్టారు. శంకరం ముచ్చటపడి మేనకోడలికి సన్నటి బంగారు గొలుసు చేయించి ఇచ్చాడు. శారద పిల్లలు పెద్దవాళ్ళవుతున్నారు. కొడుకు బెంగతో పార్వతమ్మగారి ఆరోగ్యం చెడింది. ఆవిడ మందు ఖర్చులు, ఇంటి ఖర్చులు గడపటమే కష్టంగా వుంది సుందరయ్యగారికి.

సుషమ గుక్కపట్టి ఏడుస్తుంటే పార్వతమ్మగారు మనుమరాలిని చేతిలోకి తీసుకున్నారు.

"గిరిజా, పాపకి పాలు కలిపి తీసుకురా" అంటూ కేక పెట్టారు. పది నిముషాలు, పావుగంట గడిచినా గిరిజ వస్తున్న జాడలేదు. పాప చేతుల్లో నిలవటంలేదు

శారద చేతిలోని పని వదిలి గదిలోకి వచ్చింది, 'గిరిజా' ఏం చేస్తోందో చూద్దామని.

గిరిజ ఖాళీ పాలపిండి డబ్బాని ఎదురుగా పెట్టుకుని బొమ్మలాగా కూర్చుని వుంది. ఆ మనిషిలో ప్రాణం వుంది అనడానికి సాక్ష్యం ఆ కళ్ళనించి అవిరళ ధారగా కారుతున్న కన్నీరు మాత్రమే. శారదకి క్షణంలో పరిస్థితి అర్థమయింది. దుఃఖం వచ్చింది. జాలేసింది. పాపకి పాలడబ్బా తెమ్మని ఎవరితో చెప్పుకుంటుంది ? సంపాదనలేకుండా, ఇల్లు పట్టకుండా తిరిగే భర్త తోనా, ఓపికున్నంతకాలం సంసారభారాన్ని లాక్కొచ్చి విశ్రాంతి తీసుకో వలసిన సమయంలో కూడా ముసలి ఎద్దులాగా అందరి భారాన్ని మీద వేసుకుని ఈడ్చుకొస్తున్న మావగారితోనా ?

శారద పక్కయింటివాళ్ళని అడిగి పాలు తెచ్చి పాపకి ఆకలి తీర్చి నిద్ర పుచ్చింది.




గిరిజ ఆ సాయంత్రం అన్నగారి దగ్గరికి వెళ్ళింది. శంకరం అప్పుడే ఆఫీసునుంచి తిరిగి వచ్చాడు. వంట ప్రయత్నం చేస్తున్నాడు.

శంకరానికి పిల్లనివ్వటానికి ఎంతమందో ముందుకి వచ్చారు. అయినా చెల్లెలి సంసారం చూశాక అతనికి వెంటనే పెళ్ళి చేసుకోబుద్ధి పుట్టటంలేదు. వచ్చినవాళ్ళందరిని ఏదో వంకన తిప్పి పంపేస్తున్నాడు.

వంట ప్రయత్నంలో ఉన్న అన్నగారిని చూడగానే గిరిజకి జాలి వేసింది. శంకరం చేతుల్లోంచి కూర తీసుకుని తను తరగటం మొదలుపెట్టింది.

"అన్నయ్యా! ఇప్పుడే చెబుతున్నాను. ఈసారి నువ్వు అవునన్నా సరే కాదన్నా సరే ఆ సోదెమ్మ మామ్మగారి మనవరాలి సంబంధం కుదిర్చేస్తాను. లేదంటావా నీకు నచ్చిన పిల్లని ఎవరో ఒకళ్ళని ఒప్పుకో. అంతేగానీ ఇంకా ఇలాగే అవస్త పడతానంటే ఒప్పుకోను" అంది తీవ్రంగా.

"గిరిజా! అంత పాపం చేశానుటే నేను. మామ్మగారి మనవరాలిని పెళ్ళాడమంటావా ? ఎందుకే అంత కోపం నామీద." జాలిగా అంటున్న శంకరాన్ని చూసి నవ్వేసింది.

ఆ వాడలో మామ్మగారి నోటికి ఎదురులేదు. ఆవిడ నోరు చూసే మనవరాలి సంబంధాలన్నీ తప్పిపోతున్నాయని అంతా వేళాకోళం చేస్తూవుంటారు.

"మరేవిటన్నయ్యా ఇలా ఎంతకాలం ?"

"గిరిజా! ఒక గొప్పకవి పెళ్ళిని గురించి ఏం చెప్పాడో తెలుసా ? అది తలుపులు మూసేసిన గదిలాటిదట. లోపలున్నవాళ్ళేమో బయటికి రావాలని చూస్తూ వుంటార్ట. బయటనున్నవాళ్ళేమో లోపలికి పోవాలని ఆత్రపడుతూ వుంటార్ట.''

"నిజమే అన్నయ్యా. ఎవరోగానీ చాలా బాగా చెప్పారు,'' అంది గిరిజ.

''పాపేది ?"

"శారద వొదిన దగ్గర వుంది."

"నారాయణ ఇంటికి వస్తున్నాడా అమ్మా ?"

పరధ్యాన్నంగా ఉన్న గిరిజ శంకరం ప్రశ్న వినిపించుకోలేదు.

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు ?"

"అన్నయ్యా !"

గిరిజ ఏదో చెప్పాలని, సంకోచిస్తోందని గ్రహించాడు. దగ్గరగా వచ్చి కూర్చున్నాడు. ''ఏమిటమ్మా గిరిజా !?"

"అన్నయ్యా! నా కేదయినా వుద్యోగం దొరుకుతుందేమో ప్రయత్నించ దలవా ?" గిరిజ మెల్లగా అంది.

శంకరం చెల్లెల్ని పరీక్షగా చూసాడు. గిరిజ తలవంచుకుని కూర తరుగుతోంది. ఆ ముఖంలో ఏ భావాలున్నాయో గమనించలేకపోయాడు.

"పసిబిడ్డతో నీకు ఇప్పుడు వుద్యోగం ఏమిటమ్మా ? ఇప్పుడు అంత అవసరం ఏం వచ్చిందని ?"

గిరిజకి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఇంట్లో అవసరంగా వుంది అన్నయ్యా. పాపని అత్తయ్యా, వదినా చూసుకుంటారు" అంది మెల్లగా.

ఏదో జరిగిందని గ్రహించాడు శంకరం. బుజ్జగించి బతిమిలాడిన తరువాత గిరిజ ప్రొద్దుటి సంఘటనని గురించి చెప్పింది. అభిమానంతో, చెప్పలేనట్లుగా చెబుతున్న గిరిజని చూసి శంకరం మనసు బాధతో, జాలితో నిండిపోయింది. అంతలోనే చర్రున కోపం పైకి తన్నుకొచ్చింది.

"నే నా రోజునా చెప్పానా ? వాడు వుట్టి వెధవమ్మా ఆ మనిషి ఇంక మారడని. నా మాట విన్నావా ? సూక్తులు వల్లించావే ! ఏదీ నీ మంచితనం వాడిని ఏమన్నా మార్చగలిగిందా ? ఇప్పుడు బాధపడుతోంది ఎవరు ? నువ్వేనా? ఛీ ఛీ ఇంత బాధ్యత ఎరగని మనిషిని నే నెక్కడా చూడలేదమ్మా!

అసలు మనిషా పశువా అన్న అనుమానం వస్తోంది. అయితే నువు కూడా వాడిలాగానే తయారవుతావన్నమాట. నీ కో అన్నయ్య అనే వాడున్నాడని మర్చిపోయావామ్మా ? పసిబిడ్డకి పాలు లేకుండా చేస్తావా ? నే నంత పరాయివాడిని అయిపోయానా ?" శంకరానికి ఆపైన మాటలు పెగలక కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

అన్నగారి ఆవేదన, బాధ, ఆప్యాయత చూసి గిరిజ కళల్లో చివ్వున నీరు చిమ్మింది. తను ఏమాత్రం బాధపడినా శంకరం సహించలేడని తెలుసు గిరిజకి ఎన్ని బాధల్లో వున్నా గిరిజకి ఆ ప్రేమే కొండంత అండగా వుండి ధైర్యాన్నిస్తుంది.

గిరిజ తలెత్తి అన్నగారిని చూసి నవ్వింది. "నువు మాత్రం ఎన్నని ఇస్తావు ? ఎంత కాలం అని ఇస్తావు అన్నయ్యా ? నాకయినా ఇంట్లో తీరుబడిగానే వుంటుంది. నేను చెయ్యగల ఉద్యోగం ఏదయినా వుంటే చూసి పెట్టు."

శంకరం ఏదో ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయాడు.

"మహిళా మండలిలో కొత్తగా పిల్లలకోసం, నర్సరీ స్కూలు ఒకటి పెడుతున్నారట అన్నయ్యా. దానికి ఓ టీచరు కావాలిట. నీకు తెలిసినవాళ్ళెవ రయినా వుంటే ప్రయత్నించు" అంది గిరిజ.

శంకరం "చూద్దాం" అంటూ లేచి బట్టలు వేసుకుని బయటికి వెళ్ళాడు. పది నిముషాల్లో రెండు పాలడబ్బాలు తీసుకుని తిరిగి వచ్చాడు. గిరిజకి ఇష్టమయిన జిలేబీ, మల్లెపువ్వులూ కూడా తీసుకువచ్చాడు.

అవి చూడగానే గిరిజకి అభిమానంతో కళ్ళలో నీరు తిరిగింది. "నిన్ను ఇవన్నీ తెమ్మని నీతో నా సోదంతా చెప్పుకుంటున్నాననుకుంటున్నావా ?" అంది కోపంగా.

గిరిజ అభిమానపడి చిన్నపుచ్చుకుందని శంకరానికి తెలుసు. ప్రేమగా చెల్లెల్ని దగ్గరగా తీసుకున్నాడు. "చూడు, మామ్మ పోయేముందు ఏం చెప్పిందో గుర్తుందా. నువు తప్ప నా కీ ప్రపంచంలో ఎవరూలేరని చెప్పిందా లేదా ? నువు కూడా నన్ను దూరం చేసేస్తావామ్మా గిరిజా !"

కన్నీటిని ఆపుకోవటం గిరిజ వశం కాలేకపోయింది. శంకరం ఆ కన్నీళ్ళని చేత్తో తుడిచాడు.

"ఎన్ని కష్టాల్లోనయినా మనిషిని ముందుకు నడిపేది భవిష్యత్తుమీది ఆశ

ఒకటేనమ్మా. ధైర్యం కోల్పోయిన రోజున మనకి మిగిలేది ఏదీ వుండదమ్మా గిరిజా." శంకరం పొట్లం విప్పి జిలేబీ గిరిజ నోటికి అందించాడు.

"ఇప్పుడు వద్దన్నయ్యా. తినాలని లేదు."

"అరే గిరిజే! జిలేబీ వద్దనటమే !? ఏది నీ మొహం ఇటు చూపించు. అసలు నువు మా గిరిజవేనా ?"

అన్నగారి ఆశ్చర్యానికి నవ్వొచ్చింది గిరిజకి. జిలేబీ అందుకుని నోట్లో పెట్టుకుంది.

"అదీ. నువు మా గిరిజవే" అంటూ చెల్లెలికి మరో జిలేబీ చుట్టని అందించాడు. గిరిజని ఇంటివరకు దింపి, సుషమని ముద్దాడి సుందరయ్యగారితో కాసేపు కబుర్లాడి తిరిగి వెళ్లాడు శంకరం.

## 21

గిరిజ పదిరోజుల్నుంచి మహిళా మండలిలో వుద్యోగానికి వెడుతోంది.

గిరిజ మొదటగా ఈ వార్త నారాయణ చెవిన వేసినప్పుడు ఉలిక్కిపడ్డాడు.

"నువ్వా ? ఉద్యోగమా ? ఎక్కడ ?" అంటూ ఆశ్చర్యంగా అడిగాడు.

గిరిజ వివరాలు చెప్పింది. అయిష్టంగా మారిన నారాయణ ముఖకవళికలు గమనించనట్టే వుండిపోయింది.

"ఇప్పుడు అంత అవసరం ఏమిటి గిరిజా ?" అన్నాడు చివరికి.

గిరిజ సూటిగా అతని కళ్ళలోకి చూసింది నారాయణ ఆ చూపుని ఎదుర్కోలేకపోయాడు. సుషమని ఎత్తుకునే నెపంతో పక్కకి తిరిగాడు.

"అవసరమా ? ఎందుకులేదు. పెద్దవాళ్ళం మనిద్దరికి ఎలాగయినా గడిచిపోతుంది. కాని పాప ఇంకా పసిదిగదా. దానికి అవసరాలేవో వుంటూ వుంటాయి. మరి అవి తీరేదెలా ?"

గిరిజ గొంతు సౌమ్యంగానే వున్నా ఆ గొంతులోని నిష్ఠురత, బాధ, నిర్లిప్తత ధ్వనించిన తీరుకి నారాయణ తల వంగిపోయింది. వెంటనే చర్రున కోపం వచ్చింది. నారాయణ పెళ్ళయిన దగ్గరనుంచి ఇలాటి నిస్సహాయ స్థితిని అనేకసార్లు ఎదుర్కోవలసి వస్తూనేవుంది. ఆ అన్నా, చెల్లెళ్ళ ఎదురుగా తనెప్పుడూ దోషిలాగా నిలబడుతున్నట్టే అనిపిస్తుంది నారాయణకి. అది తన అంతరాత్మ పడే పశ్చాత్తాపమే అని గ్రహించలేడు. తననిలా ఇరకాటంలో పెడుతున్న గిరిజని చూస్తే వెంటనే కోపం చర్రున లేస్తుంది. సూటిగా నిర్మలంగా చూసే గిరిజ చూపుని ఎదుర్కోగానే, నువ్వే కోపానికి కూడా

అనర్హుడివి అన్నట్టుగా కోపం మాయమయిపోతుంది. నిస్సహాయంగా తలవంచు కోవటం తప్ప మరేమీ చెయ్యలేకపోతాడు. ఇప్పుడూ అలాగే జరిగింది. సుషమని కింద దింపి బయటికి వెళ్ళిపోయాడు.

గిరిజ మెల్లగా కొత్త ఉద్యోగానికి అలవాటు పడుతోంది. గిరిజతోపాటుగా మరో టీచరు కూడా వుంది. ఇద్దరూ చెరొక క్లాసుని చూస్తూ వుంటారు. మహిళామండలి ఆవరణలో రెండు రేకుషెడ్లు లాటివి వేశారు. వాటిలోనే క్లాసులు జరుగుతూ వుంటాయి. దుర్గాదేవి మహిళామండలికి సెక్రటరీ. కుట్లు, అల్లికలు, మిషను కుట్టటం అన్నీ నేర్పుతారక్కడ. అవి నేర్పే టీచర్లున్నారు విడిగా. మండలి ఎకౌంట్సూ, రాతకోతలూ అన్నీ చూడటానికి వెంకటప్పయ్య గారిని ఏర్పాటుచేశారు. ఆయన మండలి ప్రెసిడెంటుకి ఏదో దూరపు బంధువు. ఏభై య్యేళ్ళ వయసుంటుంది. పెద్దవాడని అందరూ గౌరవంగా ఉంటారు ఆయనతో. అందరితో చనువుగా మాట్లాడుతూ వుంటాడు.

"వచ్చావామ్మా గిరిజా! ఏదీ నీ ఫ్రెండు రాలేదా ఇంకా?" అంటూ ఎదురొస్తాడు వీధిలోకే. గిరిజతో బాటుగా పనిచేస్తున్న మరో టీచరు సుధ.

"టయిమయింది గదా వస్తూ వుంటుంది" అంటుంది గిరిజ. తను క్లాసులోకి వెళ్ళి కూర్చుంటుంది. పిల్లలు ఒకొక్కరే వస్తుంటారు.

వెంకటప్పయ్య ఆఫీసు గదిలోకి వెళ్ళిపోతాడు పని చూసుకోవటానికి. ఆ గదిలోంచి రెండు రేకు షెడ్లు స్పష్టంగా కన్పిస్తూవుంటాయి. గిరిజ వారం రోజులయేసరికి గ్రహించింది. టేబుల్ దగ్గర కూర్చున్న వెంకటప్పయ్య చూపులన్నీ రేకుషెడ్లమీదే వుంటాయని. వెంకటప్పయ్యని చూస్తే అకారణంగానే గిరిజకి భయం వెయ్యటం మొదలయింది. ఆయన చూపులు శరీరాన్నంతా పట్టి తడిమి చూస్తున్నట్టుగా వుంటాయి. ఆ చూపుల్లో లేకితనం వున్నట్టు కనిపిస్తుంది. గిరిజ ఎప్పుడు దృష్టి తిప్పి చూసినా వెంకటప్పయ్య ఇటే చూస్తూ కనిపించసాగాడు.

గిరిజ వుండబట్టలేక మెల్లగా సుధతో అన్నది ఒకరోజున. "అబ్బ ఏమిటి ఆ ముసలాయన మరీ అలా గుడ్లు మిటకరించుకుని చూస్తాడేమిటి?" అంది.

సుధ నవ్వింది. "నువ్వూ గమనించావన్నమాట. ఆయన దృష్టి ఎప్పుడూ మనమీదే వుంటుంది. చూశావా" అంది సుధ.

"అవును. గమనిస్తూనే వున్నాను" అంది గిరిజ.

"మన్నే కాదులే. ఏ ఆడది కనపడ్డా అలాగే చూస్తూ వుంటాడు చూపుల్తో

తినేసేట్టుగా. మన కుట్టు టీచరుందా. ఆవిడకి దాదాపు ఏభై యేళ్ళవరకు వుంటాయా ? ఆవిడనీ అలాగే చూస్తాడు. అదో జబ్బల్లే వుంది" అంది సుధ.

గిరిజ అసంతృప్తిగా మొహం చిట్లించుకుంది.

"అంతేకాదు. ఆయనకి మరో జబ్బుకూడా వుంది" అంది సుధ.

గిరిజ కుతూహలంగా చూసింది.

"ఆడవాళ్ళు దగ్గరగా వస్తే ఏదో ఒక వంకన వాళ్ళని తాకి, బ్రహ్మానందం అనుభవిస్తూ వుంటాడుట ముసలి వెధవ" అంది సుధ ఏహ్యతగా.

గిరిజకి భయం మరింత అధికమయింది.

"ఓసారి ఇలాగే పెన్ను తీసుకునే నెపంతో సీత చెయ్యి పుచ్చుకుని గట్టిగా నొక్కాడట. బలంగా ఒక్క నెట్టు నెట్టిందట చేతితో. పాపం వెళ్ళి పది గజాల అవతల పడ్డాడట. సీత చెప్పింది నాతో." అంది పకపక నవ్వుతూ సుధ.

గిరిజ వెంకటప్పయ్య దరిదాపుల్లోకి వెళ్ళేదికాదు సాధ్యమయినంతవరకు. ఆయన ఏమయినా అడిగినా దూరంనించే సమాధానం చెప్పేది. ఇంత వయసు వచ్చిన పెద్దమనిషి! ఇదేం గుణం అనుకుంటూ విస్తుపోయేది.

"అసలు ఇలాటివాళ్ళని నలుగురు ఆడవాళ్ళు తిరిగేచోట వెయ్యకూడదు సుధా. అందరం కలిసి చెప్తే ఈయన్ని తీసెయ్యరా ?" అంది గిరిజ ఓసారి.

సుధ నవ్వింది. "ఈయన ఇంకా నయం గిరిజా. వుట్టి చూపులతోనే వెదరగొడుతూ వుంటాడు. బయట ప్రపంచంలో వెంకటప్పయ్యని మించిన దుర్మార్గులు ఎందరో వుంటారు. మనం అనుక్షణం మన జాగ్రత్తలో వుండవలసిందే" అంది సుధ.

గిరిజకి రోజులు యాంత్రికంగా గడిచిపోతున్నాయి. నెలలు గడుస్తున్నకొద్దీ సుషమ కొత్త కొత్త ఆటలు, మాటలు నేర్చుకుంటుంది.

## 22

ఎసెంబ్లీ ఎలక్షన్లు జరుగుతున్నాయి రాష్ట్రమంతటా. సత్యన్నారాయణ ఎమ్.ఎల్.ఎ.గా ఆ నియోజకవర్గంనుంచి నిలబడి పోటీ చేస్తున్నాడు. వూరంతా ఎన్నికల సంరంభం, కోలాహలం, సభలు, ఉపన్యాసాలు. నారాయణ తీరుబడిలేకుండా తిరుగుతున్నాడు. కొన్ని వందలమంది సత్యన్నారాయణ తరఫున పనిచేస్తున్నారు. ఎన్నికలు జరగనూ జరిగాయి. ఫలితాలూ తెలిశాయి. సత్యన్నారాయణ చిత్తుగా ఓడిపోయాడు. సత్యన్నారాయణ ఈ ఎన్నికల కోసరమే దాదాపు లక్షా ఏభైవేలు పైగా ఖర్చు

పెట్టాడు. ఫలితాలు తెలిసిన రోజున సత్యన్నారాయణ కూర్చున్న చోటునించి అరగంటదాకా కదల్లేకపోయాట్ట. చుట్టూ చేరిన ఆశ్రితజనం సత్యన్నారాయణకి హార్ట్ ఎటాక్‌గానీ వచ్చిందేమోనని ఖంగారుపడిపోయారట. కానీ చివరికి సత్యన్నారాయణే లేచి అందర్నీ సాగనంపాడట. సానుభూతి చూపబోయినవాళ్ళ మీద కేకలేసి మరీ సాగనంపాడట!

పదేళ్ళ క్రితం సత్యన్నారాయణని అదృష్టలక్ష్మి వరించిన తరువాత కలిగిన మొట్టమొదటి అపజయం ఇది. ఈ షాకుకి సత్యన్నారాయణ తట్టుకోలేడనే చాలా మంది భావించారు. సత్యన్నారాయణ యథాప్రకారం పూలరంగడిలాగా తిరుగుతూంటే ఆశ్చర్యంతో విస్తుపోయినవాళ్ళే ఎక్కువ.

నారాయణకి బాకీలుపెట్టిన ఇద్దరు పెద్దమనుషులు డబ్బుకోసం వత్తిడిచేయ సాగారు. నారాయణ అదుగో ఇదిగో అంటూ వాళ్ళని తిప్పటంతో, ఆ ఇద్దరూ నారాయణ రాసిచ్చిన ప్రోనోటు కాగితాలు పుచ్చుకుని తిన్నగా సుందరయ్య గారిదగ్గరకే వచ్చారు. ఏవిధంగానయినాసరే ఆ బాకీలు చెల్లువేయించమని కోరారు. సుందరయ్యగారు నిమిత్తమాత్రంగా చూస్తూ వూరుకున్నారు. కడుపు చించుకుంటే కాళ్ళమీద పడటమేగదా!

సుందరయ్యగారు మరో ఎకరం పొలం అమ్మి వాళ్ళ బాకీలు తీర్చి పంపిం చేశారు. ఆయనకి నారాయణ ఎప్పటికయినా స్థిరత్వం సంపాదించుకుని ఈ సంసారభారాన్ని భుజాలకి ఎత్తుకోగలడు అన్న నమ్మకం పూర్తిగా పోయింది. వయోభారానికితోడు మానసికమయిన దిగులు క్రుంగదీయసాగింది. జీవితంలో అన్నివిధాలా ఓడిపోయిన వ్యక్తిలాగా రోజులు లెక్కపెడుతున్నట్టుగా కాలం గడపసాగారు.

పార్వతమ్మగారి ఆరోగ్యం అంతంతమాత్రంగానే వుంది. మందులు లేకుండా ఆవిడకి రోజు జరగదు. నారాయణ దిగులుతో బాటుగా శారద జీవితం ఎలా గడవనున్నదో అని మరో వ్యధ.

సుషమ పనులన్నీ పూర్తిచేసి ఇంట్లో శారదకి సహాయంగా వుంటూ ఉద్యో గానికి పరిగెత్తే గిరిజని చూస్తే ఇద్దరికీ చెప్పలేని దిగులు, జాలి.

"మీరు చెప్పింది నిజమేనండీ. ఆనాడు మీ మాట వినకుండా పెళ్ళిచేస్తే నన్నా దారిలో పడతాడని నిక్షేపంలాటి పిల్లని తీసుకొచ్చి వీడికి అంటగట్టాం. ఆ పిల్ల మొహాన ఏం రాసుందో తలుచుకుంటే గుండెలు పగిలిపోతున్నాయి" అంటూ దుఃఖపడతారు పార్వతమ్మగారు.

"అంతా ఖర్మ పార్వతీ. నీకు బుద్ధిలేదనుకో! నా బుద్ధిమాత్రం ఏమయి పోయిందని? ఆ పెళ్ళికి నేను ఒప్పుకోకుండావుంటే ఈ రోజు ఆ పిల్లకి యిన్ని కష్టాలే వుండేవి కావుగదా" అంటూ తనని తనే నిందించుకుంటారాయన.

## 23

నారాయణ ఆ రోజు చాలా హుషారుగా వచ్చాడు ఇంటికి. ఏనాడూ పోగొట్టుకోవటం తప్ప పొందలేని నారాయణ దురదృష్టం ఎదురు తిరిగినట్టుంది. మూడు వందలు గెల్చుకుని వచ్చాడు. జేబులోవున్న ఆ నోట్లు మనసుకి ఎంతో బలాన్ని, హుషారుని ఇస్తున్నాయి. సుషమకి మంచి గౌను కొన్నాడు. గిరిజకి గులాబి రంగు జార్జెట్ చీర కొన్నాడు. గోపికి, రమకి బొమ్మలు, పూలు, జిలేబీలు కొని హుషారుగా ఇంటికి వచ్చాడు.

గదిలో సుషమని ఆడిస్తోంది గిరిజ. నారాయణ ఆ పేకెట్లన్నీ గిరిజ ఎదురుగా పెట్టి అటు తిరిగి షర్టుమార్చుకోసాగాడు. అయినా ఓరకంటితో గిరిజని చూస్తూనే వున్నాడు.

గిరిజ ఓసారి నారాయణవైపు, పేకెట్లవైపు మార్చి మార్చి చూసి తనకేం పట్టనట్టుగా సుషమతో కబుర్లు చెప్పటంలో మునిగిపోయింది. నారాయణకి కోపం తన్నుకొచ్చింది

"సుషమా" అంటూ కూతుర్ని చేతుల్లోకి తీసుకున్నాడు. తండ్రి పిలుపు వినగానే సుషమ కేరింతలు కొడుతూ మీదకి దూకింది. నారాయణ కూతుర్ని వొళ్ళో కూచోపెట్టుకుని పేకెట్ తెరిచి కొత్తగౌనుతీసి సుషమకి తొడగసాగాడు. అప్పటికీ గిరిజ ఏమీ మాట్లాడలేదు. చేతిలోవున్న పుస్తకాన్ని తిప్పుతూ కూర్చుంది. నారాయణకి చిర్రెత్తు కొచ్చింది.

"సుషమా నీ గౌను అమ్మకి చూపించు" అంటూ సుషమని గిరిజ వొళ్ళో కూర్చోపెట్టాడు.

గిరిజ సుషమని కింద కూర్చోపెడుతూ 'భోజనానికి రండి' అంటూ లేచి లోపలికి వెళ్ళబోయింది.

నారాయణకి గిరిజ చెంప పగలగొట్టాలన్నంత కోపం వచ్చింది.

'ఇలారా' అన్నాడు. గిరిజ వచ్చి ఎదురుగా నిలబడి కళ్ళతోనే ఏమిటి అన్నట్టుగా చూసింది.

నారాయణ చీరవున్న పేకెట్ తీసి గిరిజ చేతికి ఇస్తూ "నీకు రంగు నచ్చిందేమో చూడు" అన్నాడు.




గిరిజ చీర బయటికితీసి ఓసారి చూసి పేకెట్‌లోపెట్టి పేకెట్‌ని మంచంమీద వుంచింది.

'బావుందా?' అన్నాడు గిరిజ మొహాన్నిచూస్తూ.

'బావుంది' అంది.

నారాయణకి మితిమీరిన కోపంతో ఏంచెయ్యాలో పాలుపోలేదు. గిరిజతో ఏదోవిధంగా పోట్లాట పెట్టుకుని తిట్టి కసి తీర్చుకోవాలని వుంది. కానీ గిరిజ అందుకు సందీయటంలేదు.

"ఇదుగో ఇందులో జిలేబీలు వున్నాయి. నీకు ఇష్టంకదూ" అన్నాడు గొంతులోకి మార్దవం తెచ్చుకుంటూ.

గిరిజ తలెత్తి చూడకుండానే సుషమకి నారాయణ తొడిగిన గౌను విప్పి, మామూలుగౌను తొడగసాగింది.

నారాయణకి వొళ్ళంతా కారం రాచుకున్నట్టయింది. అయినా తమాయించుకుంటూ "ఇవిగో ఇవి గోపీకి, రమకి ఇవ్వు" అంటూ రెండు పేకెట్లు అందించాడు.

గిరిజ వాటిని ఓ చేత్తో అందుకుని రెండోచేత్తో మంచంమీద పెట్టింది. కనీసం వాటివయిపు తిరిగయినా చూడలేదు. నారాయణకి ఈ ముఖభావం,

నిర్లక్ష్యం భరింప శక్యంకావలేదు. ఒక్కసారిగా మండిపడ్డాడు. "అసలు నేను ఇంటికి రావటం నీకు ఇష్టంలేదన్నట్లేవుందే" అన్నాడు.

గిరిజ ఆశ్చర్యంగా చూసింది. "మీ యింటికి మిమ్మల్ని రావద్దనటానికి నేనెవర్ని" అంది.

"అంటే ఇది నేను,నాయిల్లు తప్ప నువ్వు నాకేమీ అవ్వవన్నమాట! అంతేనా?" పేకెట్లని దూరంగా ఎగరకొడుతూ అన్నాడు.

"అరే, మీకు ఇంకా ఆ సంగతి గుర్తుందన్నమాట!" ఆశ్చర్యంగా అంటున్న గిరిజ చేతిని పుచ్చుకుని గుంజి ఎదురుగా వచ్చి నిలబడి "అంటే నీ ఉద్దేశ్యం?" రౌద్రంగా పళ్ళుబిగబట్టి అన్నాడు.

"అంటే మీకొక ఇల్లు, భార్య పిల్లలు, తల్లి దండ్రి వున్నారని..."

గిరిజ మాటలు పూర్తి కాకుండానే ఛెళ్ళున చెంపమీద కొట్టాడు.

"అంటే నేను బాధ్యతలేకుండా తిరుగుతున్నాననేగా అర్థం?"

గిరిజ చెంపపట్టుకునే నారాయణవైపు చూసి మెల్లగా నవ్వింది. ఒక్కసారిగా నారాయణ కోపం అంతా చల్లబడిపోయింది. నారాయణ ఆ చూపుని ఎదుర్కోలేదు.

"మీ కోసం నేను ఇన్ని కొని తీసుకువస్తే ఒక్క మంచిమాట మాట్లాడవేం?" పశ్చాత్తాపాన్ని కనబడనీయకుండా విసుగ్గా అన్నాడు.

"ఇది పేకాటలో గెల్చిన డబ్బా లేకపోతే రేసుల్లోనా?" ఇంతసేపటికి గిరిజ నోటినుంచి వచ్చిన మాటలు కొరడాదెబ్బల్లాగా తగిలాయి నారాయణకి.

చల్లబడుతున్న ఆవేశం మళ్ళీ పొంగుకొచ్చింది.

"ఏం. అదయితే డబ్బుకాదా?" మీద మీదకి వస్తూ అడిగాడు కోపంగా.

"ఏమీలేదు. ఆ డబ్బుని నమ్ముకుని మాకిలాటివి అలవాటుచేస్తే మీకే నష్టం అని" గిరిజ విసిరిన మాటల్లోని అర్థం బోధపడి తిరి, చూసేసరికి గిరిజ అక్కడలేదు. సుషమని ఎత్తుకుని వంటగదిలోకి వెళ్ళిపోయింది.

నారాయణ శరీరంలోని సత్తువంతా ఎవరో లాగిపారేసినట్టుగా మంచంమీద చేరబడి కళ్ళుమూసుకున్నాడు.

## 24

వసుంధరాదేవి అసహనంగా,కాలుగాలిన పిల్లిలా ఇల్లంతా తిరుగుతోంది.ఆవిడ అన్నగారు రాజ్యానికి వేరే సంబంధాలు చూస్తున్నాడన్న వార్త ఆవిడకి తెలియ వచ్చింది. కోపంతో ఉక్కిరిబిక్కిరయింది. యువరాజులాటి తన కొడుకు

ఎదురుగా వుండగా, మేనల్లుడన్న రక్తసంబంధంకూడా లేకుండా అన్నగారు కూతురికి వేరేసంబంధాలు చూడటం ఆవిడకి చెప్పలేనంత అవమానంగావుంది. రాజ్యంతోబాటుగా ఆ పిల్లవెనక రాబోయే ఆస్తిమీద చెప్పలేనంత ఆశా, మోజూ వున్నాయి. అన్నీ బాగానే వున్నాయి కానీ ఈ చలపతి వెధవ ఇన్నాళ్ళుగా ఏం పీడుస్తున్నట్టు. వేలకి వేలు పట్టుకుపోయి రాజ్యంవాళ్ళింటికి అంటూ వారానికో సారి పరిగెడుతూ వుంటాడుగదా! ఒక్క ఆడపిల్ల మనసుని గెల్చుకోలేక పోయాడా? ఛీ ఛీ తన కడుపున ఇంత చాతకాని వెధవ పుడతాడని ఆవిడ ఏనాడూ ఊహించలేదు.

"నేనోసారి మా అన్నయ్య వాళ్ళింటికి వెళ్ళొస్తాను" అన్న భార్యని రాజేశ్వర్రావు ఆశ్చర్యంగా చూశాడు.

"అదేం! హఠాత్తుగా అన్నగారిమీద బెంగపెట్టుకున్నావా?" అన్నాడు. ఆవిడ అసలుకారణాన్ని ఆయనకి చెప్పదల్చుకోలేదు. చలపతి అంటే భర్తకి ఏమాత్రం సదభిప్రాయం లేదని ఆవిడకి తెలుసు.

భర్త తనని, కొడుకుని హేళనగా ఏదయినా అంటే ఆవిడ భరించలేదు. అందుకే తను చలపతి పెళ్ళి గురించి ఏదో ఒకటి అన్నగారితో తేల్చుకునేవరకు భర్తతో చెప్పకూడదని నిశ్చయించుకుంది.

రాజేశ్వర్రావు ఆవిడ అడిగినంత డబ్బు ఇచ్చాడు. వసుంధరాదేవి అన్నగారింటికి వచ్చింది. నరసింహంగారు చెల్లెల్నిచూసి సంతోషించాడు.

"ఏవిటమ్మా వసుంధరా? అంతా బాగున్నారా? చలపతి రాలేదా?" అన్నారు.

"చలపతి ఇక్కడికే వచ్చాడుగా అన్నయ్యా? ఇంట్లో బయలుదేరి నాలుగు రోజులయిందే" అంది వసుంధర ఆశ్చర్యంగా.

నరసింహంగారు నవ్వారు. "వాడికి పెద్దస్నేహాలెన్నో వున్నాయమ్మా. ఇక్కడికి ఎందుకు వస్తాడు?" అన్నారు.

వసుంధర మనసు చివుక్కుమంది.

సావకాశం చూసుకుని వసుంధర రాజ్యం పెళ్ళివిషయం కదిపింది.

"రాజ్యం పెళ్ళివిషయం ఏం ఆలోచిస్తున్నావన్నయ్యా?" అంది.

"అదేనమ్మా, నేనూ ఆ ప్రయత్నంలోనే వున్నాను. రెండు మూడు సంబంధాలు దృష్టిలో వున్నాయి. దానికి ఈ యేటితో కాలేజీ చదువు అయిపోతుంది. ఏదో ఒకటి సెటిల్ చేసేద్దామనేవుంది" అన్నారాయన నిర్మొహమాటంగా.

తనామాట ఎత్తినప్పుడుకూడా చలపతి ఆయన దృష్టిలోకి రానందుకు వసుంధరకి కోపం, అవమానం ముంచుకొచ్చాయి. అవసరం తనది కనుక కోపాన్ని నిగ్రహించుకుంది.

"చలపతికికూడా ఈ యేడు పెళ్ళి చేసేద్దాం అనుకుంటున్నాం అన్నయ్యా" అంది వసుంధర.

"వాడికా? అప్పుడే తొందరేవిటమ్మా. అయినా వాడి పద్ధతీ అదీ నాకేం నచ్చటంలేదమ్మా వసూ. బావగారు గట్టిగా కేకలువేసి వాడిని కాస్త కుదురు నేర్చుకునేట్టుగా చెయ్యరెందుకని?" అన్నారాయన.

ఈ సంభాషణ అంతా రాజ్యం వింటూనే వుంది.

"అత్తయ్యా, అసలు బావ ఎప్పుడుచూసినా ఆ రేస్‌కోర్సు దగ్గరే వుంటూ వుంటాడు. నలుగురు ఫ్రెండ్సుని వెంటేసుకొచ్చి హోటల్ అగస్త్యాలో దిగుతాట్ట. ఐలే జల్సాచేస్తాట్ట. నాన్నగారు మొన్నోరోజున బావని బాగా కేకలేసారు. నీకు ఉత్తరం రాస్తాననికూడా బెదిరించారు. వద్దంటూ బతిమిలాడుకున్నాడు" అంది రాజ్యం.

వసుంధరాదేవికి తను కొడుకుచుట్టూ నిర్మించుకున్న ఒకొక్కసౌధమే కూలిపోతున్నట్టుగా గాబరాగావుంది. ఆ తండ్రీ కూతుళ్ళ మనసుల్లో కంచు కాగడావేసి వెతికినా చలపతి అంటే కించిత్తు సదభిప్రాయం వున్నట్టుగాలేదు. పైగా కొడుకుని గురించి తనకి తెలియని ఎన్నో నిజాలు వినటానికి చేదుగా వున్నాయి ఆవిడకి. కొడుకుమీద కోపం ఉవ్వెత్తున ముంచుకొస్తోంది. అయినా ఆవిడ తన ప్రయత్నం విరమించకుండా అంది.

"మేమూ అదే అనుకుంటున్నాం అన్నయ్యా. ఆ మూడుముళ్లూ పడితేగానీ వాడికి కుదురు కలిగేట్టుగా లేదు. మీ బావగారుకూడా అదే అన్నారు రాజ్యానికి చలపతికి ఈడూజోడు బాగుంటుందని." చిట్టచివరికి ఆవిడ మనసులోనిమాట బయటపెట్టేసింది.

"మాకుమాత్రం వాడొక్కడేగదా. ఉన్నదంతా వాడికేనయ్యో."

ఈ మాటలకి నరసింహంగారయితే వెంటనే జవాబు చెప్పలేదుగానీ రాజ్యం టక్కున సమాధానం చెప్పేసింది.

"చలపతికా ? నేనా ? పెళ్ళా ?" ఏదో వింత విషయాన్ని వింటున్నట్టుగా ఆశ్చర్యపోయింది.

వసుంధరాదేవికి కోపం నిగ్రహించుకోవటం అసంభవం అయింది.

"ఏమే ? వాడికేమయింది?" ఇలా అన్నవాళ్ళే రేపు ఒకళ్ళని విడిచి ఒకళ్ళు క్షణంకూడా వుండరు." అందావిడ.

"ఆ విషయాలన్నీ నాకు తెలియవ్వగానీ, నేనుమాత్రం చలపతిని చేసుకోవటం అసంభవం" అంటూ తెగేసి చెప్పింది రాజ్యం.

"ఆ, ఎందుకని?"

"నేను డాక్టరు వృత్తిలో వున్నవాళ్ళని పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను అత్తయ్యా. నాకాప్రొఫెషన్ అంటే ఎంతోఇష్టం. నేనెలాగూ డాక్టర్ని కాలేక పోయాను. కనీసం ఓ గొప్ప డాక్టర్నయినా పెళ్ళిచేసుకోవాలనుంది'' అంది రాజ్యం.

వసుధరాదేవికి మొట్టమొదటిసారిగా రాజ్యంమీద, ఆ పిల్ల అలా తన అభిప్రాయాన్ని జంకూగొంకూ లేకుండా తెగేసి చెప్పేంతటిస్వేచ్ఛా స్వాతంత్ర్యాల నిచ్చి పెంచిన అన్నగారిమీద, చలపతి మాయమాటల్లో చిక్కుకుపోయిన తన అసమర్థతమీద, తనని మొదటినుంచీ హెచ్చరిస్తూ వచ్చిన భర్త తెలివితేటల మీద-ఒకటనేమిటి ఈ ప్రపంచంలో వున్న చరాచర వస్తుజాలం అంతటిమీద అంతులేని కోపం, కసి, కలిగినాయి.

నరసింహంగారికి తన నోటితో లేదు అని చెప్పకుండా ఆదుకున్న కూతురి మీద మరింత వాత్సల్యం ఉప్పొంగింది.

"అదమ్మా వసూ దానిఅభిప్రాయం.ఈరోజుల్లో వయసొచ్చి అన్నీఆలోచించ గలిగిన పిల్లలకి వ్యతిరేకంగా మనం చెయ్యగలిగిందేముంది? రమణయ్యగారి రెండోవాడు శ్రీనివాసు గుర్తుందా? ఆ కుర్రాడు కార్డియాలజీలో స్పెషలైజ్ చేశాట్ట. వచ్చేనెలలో ఇండియా తిరిగి వస్తున్నాట్ట. రాగానే రాజ్యాన్ని చూసుకోవటానికి రమ్మని చెప్పొచ్చాను వాళ్ళకి" అన్నారాయన.

వసుంధరకి ఇంక ఒక్కక్షణం అక్కడ వుండాలనిపించలేదు. తిరుగు బండికి ఇంటికి చేరుకుంది. ఇప్పుడు ఆవిడకోపం అంతా కొడుకుమీద కేంద్రీకరించబడింది. చలపతికళ్ళబడగానే ఎడా, పెడా రెండు లెంపలు వాయించా లన్నంత ఆవేశంగా వుంది. చలపతి నాటకాల్ని కట్టుజేసే ఆయుధం ఆవిడ చేతిలోనే వుంది.

చరచరా రాజేశ్వర్రావు వున్న గదిలోకి వెళ్ళింది."ఇదిగో ఇప్పుడే చెప్తున్నా. ఈ రోజునుంచి నాకు తెలియకుండా చలంగాడికి ఒక్క కానీ అయినా దక్కనిచ్చావో, నేనసలు మంచిదాన్నిగాదు. గుర్తుపెట్టుకోండి" అంది రంకె లేస్తున్నట్టుగా

ఉరుము లేని పిడుగులా వినవచ్చిన ఆ మాటల్ని, భార్య కోపాన్ని చూసి రాజేశ్వర్రావుగారు విస్తుపోయి తేరుకునే లోపలే ఆవిడ ఆ గదిలోంచి వెళ్ళిపోయింది. అప్పుడే ఇంటికి చేరుకున్న చలపతి రౌద్రమూర్తిలావున్న తల్లి జారీచేసిన ఆర్డరు విని గుండెలాగిపోయినట్టుగా నిలబడిపోయాడు "ఏమిటి మమ్మీ అంత కోపంగా వున్నావు? ఏం జరిగింది" అంటూ తల్లిని ప్రసన్నురాలిని చేసుకో వాలని ప్రయత్నిస్తున్న కొడుకుని ఒక్క చూపులోనే అంత దూరాన నిలబెట్టే సింది వసుంధరాదేవి!

"ఏం జరిగిందని అడుగుతున్నావా? చేతకాని వాజమ్మా. ఒక్క ఆడపిల్ల మనసుని ఆకట్టుకోలేకపోయావు. పైగా నాటకాలాడతావా నాదగ్గిర" అంటున్న తల్లిని చూసి చలపతి నీరుకారిపోయాడు. ఇంక ఆ యింట్లో తనకి పైసాదబ్బనేది కూడా దొరకదన్నది రూఢి అయిపోయింది చలపతికి దిగాలుపడి కూర్చుండి పోయాడు 'కిం కర్తవ్యం' అనుకుంటూ.

## 25

ఒకానొకరోజు సత్యన్నారాయణ అదృష్టవార్త వూరంతా ఎలా గప్పుమందో, సరిగా పదేళ్ళ తరువాత అలాగే మరో వార్త వూరంతా క్షణాల్లో వ్యాపించింది. సత్యన్నారాయణ దివాళాతీశాడట! ఏ ఇద్దరు కలిసినా ఇదే విషయం. ఏ షాపులో చూసినా, ఏ బజార్లలో చూసినా ఇదే చర్చ!

సత్యన్నారాయణ టింబరు డిపో అప్పుకింద బావమరది కొట్టేసుకున్నాడట! 'సత్యన్నారాయణ సిల్కు ప్యాలెస్' మీద పెట్టుబడికి మించిన అప్పుందిట. గజలక్ష్మీసదన్ ఏనాడో తనఖాలోకి వెళ్ళిపోయిందిట! ఇలాటి పరిస్థితుల్లో ఐ. పి. దాఖలు చేస్తే మంచిదని పెద్దలు సలహా చెబుతున్నారట సత్యన్నారాయణకి.

"నేనారోజే అనుకున్నా లేవయ్యా. ఎలా వచ్చిన ధనలక్ష్మి అలాగే పోయింది" అన్నారొకరు.

"మరి అంత మిడిసిపాటుటయ్యా. ఎలక్షన్లలోనే పోగొట్టుకున్నాడు గాదుటయ్యా సగం ఆస్థి" అంటూ మరొకరు.

"ఈ వ్యసనాలున్న వాళ్ళకి లక్షలు గాదు కోట్లున్నా చివరికి ఇదేగతి పడుతుందండీ అది రూలే" అన్నారింకొకరూ.

"ఏం వెలుగు వెలిగాడయ్యా పదేళ్లు. ఆ తల్లి గోలపెడుతూనే వుండేదయ్యా వున్నది జాగ్రత్తచేసుకోమని. ఈ సత్తెంగాడు వింటేనా?"

"అదంతేనండి. గాలివాలుగా వొచ్చిన అదృష్టం, గాలివాలుకే ఎగిరి పోయింది."

సత్యన్నారాయణ అదృష్ట, దురదృష్టాలమీద కామెంటు చెయ్యని మనిషి లేడు ఆ వూరిలో.

ఒకవిధంగా నారాయణ జీవితాన్ని ప్రేరేపించినవాడు పరోక్షంగా సత్యన్నారాయణే! అతన్ని హఠాత్తుగా వరించిన అదృష్టం నారాయణ కలలో ఆలంబనం అయింది. సత్యన్నారాయణ నడిచిన దారిని అనుసరించాలని ప్రయత్నించి అడుగడుగునా ఎదురుదెబ్బలే తిన్నాడు. జీవితంలో ఎంతో ముఖ్యమైన సమయాన్ని అదృష్టదేవత వేటలో ఖర్చుచేశాడు. ఆ సమయంలో ఎవరేది చెప్పినా నారాయణకి చెవికెక్కలేదు. తలలో దూరలేదు. అవన్నీ పెద్దలు చెప్పే చాదస్త్రాలుగా కొట్టిపారేశాడు గడ్డిపోచకింద తీసిపారేశాడు. ఈనాడు నారాయణ కావాలన్నా ఉద్యోగం ఇచ్చే నాధుడులేడు. కొన్ని ఉద్యోగాలకి వయసు మీరిపోయింది, మరికొన్ని అందని మాని పండ్లు. మరికొన్నిటికి అనుభవం చాల్లేదు. అంచెలంచెలుగా పైకి పాకి ఒక్కసారిగా కిందికి జారిపోయిన సత్యన్నారాయణ జీవితం నారాయణకి కనువిప్పులాగానే వుంది.

సత్యన్నారాయణ కిప్పుడు కార్లులేవు. ఆశ్రితజనాలు, వందిమాగధ బృందాలు లేవు, సిల్కుప్యాలెస్‌లు, టింబరు డిపోలు లేవు. చివరికి మిగిలింది తాళ్ళకొట్టు మాత్రమే. పిచ్చయ్య కూర్చునే స్థానంలో సత్యన్నారాయణ కూర్చుంటున్నాడు. సత్యన్నారాయణ భార్య కొడుకుని తీసుకుని అన్నగారింటికి వెళ్ళిందిట. తల్లి తండ్రులిద్దరూ సత్యన్నారాయణ దురదృష్టాన్ని చూడకుండానే పైలోకాలకి వెళ్ళిపోయారు. చివరికి మిగిలింది పాత పెంకుటిల్లు, తాళ్ళకొట్టు. అవయినా పిచ్చయ్య పేరున రాయబట్టి.

సత్యన్నారాయణ తనకి ఆరులక్షలు వచ్చినాయన్న రోజున ఎలావున్నాడో ఇప్పుడూ అలాగే వున్నాడు. మనిషిలో వున్నదంతా పోయిందే అన్న దుఃఖం, దిగులు లేవు. పైగా జీవితాన్ని సంపూర్తిగా అనుభవించి అందులోని లోతు పాతులన్నీ తెలిసిన పెద్దమనిషిలాగా సంతృప్తిగా, నిండుగా వున్నాడు

నారాయణ తాళ్ళకొట్లో కూర్చున్న సత్యన్నారాయణ దగ్గరికి వచ్చాడు. సత్యన్నారాయణని చూసి ఆశ్చర్యపోయాడు. ఏవో ఓదార్పు మాటలు, సానుభూతి పదాలు వల్లెవెయ్యటం తనకే సిగ్గనిపించింది నారాయణకి.

సత్యన్నారాయణ నారాయణని ఎప్పటిలానే ఆహ్వానించాడు చిరునవ్వుతో. 'బా బ్బా బాగున్నావా న్నా న్నా నారాయణ?' అంటూ పలకరించాడు.

"ఏ ఏ ఏంటలా చూస్తున్నావు? గీ గీ గీతలో ఏం చె చె చెప్పారు? క క కష్టం సు సు సుఖం అన్నీ ఆడికే" అంటూ చేతులు పైకి పెట్టి నమస్కారం చేశాడు. నారాయణకి నవ్వొచ్చింది.

'సత్యంగారూ, నాకేదయినా ఉద్యోగం చూపెట్టండి' అన్నాడు మెల్లగా. సత్యన్నారాయణ నవ్వి నారాయణ భుజంమీద తట్టి చేతిలో బిటాణీలు పోశాడు.

## 26

మానవ మనస్తత్వం అతి విచిత్రమయింది. నయానో, భయానో, హితోక్తులతోనో మార్చాలని ఎంత ప్రయత్నించినా మారని మనసు, మీట నొక్కినట్లుగా ఏ చిన్న సంఘటనతోనో మార్పు దానంతట అదే వస్తుంది. సత్యన్నారాయణ జీవితం నారాయణమీద అలాటి ప్రభావాన్నే చూపించింది. పైగా నారాయణకి గిరిజని ఎదుర్కొనటం పెద్ద సమస్యగా వుంది. గిరిజ తన చుట్టూ నిర్మించుకున్న పరిధిలోకి నారాయణ ప్రవేశించ లేకుండా వున్నాడు. సూటిగా, గుండెల్ని తాకుతున్నట్టుగా చూసే ఆ చూపులు నారాయణ అడుగు ముందుకి పడనివ్వవు. ఆ చూపులకి నారాయణ తల వొంగిపోతుంది ఎన్నో చెప్పాలనుకున్న నారాయణ మాటలు గిరిజ ముఖం చూసి నోటిలోనే ఆగిపోతాయి. ఆ నిర్లిప్తత గజం దూరంలో నిలబెడుతూ వుంటుంది. అంతకంటె గిరిజ నోరుతెరిచి తిట్టి, పోట్లాడి నానా రభస చేసినా బాగుండును అనుకుంటాడు.

నారాయణ పట్ల గిరిజ ప్రవర్తన ఎప్పటిలానే వుంది. శ్రద్ధగా, సమయానికి నారాయణ అవసరాలన్నీ గమనించి సమకూరుస్తుంది. అయినా గిరిజ చుట్టూ ఏదో మాయతెర కమ్ముకున్నట్టుగా నారాయణ అంత దూరంలోనే ఆగిపోతాడు. అది తన మనసులోని పొరేనని అర్థంచేసుకోలేదు.

క్లబ్బుకి వెళ్ళినా మనసుపెట్టి ఆడలేకపోతున్నాడు. తనకి తెలియకుండానే చలపతికి దూరంగా జరిగిపోతున్నాడు. ఏ పని చేస్తున్నా మనసులో ఏదో ఆందోళన, అశాంతి. ఏదో చెయ్యాలన్న ఆరాటం మనిషిని నిలవనీయటంలేదు. తనని చుట్టుకున్న బాధ్యతలు నెరవేర్చలేని ప్రతివ్యక్తి పడే ఆరాటమే నారాయణదీను. తెలిసినవాళ్ళని ఉద్యోగంకోసరం ప్రాధేయపడుతున్నాడు. ఆశ వుందనిపించిన చోటికల్లా పదిమార్లు తిరుగుతున్నాడు. తన కాళ్ళమీద తను నిలబడగలిగినప్పుడే ఈ సమస్యలన్నిటికీ పరిష్కారం అన్న సత్యాన్ని ఆలస్యంగానయినా గ్రహించగలిగాడు నారాయణ.

* * * *




చలపతి పరిస్థితి చెరువులోంచి బయటపడిన చేపలాగా వుంది. ఇంతకాలం కొండంత అండగావున్న తల్లి శత్రుపక్షంలో జేరిపోవటంతో చలపతి పని ఇరకాటంలో పడింది. రెండుచేతులా ఖర్చుపెట్టటానికి అలవాటుపడిన చలపతి రూపాయి డబ్బుల కోసరం వెతుక్కోవటం నరక సదృశంగా వుంది. వూపిరి అందనట్లు గిలగిల్లాడి పోతున్నాడు. కాలు గాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. ఆరు నెలలుగా క్లబ్బు బిల్లులన్నీ బాకీపెడుతూ వచ్చాడు.

ఓ శుభ ముహూర్తాన క్లబ్బు మేనేజరు అతి మర్యాదగా ఆ బిల్లులన్నీ చలపతి ముందు పెట్టి, మీరింక మర్యాదగా అవి చెల్లించిన తరువాతే క్లబ్బుకొస్తే మంచిదని సూచించాడు.

చలపతి అవమానంతో దహించుకుపోయాడు ఆవేశంతో కసిగా సిగరెట్టు కాల్చుదామన్న జేబులు ఖాళీగా వున్నాయి. వాడుకగా సిగరెట్టుకొనే బడ్డీ దగ్గరికి వచ్చి సిగరెట్ పాకెట్‌కి ఆర్డరిచ్చాడు.

'మీ బ్రాండు లేవుసార్' అన్నాడు బడ్డీకొట్టువాడు, వున్నాయో లేవో చూడకుండానే. అలమార్లో వెనకాల వున్నాయని చలపతికీ తెలుసు. వాడికీ తెలుసు. వాడుకూడా తనకి మరింక అరువు పెట్టడని రూఢి అయింది.

'సార్ మీ ఖాతా వందరూపాయలు దాటిపోయింది సార్' అంటూ చేతులు నులుముకోసాగాడు బడ్డీకొట్టువాడు.

'అలాగే రేపిస్తాను' అన్నాడు చలపతి.

వాడితో ఘర్షణపడి తన పరువు మరింత బజారుపాలు చేసుకోవటం తనకే నష్టం అని గ్రహించాడు.

చలపతికి మరింక డబ్బు పుట్టే మార్గం కనిపించటంలేదు. తెలిసిన స్నేహితులందరి దగ్గరా చెయ్యగలిగినంత వరకూ అప్పు తీసుకున్నాడు. రెండు చేతులా ఖర్చుపెట్టే చలపతి అడగగానే వెంటనే చేబదుళ్ళిచ్చిన స్నేహితులే, రోజులు గడుస్తున్న కొలది చలపతి పరిస్థితి అర్థం అవసాగింది. ఒక్కొక్కరే చలపతిని తప్పించుకుని తిరగసాగారు. చలపతి కోపంతో పళ్ళు నూరుకోవడం తప్ప మరేమీ చెయ్యలేకపోయాడు.

చలపతికి ఒక్కటే మార్గం మిగిలింది. తల్లి కాళ్ళు పుచ్చుకుని క్షమించ మనటం ఒక్కటే దారి.

"మమ్మీ ! ఒక్క వెయ్యి రూపాయలు కావాలి మమ్మీ లేకపోతే నా పరువు నిలవదు" అంటూ ప్రాధేయపడ్డాడు.

"నీకో పరువు అంటూ వుంటే గదురా పోయేందుకు" అంది తల్లి. చలపతికి కోపం చర్రున దూసుకొచ్చింది.

"నలుగురిలో నాకు అవమానం జరిగితే మీకు జరిగినట్టు గాదా ?" అంటూ సవాల్ చేశాడు.

"ఎందుక్కాదురా ! ఇప్పుడు జరిగింది అదేగదా. రేపు ఆరోతారీఖున రాజ్యం పెళ్ళట," అంది కోపంగా వసుంధరాదేవి.

"రాజ్యం కాకపోతే మరో భోజ్యం. దేశంలో ఆడపిల్లలే కరువయినట్టుగా బాధపడతావేమిటి మమ్మీ ?" అన్నాడు చిరాగ్గా.

"ఆడపిల్లలకేం లోటురా. దేశంనిండా వాళ్ళే కాని వాళ్ళందరి వెనకా రాజ్యానికున్న సిరి సంపదలు వుండవురా నాయనా" అంది వ్యంగ్యంగా.

"ఇంతకీ ఇస్తావా ? ఇవ్వవా ?" అన్నాడు చలపతి.

"ఎందుకు ఇవ్వను. పద నాన్నగారితో చెప్పి ఇప్పిస్తాను" అంటూ కొడుకుని రాజేశ్వర్రావు దగ్గరకి తీసుకొచ్చింది.

"చలానికి వెయ్యి రూపాయలు కావాలట ఇస్తారా ?" అంది.

ఆయన ఓ క్షణం కొడుకుని పరిశీలించి "ఓ ఎందుకివ్వను !" అన్నాడు.

చలపతి మొహం లక్ష దళ పద్మంలాగా వికసించింది.

"కానీ ఓ షరతుమీద మాత్రమే" అన్నాడాయన.

చలపతి ఆత్రంగా విన్నాడు.

"రేపటినుంచి నువు మిల్లులో పనిచెయ్యాలి," అన్నాడు.

"ఓ."

"అదీ కూలిపనితో ప్రారంభించాలి. ఒక్కొక్క విభాగంలో ఒక్కొక్క నెలపాటు మిగిలినవాళ్ళతో పాటుగా పనిచెయ్యాలి. వాళ్ళకి ఎంత జీతం గిట్టుబాటు అవుతుందో నీకూ అంతే దొరుకుతుంది. మన మిల్లులో కూలీలకి రోజుకి ఆరు రూపాయలు ఇస్తున్నాం. ఇదుగో ఆరు రూపాయలు. ఇవాళనించి పని ప్రారంభించు" అంటూ ఆయన ఆరు రూపాయల్ని చలపతి ముందుకి గిరాటు వేశాడు.

చలపతి నోట మాట రానట్టుగా నిలబడిపోయాడు. బేలగా తల్లివైపు చూశాడు సహాయం కోసరం అన్నట్టుగా. ఆవిడ తల తిప్పుకొని లోపలికి వెళ్ళిపోయింది. చలపతికి కోపం కట్టలు తెంచుకుని ప్రవహించింది. గిర్రున వెనక్కి తిరిగి బయటికి వెళ్ళిపోయాడు.

## 27

మహిళామండలి వార్షికోత్సవం ఘనంగా జరుపుతున్నారు. కుట్లు, అల్లికలు, పెయింటింగ్స్ వున్న ప్రదర్శనం కనుల పండువుగా వుంది. మండలిమెంబర్సు అందరూకలిసి హాస్యనాటకాన్ని ప్రదర్శించబోతున్నారు. భరతనాట్య ప్రదర్శన వుంది మండలి స్కూలులోని చిన్నపిల్లల పాటలు, డాన్సులు వున్నాయి. మరింకెన్నో రకరకాల ఆకర్షణలున్నాయి.

గిరిజకి నెలరోజులుగా తీరిక వుంటడంలేదు. చిన్నపిల్లలకి పాటలు, డాన్సులు నేర్పించే బాధ్యత గిరిజ, సుధలది.

ఆ రోజే వార్షికోత్సవం. మండలి ఆవరణ కన్నుల పండువగా లైట్లతో, తోరణాలతో అలంకరించారు. స్టేజీ ఏర్పాటయింది. ఆవరణ అంతా కుర్చీలతో నిండిపోయింది. కలెక్టరుగారి సతీమణి అధ్యక్షత వహిస్తోంది. కార్యక్రమం ప్రారంభమయింది.

రెండో అయిటంగా పిల్లల డాన్సు. స్టేజిమీద చిన్న చిన్న పిల్లలందరినీ సర్ది వరసగా నిలబెట్టి గిరిజ, సుధ పక్కకి తప్పుకున్నారు. తెర తీయబడింది. పిల్లలు ఏదో ఇంగ్లీషు పాటకి అనుగుణంగా డాన్సు చేస్తున్నారు. ఒకే రకం

దుస్తుల్లో, ఒకే రకం అలంకరణలో ముద్దగులా బీల్లా వున్న పిల్లలు, పాటకి చేసే అభినయం చూడముచ్చటగా వుంది. సుధ, గిరిజ కర్టెన్ల చాటున నిలబడి పిల్లల్ని గమనిస్తున్నారు.

పిల్లలు ముచ్చటగా ఆడుతుంటే గిరిజకి తృప్తిగా వుంది, తను పడిన శ్రమ వృథాపోనందుకు. తన్మయంగా చూస్తున్న గిరిజ ఉలిక్కిపడింది. భయంతో కెవ్వుమని అరవబోయింది. రెండు చేతులు గిరిజని వెనకనించి వాటేసుకుని పొట్టని తడుముతూ పై పైకి పాకుతున్నాయి. వణికిపోతూ తిరిగి చూసిన గిరిజకి వెనకాలే వెంకటప్పయ్య వెకిలినవ్వు నవ్వుతూ కనిపించాడు. "డాన్సు బాగుందమ్మా గిరిజా" అంటున్నాడు. గిరిజ వొంటిమీద వేంకొద్దీ తాచు పాములు జరజరా పాకినట్లు వొళ్ళంతా అసహ్యం, భయంతో నిండిపోయింది. తన పొట్టని తడుముతున్న ఆ చేతుల్ని గబుక్కున లాగి విసిరికొట్టింది.

"యూ, యూ, స్టుపిడ్" రొప్పుతో, ఆయాసంతో గిరిజకి నోట్లోంచి మాటలు రావటంలేదు. గిరిజ కళ్ళు భగభగ మండుతున్నాయి. కోపం, రోషం, బాధ అన్నీ పెనవేసుకుని మహాప్రవాహంలాగా పొంగుకొస్తున్నాయి.

గిరిజ విసురుగా తోసిన తోపుకి వెంకటప్పయ్య తూలి కర్టెనుమీద పడ్డాడు.

"అయ్యయ్యో పెద్దముండావాడిని. కళ్ళు కనిపించటంలేదు తల్లీ. కాస్త వుంటే కింద పడిపోయేవాడిని" అంటూ స్టేజి పక్కనించి దిగి జనంలోకి పోయి కూర్చున్నాడు.

గిరిజ వొణికిపోతూ అలాగే నిలబడిపోయింది. అసహ్యంతో వొళ్ళు జలదరిస్తోంది.

పిల్లల డాన్సు పూర్తయింది. తెర వాలింది. ఆవరణ అంతా చప్పట్లతో నిండిపోయింది. సుధ గిరిజ దగ్గరగా వచ్చింది.

"గిరిజా ఈ పిల్లమేళం మన పరువు నిలబెట్టేరు. బాగానే చేశారు కదూ" అంటూ గిరిజని చూసి ఆశ్చర్యపోయింది.

పాలిపోయినట్టుగా వున్న గిరిజ కళ్ళనించి నీళ్ళు కారుతున్నాయి. కలలో వున్న మనిషిలాగా అదిరే పెదవులతో వెంకటప్పయ్య వెళ్ళినవైపే చూస్తోంది.

"గిరిజా! ఏమయింది? అలా వున్నావేం?" ఆత్రంగా గిరిజ భుజాన్ని కుదిపింది సుధ.

గిరిజ కల్లోంచి మేల్కొన్నదానిలా, కొత్తవ్యక్తిని చూస్తున్నట్టుగా చూసింది సుధని. సుధని చేతుల్లో చుట్టి బావురుమంది.

సుధ కంగారుపడిపోయింది. చేత్తో చుట్టి గిరిజని స్టేజి వెనగ్గా తీసుకు వెళ్ళింది. గిరిజ దుఃఖానికి కారణం తెలియక కంగారుపడిపోతోంది సుధ. ఐదు నిముషాల క్రితం వరకు హాయిగా వున్న గిరిజకి అంతలోనే ఏం జరిగిందో అర్థంకాలేదు.

"అరే ఏవిటిది. ఎందుకు ? గిరిజా ! ఏం జరిగింది ? ఏదయినా బాధగా వుందా ?"

గిరిజకి అవమానంతో నోట మాట రావటంలేదు. జవాబు చెప్పటానికి నోరు పెగలటంలేదు. జవాబు చెప్పకపోతే సుధ వదిలేట్టుగా లేదు.

"ఏంలేదు" అన్నట్టుగా తలూపి కళ్ళు తుడుచుకుంది.

"ఏమిటి ఏమయినా బాధగా వుందా ?"

గిరిజ తలాడించింది.

"పద లోపల రూమ్‌లో కూర్చుందువుగాని కాసేపు" అంది.

"ఊహు ఇంటికి వెడతాను సుధా." గొంతు పెగుల్చుకుని ఎలాగో అంది గిరిజ.

"అదేం ? ప్రోగ్రాం చూడవూ ?"

''ఊహు వెళ్ళిపోతాను."

సుధకి గిరిజ వాలకం అర్థంకాలేదు. మరేం తర్కించకుండా జనాన్ని తప్పించుకుంటూ వీధిలోకి వచ్చారు.

సుధ ఆగివున్న రిక్షాని పిలిచింది.

"నేనుకూడా తోడు రానా ?" అంది.

"వద్దు. నేను వెళ్ళిపోతాను" అంది కళ్ళు వొత్తుకుంటూ.

కనుమరుగవుతున్న రిక్షాని చూస్తూ నిలబడిన సుధ, ఆవరణ అంతా మరో మారు చప్పట్లతో మారుమ్రోగటంతో, ఉలిక్కిపడి లోపలకు నడిచింది.

## 28

తిరిగి తిరిగి అలిసిపోయి వస్తున్న నారాయణని సత్యన్నారాయణ పిలిచి ఓ శుభవార్త వినిపించాడు. ఛిట్‌ఫండ్ కంపెనీలో పనిచేసే ఒకతను మరణించటం వల్ల అతని స్థానంలో పనిచెయ్యటానికి మరో మనిషి కావాలట.

"ను, నువ్వు జేరగూడదూ, నాన్నా నారాయణా"' అన్నాడు సత్యన్నారాయణ.

నారాయణకి ఆ కబురు వింటూనే ప్రాణం లేచివచ్చినట్టుగా వుంది.

"తప్పకుండానండి సత్యంగారూ. వివరాలు చెప్పండి" అన్నాడు ఆత్రంగా.

సత్యన్నారాయణ చెప్పిన వివరాలు విని నీరుగారిపోయాడు. చనిపోయినతను కేష్‌ని డీల్ చేస్తూ వుండేవాడుట. సెక్యూరిటీగా వెయ్యి రూపాయలు కట్టిన వారికే ఆ పని దొరుకుతుందిట.

నారాయణ సంతోషంమీద నీళ్ళు చల్లినట్లుగా అయింది. వెయ్యి రూపాయలు తనకిచ్చే దాతలెవరు ? నారాయణ మనసులో ఒక్కొక్కరినే తిరగేస్తున్నాడు, తనకి సహాయం చెయ్యగలిగిన వాళ్ళెవరయినా వున్నారేమోనని.

తండ్రి నిస్సహాయుడని తనకి తెలుసు. ఓ క్షణం శంకరాన్ని అడుగుదామా అనిపించింది. మరెక్కడయినా ప్రయత్నించి అయినా శంకరం సహాయం చెయ్యగలడేమో అన్న ఆలోచన మరుక్షణంలోనే తోసిపారేశాడు. నారాయణకి రోషం, పట్టుదల ఎగేసుకొచ్చినాయి. గిరిజ ఉద్యోగంలో చేరిన దగ్గరనుంచి శంకరం తీరే మారిపోయింది. అతని దృష్టిలో నారాయణకి పీసమెత్తు విలువ లేకుండాపోయింది. సూటిగా నారాయణని చూడటానికే ఇష్టపడటంలేదు. 'ఓరి వెధవా! ఆడపిల్ల కష్టపడి సంపాదిస్తుంటే, పనీ పాటా లేకుండా తిరుగుతున్న నువ్వూ ఓ మనిషివేనా ?' అన్నట్టుగా వుంటాయి శంకరం చూపులు. అవి నారాయణని ముళ్ళలాగా గుచ్చుతూ వుంటాయి. ఉహూ ఎంత కష్టపడి అయినా సరే తను ఏదో ఉద్యోగం సంపాదించుకోవాల్సిందే గానీ శంకరం సహాయం మాత్రం అడగను అని నిశ్చయించుకున్నాడు.

ఇంక చివరికి మిగిలిన ఆశ చలపతి మాత్రమే ! వెతికి, వెతికి చలపతిని ఓ స్నేహితుడి ఇంటిదగ్గర పట్టుకున్నాడు.

ఒంటరిగా వున్న సమయం చూసి నారాయణ తను వొచ్చిన పని చెప్పేశాడు. "చలపతీ, చాలా అర్జంటురా. ఎలాగయినా ఒక్క వెయ్యి రూపాయలు సర్దు. ఉద్యోగం రాగానే నీ బాకీ తీర్చేస్తాను" అంటూ ప్రాధేయపడ్డాడు.

చలపతికి పెద్దగా నవ్వొచ్చింది. తనూ అదే వేటలో వున్నట్టు ఈ నారాయణకి తెలియదల్లే వుంది. తన దగ్గర వుంటే నారాయణకి తప్పకుండా సహాయం చేసేవాడే. వేలకి వేలు ఖర్చు చేసిన తనకి అదొక లెక్కలోకి రాదు. కానీ ఈ క్షణంలో తనే ఎవరు అప్పు పెట్టగలరా అని ఎదురుచూస్తున్నాడు.

"సారీ బ్రదర్. నా దగ్గర వున్నప్పుడు నీకి బుద్ధి పుట్టలేదు. నీ బుద్ధి తిరిగినప్పుడు నా జాతకం మారింది. ఏం చేద్దాం ! దిసీజ్ లైఫ్" అన్నాడు చలపతి.

ఉసూరుమంటున్న ప్రాణంతో నారాయణ ఇంటికి తిరిగి వచ్చాడు, అలసి పోయిన శరీరం, అశాంతి నిండిన మనసుతో. ఎలాగయినా రెండురోజుల్లో ఆ డబ్బు సంపాదించలేకపోతే తనకి వుద్యోగానికి కూడా ఆశ వదులుకోవాల్సిందే.

చిరాగ్గా గదిలోకి అడుగుపెట్టిన నారాయణకి షాక్ కొట్టినట్టుగా ఆగిపోయాడు. గిరిజ మంచంమీద దిండులో తలదూర్చి వెక్కి వెక్కి ఏడుస్తోంది. బయటి వాళ్ళకి వినపడకూడదన్నట్టుగా దుఃఖాన్ని తనలోనే దిగమింగుకునే ప్రయత్నంలో గుండెలు ఎగసిపడుతున్నాయి.

'గిరిజా, ఏమయింది ?' అంటూ తన వైపు తిప్పుకోబోయిన నారాయణ చేతుల్ని ఒక్క ఊపుతో విదిలించేసింది.

గిరిజని ఇలాంటి పరిస్థితిలో ఏనాడూ చూడలేదు నారాయణ. ఏదో జరిగింది. లేకపోతే ఇలా ఏడవదు.

"చెప్పు గిరిజా. ఎందుకు? ఏమయింది." గిరిజ వీపుని అనునయంగా రాస్తూ బుజ్జగిస్తున్నట్టుగా అడిగాడు.

గిరిజ చట్రున పడగ విప్పిన నాగినిలాగా లేచి కూర్చుంది. ఏడుపుతో ఎర్రబడిన కళ్ళు బుసలు కొడుతున్న పాము కళ్ళలా వున్నాయి.

"ఏమయిందా ? తెలుసుకోవాలనుకుంటున్నారా ? చెపుతా వినండి. నాకు తగిన శాస్తి జరిగిందండీ. కావాలని మిమ్మల్ని పెళ్ళాడానే ? అందుకు తగ్గ ఫలితం దొరికిందండీ. మీరు అందలాలు ఎక్కిస్తారని మిమ్మల్ని పెళ్ళి చేసుకో లేదండీ. కనీసం గుప్పెడు మెతుకులు భార్యకి పెట్టలేరా అన్న ధీమాతో చేసుకున్నాను. అన్నయ్య మాటని కాదని మిమ్మల్ని కోరి చేసుకున్నాగదండీ ? అందుకే ఏడుస్తున్నాను. కట్టుకున్న పెళ్ళాన్ని నలుగురిలోకి తోలి మీ దోవన మీరు తిరుగుతున్నప్పుడే నేను గ్రహించవలసింది. పిచ్చిదాన్ని. నాకా ఆలోచనే రాలేదు. ఇప్పుడు యేడిచి ఏం ప్రయోజనం. ఎవరేం చేసినా భరించాలిసిందే ! కన్ను కొట్టినా, చెయిలాగినా, ముద్దు పెట్టుకున్నా భరించాల్సిందేనండీ !"

గిరిజకి మళ్ళీ దుఃఖం పొంగుకొచ్చింది. చేతుల్లో మొహం దాచుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

నారాయణ విస్తుపోయి చూస్తున్నాడు. గిరిజ ఇలా మాట్లాడగలదని ఏనాడూ వూహించలేదు. జరగరానిదేదో జరిగింది. గిరిజ భరించలేని ఆ బాధని తనలో ఇముడ్చుకోలేకపోతోంది. ఆ ఆవేశం, తీరూ, మాటలు అది ఒక్కనాటికీ తనెరిగిన గిరిజ కాదు. ఎవరేం చేశారు తన గిరిజని ? ఆ ఆలోచన రాగానే

నారాయణ కళ్ళు కోపంతో మండినాయి. ఆవేశంతో గుప్పిట బిగుసుకుంది. పళ్ళు పటపట లాడినాయి.

"ఎవరు గిరిజా! ఎవరు చెప్పు. నిన్ను అవమానించింది ఎవడో చెప్పు. వాడి గుడ్లు పీకేస్తాను. గొంతు పిసికేస్తాను. వాడిని, వాడిని చిత్రవధ చేస్తాను" నారాయణ ఆవేశంగా గిరిజ భుజాలు పట్టి వూపుతూ అరిచాడు.

గిరిజ చివ్వున తలెత్తి చూసింది. కళ్ళు క్రూరంగా నవ్వాయి నారాయణని చూసి. "అవునండీ, మీరు ఏమయినా చెయ్యగల సమర్థులు. ఇంతవరకు వుద్యోగం సద్యోగం లేని నారాయణ భార్యనని చెప్పుకుంటున్నారు గదా. ఇవాళనించీ హంతకుడి పెళ్ళాన్నని కూడా చెప్పుకుంటారు. మీరు బహు సమర్థులండీ. ఏదయినా చెయ్యగలరు.'' గిరిజ మనసులో ఇన్నాళ్ళుగా అణిచిపెట్టిన బాధ, దుఃఖం తెరలు తెరలుగా, అలలు అలలుగా తోసుకొస్తుంది.

శరీరంలోని శక్తి అంతా ఒక్కసారిగా లాగేసినట్టుగా గిరిజ భుజాల్ని పట్టుకున్న నారాయణ చేతుల పట్టు సడలిపోయింది. వాలిపోయిన తలతో నారాయణ కిటికీ చువ్వల్ని పట్టుకొని బయటి గాఢాంధకారంలోకి చూస్తూ నుంచున్నాడు.

గిరిజకి వళ్ళంతా అసహ్యంగా, మంటగా వుంది. చల్లగా తన శరీరంమీద పాకుతూ తడుముతున్న వెంకటప్పయ్య చేతులస్పర్శే జ్ఞాపకానికి వస్తోంది. అంతమేరా శరీరాన్ని తననుంచి ఎవరయినా వేరుచేస్తే బాగుండును అనిపిస్తోంది. బాధతో, దుఃఖంతో, అవమానంతో, కోపంతో ప్రపంచం కదలకుండా నిలిచిపోయినట్టుగా వుంది గిరిజకి. నారాయణ తలుపు తీసుకుని బయటికి వెళ్ళిపోయాడు.

## 29

తెల్లవారింది. నిద్రలేని గిరిజ మొహం ఉబ్బి, కళ్ళు ఎర్రబడినాయి. గిరిజ మొహం చూసి శారద కంగారుపడింది.

"అలా వున్నావేం గిరిజా? వొంట్లో బాగాలేదా?" అంది.

"ఏంలేదు. కొంచెం తలనొప్పిగా వుంది." గిరిజ శారద చూపుల్ని తప్పించుకుంటూ అంది.

"ఇవాళ సుషమ పుట్టినరోజు గదూ. తలంటి కొత్త గౌను వెయ్యి" అంది శారద.

గిరిజకి మనసులో ఉత్సాహం లేదు. శరీరంలో ఓపిక లేనట్లుగా వుంది. స్కూలుకి శెలవు రాసి పంపించింది. తిరిగి ఆ స్కూలు ఆవరణలో అడుగు పెట్టాలన్నా, వెంకటప్పయ్య మొహం చూస్తూ పనిచెయ్యాల్సివస్తుందన్నా గిరిజకి భరించలేనట్టుగా అనిపిస్తోంది. మౌనంగా, నీరసంగా తిరుగుతున్న గిరిజని చూసి, శారద తనే సుషమకి తలంటి స్నానం చేయించింది. కొత్తగౌను తొడిగింది. గిరిజని అడిగి శంకరం చేయించి ఇచ్చిన బంగారపు గొలుసు సుషమ మెడలో వేసింది. కళ్ళకి కాటుక పెట్టి, బొట్టు దిద్దింది ఎత్తుకుని ముద్దులాడుతూ తండ్రి దగ్గరకి తీసుకువెళ్ళింది.

సుషమ చిన్న చిన్న మాటలన్నీ ముద్దు ముద్దుగా చెపుతోంది. రెండేళ్ళ సుషమ తెల్లగా బొద్దుగా ముచ్చటగా వుంది.

"తాతయ్య కాళ్ళకి నమస్కారం చెయ్యవే సుషమా" అంటూ సుషమని కిందకి దింపింది.

సుషమ సిగ్గుపడుతూ గొలుసుతో ఆడుకుంటూ నుంచుంది. శారదే సుషమ చేత దణ్ణం పెట్టించింది. సుందరయ్యగారు వారం రోజులుగా జ్వరంతో మంచంలోనే వుంటున్నారు. ఆయన చేతులు జాచి సుషమని దగ్గరకి తీసుకున్నారు.

"అదృష్టవంతురాలివై వెయ్యేళ్ళు సుఖంగా వర్ధిల్లు తల్లీ" అంటూ ఆయన మనవరాలిని గుండెలకి అదుముకుని దీవించారు.

పార్వతమ్మగారు సుషమని ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నారు.

'ఛీ అద్దు' అంటూ బుగ్గ తుడుచుకుంటున్న సుషమని చూసి నవ్వింది శారద, "ఓసి నీ సిగతెన్ని సూకరాలే!" అంటూ.

సుషమ పరుగుపెడుతూ తల్లి దగ్గరకి వచ్చింది. గిరిజ గాజువాలినట్టుగా వున్న కళ్ళతో చూస్తున్నట్టే వున్నా దృష్టి ఎక్కడో వుంది. దగ్గిరకి తీసుకోని తల్లిని చూస్తూ, బిక్కమొహం వేసుకుని నిలబడిపోయింది సుషమ.

"ఒక్కసారి దగ్గరకు తీసుకో గిరిజా. చూడు ఎలా బిక్కమొహం వేసుకుని నిలబడిందో. దాని సింగారం చూపించాలని పరిగెత్తుకొచ్చింది" అంటున్న శారద మాటల్ని విని కూతురివైపు చూసింది. హఠాత్తుగా గిరిజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. సుషమని దగ్గరకి లాక్కుని గుండెలకి అదుముకుంది. సుషమ సంతోషంతో కిలకిల్లాడింది.

"సుషమా! అత్తయ్యచేత అన్నీ చేయించుకున్నావు గానీ, అత్తయ్యకి

ఒక్క ముద్దయినా పెట్టావా. పో అత్తకి ముద్దు పెట్టిరా." సుషమని కింద దింపుతూ అంది గిరిజ

పరుగు పెడుతూ దగ్గరగా వచ్చిన సుషమని వంగి చేతుల్లోకి తీసుకుంది శారద నవ్వుతూ.

సుషమ శారద రెండు బుగ్గలమీద ముద్దులు పెట్టి, వొడి దిగిపోయి పరుగు పెట్టింది తల్లి దగ్గరకి

గోపి, రమ సుషమని ఎత్తుకోవాలని వంతులు వేసుకుని, నేను ముందంటే నేను ముందంటూ దెబ్బలాడుకుంటున్నారు. సుషమ ఆ ఇద్దరికీ అందకుండా ఇల్లంతా పరుగులు పెడుతుంది.

రాత్రనగా బయటికి వెళ్ళిపోయిన నారాయణ ఇంతవరకు ఇంటికి రాలేదు. గిరిజ మనసంతా దిగులుగా వుంది. మనసు పశ్చాత్తాప పడుతోంది. ఎన్ని మాటలంది నారాయణని! ఆ బాధలో, దుఃఖంలో తనేమంటోందో తనకే తెలియకుండా పోయింది. ఆ ఆవేశం దిగిపోయిన తరువాత తనన్న మాటలన్నీ ఒక్కొక్కటే గుర్తుకి వస్తున్నాయి. గిరిజకి సిగ్గువేసింది. తనేనా అలా మాట్లాడింది. తన వాక్బాణాలతో దెబ్బతిన్న పక్షిలాగా గిలగిల్లాడిపోయిన నారాయణ దీనవదనమే కళ్ళముందు కదులుతోంది గిరిజకి. అలా అని వుండ కూడదు అని తనలో తనే మధనపడుతోంది.

సాయంత్రం ఆరుగంటలవేళ వొడిలిపోయిన మొహంతో, దుమ్ము కొట్టుకున్న బట్టలతో ఇంటికి వచ్చాడు నారాయణ. సరాసరి తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. రోజంతా తిరిగినవాడు తిరిగినట్టే వున్నాడు. అప్పు దొరికే మార్గంఎక్కడా కనిపించలేదు. వాడిబాణాల్లాగా గిరిజ అన్న మాటలే క్షణ క్షణం గుర్తుకొచ్చి, మనసుని తూట్లు పడేస్తున్నాయి. రేపు పొద్దున పదిగంటలలోగా వెయ్యి రూపాయలు ఎలా వస్తాయి? ఈ అవకాశం పోతే తనకి అప్పట్లో మరో వుద్యోగం దొరికే అవకాశం లేదు.

నిరాశగా నిస్పృహగా కళ్ళు మూసుకుని పడుకున్న నారాయణని చూసి గిరిజకి జాలేసింది. ఆప్యాయత పొంగుకొచ్చింది.

'భోజనానికి రాలేదేం?' అంది దగ్గరగా వస్తూ.

నారాయణ ఓసారి కళ్ళు తెరచి చూసి మళ్ళీ మూసుకున్నాడు.

మౌనంగావున్న భర్తని చూసి, అతనికి చాలా కోపం వచ్చిందని గ్రహించుకుంది గిరిజ.




"లేచి స్నానం చెయ్యండి. భోజనం చేద్దురు గాని. ఇవాళ సుషమ పుట్టిన రోజు" అంది మెల్లగా.

నారాయణ కదలక మెదలక, అలాగే పడుకొని వున్నాడు. గిరిజ మంచం దగ్గర వొంగి కూర్చుని అతని చేతిని తన చేతుల్లోకి తీసుకుంది. "బాగా కోపం వచ్చింది కదూ. నేనేమంటున్నానో నాకే తెలియకుండా పోయింది. బాధ పడుతున్నారు కదూ" అంది మెల్లగా.

నారాయణ కళ్ళు తెరిచి ఆశ్చర్యంగా చూశాడు. ఒక్క క్షణం మనసంతా సంభ్రమంతో నిండిపోయింది. మరుక్షణమే ముకుళించుకుపోయింది. తావాలని తన జీవితాన్ని పంచుకొన్న ఈ అమాయకురాలిని తనేం సుఖపెట్టగలిగాడని!

"లేదు గిరిజా, నువు అన్నదే నిజం! నన్ను చేసుకోకుండా వుండవలసింది" మెల్లగా అన్నాడు.

"నన్ను క్షమించండి. తొందరపడ్డాను." గిరిజ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. నారాయణకి జాలి, ప్రేమ పొంగుకొచ్చినాయి. గిరిజ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. క్షణాలు నిశ్శబ్దంగా దొర్లిపోతున్నాయి. నారాయణ పరాకుగా ఇంటికప్పుకేసి చూస్తూ పడుకున్నాడు.

నారాయణ చేతిలోంచి తన చేతిని విడిపించుకుని వెళ్ళి, సుషమని తీసుకు వచ్చింది గిరిజ.

సుషమ తండ్రిని చూడగానే మీదకి దూకింది సంబరంగా. సుషమని నారాయణ పొట్టమీద కూర్చోపెట్టి, లోపలకు వెళ్ళింది గిరిజ.

నారాయణ సుషమ మొహాన్ని తన దగ్గరగా లాక్కుని ముద్దుపెట్టుకున్నాడు రెండు రోజులుగా పెరిగిన గడ్డం గుచ్చుకుంది సుషమ లేతబుగ్గలకి. 'అబ్బా, అబ్బా' అంటూ చెంపలు రాసుకోసాగింది.

"ఏమ్మా, గడ్డం గుచ్చుకుందా" అంటూ నారాయణ కూతురి చెంపలు మృదువుగా రాస్తున్నాడు.

సుషమ పుట్టినరోజు అని సేమ్యా పాయసం చేసింది శారద. నారాయణ కోసరం చిన్న గ్లాసులో తీసి విడిగా వుంచింది. గిరిజ పాయసం గ్లాసు తీసుకుని నారాయణ దగ్గరకు వచ్చింది.

"సుషమ పుట్టినరోజని పాయసం చేసింది వదిన. తాగండి." గ్లాసు అందించింది నారాయణకి.

నారాయణ లేచి కూర్చుని గ్లాసులోని పాయసాన్ని సుషమకి కాస్త తాగించాడు. తను కాస్త తాగాడు.

పార్వతమ్మగారు లోపలనించి కేకవేసింది. 'శుక్రవారం గదుటర్రా, అమ్మవారి గుడికి వెళ్ళిరండి' అంటూ.

"సుషమా! దేముడి దగ్గరకు వెడదాం వస్తావా?" గిరిజ అడగటంతోనే సుషమ తల్లి చంకనెక్కి కూర్చుంది.

శారద, గిరిజ, రమ, సుషమ గుడికి వెళ్ళటానికి తయారయ్యారు. "శుక్రవారంనాడు జనం విపరీతంగా వుంటారు. గిరిజా, పాప మెళ్ళో గొలుసు ఇంట్లో పడేసి వెళ్ళు. ఏ క్షణం ఎలాటిదో ఎవరు చెప్పగలం." వెనకనించి అంది పార్వతమ్మగారు.

గుమ్మం దాటబోతున్న గిరిజ వెనక్కి తిరిగివచ్చింది. సుషమ మెళ్ళోని గొలుసు తీసి పెట్టె తెరిచి జాగ్రత్తగా అడుగున వున్న చిన్న ప్లాస్టిక్ భరిణలో భద్రపరిచింది. పెట్టె తాళం వేసి, తాళం చెవిని మెడకివున్న గొలుసులో కట్టుకుంది. సుషమని ఎత్తుకుని నారాయణ దగ్గరగా వచ్చింది.

"మేం గుడికి వెళ్ళి త్వరగా వస్తాం. మీరు స్నానం చేయండి. మేం రాగానే భోజనం చేద్దురు గానీ" అంటూ గిరిజ వెళ్ళిపోయింది.

అమ్మవారి ఆలయం జనంతో కిటకిటలాడుతోంది. విశాలమయిన ఆవరణ అంతా రంగు రంగుల పువ్వులు చల్లినట్టుగా రకరకాల స్త్రీలతో నిండి వుంది. గిరిజ, శారద, రమ, సుషమ పార్వతీఅమ్మవారి దర్శనం చేసుకున్నారు తల్లి చేయి పుచ్చుకుని సుషమ గుడిచుట్టూ పరుగులు పెడుతూ ప్రదక్షిణాలు చేసింది.

"తల్లీ జగన్మాతా! మా సంసారానికి ఒక దారి చూపించు. ఈ కష్టాలు, మనఃక్లేశాలు తొలగించు. నీ అనుగ్రహం ప్రసాదించు తల్లీ!" గిరిజ కళ్ళు మూసుకుని భక్తిగా అమ్మవారికి మనసులోనే ప్రణమిల్లింది.

ఆవరణలోని బొగడచెట్టునుంచి వీచే గాలి సుగంధాన్ని మోసుకొస్తూ మనసుకి ఆహ్లాదంగా వుంది. గిరిజ, శారద ఖాళీగావున్న జాగా చూసి కూర్చున్నారు. రమ, సుషమని వెంటపెట్టుకుని బొగడచెట్టు కింద పూలకోసం వెతుకుతోంది. క్రితం రాత్రినించి అంతులేని వ్యధతో, దుఃఖంతో నిండిన మనసు ఆ ప్రశాంత, పవిత్ర వాతావరణంలో తేలికపడుతున్నట్టుగా వుంది గిరిజకి. ఆ సుగంధ భరితమయిన చల్లటిగాలి, మనసును సేద దీరుస్తున్నట్టుగా వుంది.

నారాయణ కాలుకాలిన పిల్లిలా గదిలో పచార్లు చేస్తున్నాడు. మొహం అంతా చిరుచెమటలు అల్లుకున్నాయి. అతని దృష్టి క్షణక్షణానికి గిరిజ తాళం వేసిన పెట్టెవైపే వెడుతోంది. మళ్ళీ చటుక్కున దృష్టిని తిప్పుకుంటున్నాడు. 'ఉహూ, వద్దు వద్దు' అన్నట్టుగా తలని ఊపుతున్నాడు. తనలో తనే మధనపడుతున్నాడు.

'వద్దు వద్దు' గిరిజ దృష్టిలో మరింత దిగజారిపోలేను.'

'కాదు కాదు, ఈ అవకాశం జారిపోతే నీకు మరింక దారిలేదు.'

'ఉహూ నే నీ పనిచెయ్యను.'

'నువు కావాలనుకున్నప్పుడల్లా ఉద్యోగాలు నీ కాళ్ళదగ్గరికి రావు.'

'అయినా సరే.'

'సరే నీ ఖర్మ.'

నారాయణ అసహ్యం క్షణక్షణానికి పెరిగిపోతోంది. మొహాన పట్టిన చెమటని చేతితో అద్దుకున్నాడు. కిటికీ దగ్గర నిలబడి బయటి చీకటిలోకి చూస్తూ మిణుకు మిణుకు మంటూ ఆకాశంలో మెరిసే నక్షత్రాల్ని చూస్తున్నాడు. నారాయణ మనసులో ఆశ రెపరెప లాడుతోంది. ఏదో నిర్ణయం తీసుకున్నట్టుగా చటుక్కున పెట్టెదగ్గరగా వచ్చి తాళాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

'గాజులు, గాజులు' అంటూ రాధ ఏడుస్తున్నట్టుగా వినిపించి, చేతితో సర్పాన్ని పట్టుకున్నట్టుగా చటుక్కున దూరంగా జరిగి చేతుల్తో మొహాన్ని దాచుకున్నాడు. రెండునిమిషాలకిగానీ ఆ గుండెదడ తగ్గలేదు. ధారగా మొహం మీదనించి చెమటలు కాల్వలు కడుతున్నాయి.

'నా మాటమీద వాళ్ళు రేపటివరకు ఆగారు. రేపు నువ్వు చేరకపోతే మరొకరిని చూసుకుంటారు వాళ్ళు' అంటూ సత్యన్నారాయణ చెప్పిన మాటలు గుర్తుకొచ్చినాయి. 'వెయ్యి రూపాయలు రేపు పదిగంటల లోపల! ఎలా! ఎలా?' నారాయణ ఏదో నిశ్చయానికి వచ్చినట్టుగా చటుక్కున లేచి నిలబడ్డాడు. క్షణంలో పెట్టె తాళాన్ని విడతీశాడు. పెట్టె అడుగునించి ప్లాస్టిక్ భరిణ తీస్తుంటే చెయ్యి వణికింది.

"గిరిజా! నే నీ పని నాకోసం చెయ్యటంలేదు. మన సంసారాన్ని ఓ గట్టుకి చేర్చాలన్న తాపత్రయంతోనే చేస్తున్నాను. నేను ఆ మాట చెప్పినా నువ్వు నమ్మవు. అందుకనే చేసి నా మాట అబద్ధం కాదని నిరూపిస్తాను. పాపకి వచ్చే పుట్టినరోజునాటికి ఇలాటిదే మరో గొలుసు చేయిస్తాను. నన్ను అర్థంచేసుకుంటావుగదూ!'' ఎదురుగా లేని గిరిజని సమాధానపర్చటానికి తన మనసులోనే సంజాయిషీ చెప్పుకుంటున్నాడు.

మిల మిల మెరుస్తున్న గొలుసు తీసి జేబులో వేసుకుని ఖాళీ భరిణని పెట్టె అడుగున పెట్టేశాడు. వూడిపోయిన తాళంకప్పని పెట్టెకి తగిల్చి గదిలోంచి ఎవరో తరుముకొస్తున్నట్టుగా బయటికి వెళ్ళిపోయాడు.

## 30

గిరిజ ఇంట్లోకి వస్తూనే సరాసరి నారాయణ ఉన్న గదిలోకి వచ్చింది.

"రండి భోజనం చేద్దురుగానీ వడ్డిస్తున్నా...!" గిరిజ మాటలు పూర్తి కాకుండానే గదంతా కలయజూసింది. నారాయణ లేడు. ఇంట్లో, పెరటిలో చూసి వచ్చింది. నారాయణ జాడ లేదు. మరోమారు గదిలో చూసివెడుతున్న గిరిజ గుమ్మందగ్గర ఆగిపోయింది ఏదో తట్టినట్టుగా. పాలిపోయిన మొహంతో మంచం కిందుగాఉన్న పెట్టెని బయటికి లాగి చూసింది. కొక్కానికి వ్రేలాడుతున్న తాళం చూడగానే గిరిజ మొహం వివర్ణమయిపోయింది. గబగబా బట్టల అడుగునఉన్న ప్లాస్టిక్ భరిణని తీసి చూసింది. ఖాళీగాఉన్న భరిణ గిరిజని వెక్కిరించినట్లయింది. ప్రాణం లేనట్టుగా అక్కడే కూలబడిపోయింది. కళ్ళలో నీరు ఇంకిపోయినట్లుగా పొడికళ్ళతో భరిణవైపే చూస్తున్న తల్లిని

వాటేసుకుంది సుషమ. తల్లి చేతిలోని భరిణని చూస్తూనే "గొలుసు, గొలుసు" అంటూ భరిణ తీసుకుని అందులో లేని గొలుసు కోసం వెతకసాగింది.

'అమ్మ, గొలుసు' అంటున్న సుషమని దగ్గరకి లాక్కుని గుండెల్లో ఇముడ్చుకున్న గిరిజకి అభయహస్త ముద్రతో వున్న అమ్మవారి రూపు కళ్ళ ముందు కదలాడింది. ''తల్లీ, ఇదేనా నువు నాకు చూపించే దారి ?" అని ప్రశ్నిస్తున్నట్టుగా వున్న గిరిజ దృష్టి సర్వవ్యాపి అయిన ఆ తల్లికోసం వెతుకుతున్నట్టుగా చీకటిలోకి చూస్తూ వుండిపోయింది.

* * *

నారాయణ వందరూపాయల నోట్లని లెక్కపెట్టుకుని భద్రంగా పర్సులో పెట్టుకున్నాడు. కొట్లోంచి బయటపడి చకచకా నడవసాగాడు. అలవాటు ప్రకారంగా కాళ్ళు ఇంటికేసే సాగినాయి. అంతదూరంలో ఇంటిని చూడగానే చటుక్కున ఆగిపోయాడు. ఒక్కసారిగా చలిజ్వరం వచ్చినట్టుగా మనసు వొణికింది. జేబులోని పర్సుని గట్టిగా పట్టుకున్న చెయ్యి నిప్పుని ముట్టుకున్నట్టుగా మండినట్లయింది. ఊహు తనిప్పు డేం చెప్పినా గిరిజ నమ్మదు. తను ఉద్యోగంలో జేరి మొదటినెల జీతం తీసుకువచ్చి గిరిజ చేతిలో పెట్టినాడు గానీ తన మాట నమ్మదు. తను పూర్వపు నారాయణ కాదని అప్పుడుగానీ తెలుసుకోలేదు. జేబులో ఈ డబ్బుతో తను ఇంట్లో అడుగుపెట్టలేడు. నారాయణ చటుక్కున వెనక్కి తిరిగి చలపతి ఇంటికేసి నడవసాగాడు. సగందూరం నడవకుండానే 'నారాయణా' అన్న పిలుపు వినిపించింది.

చటుక్కున వెనక్కి తిరిగి చూసిన నారాయణకి పక్కసందులోంచి వస్తున్న చలపతి కనిపించాడు. దూరంనించే నారాయణని ఆగమన్నట్టుగా చెయ్యూపాడు.

చేతిలో డబ్బులేక చలపతి కార్యక్రమాలన్నీ ఎక్కడివక్కడే ఆగిపోయి నాయి. కనీసం పేకాటకు కూర్చుంటానికయినా క్లబ్బు బిల్ సెటిల్ చెయ్యందే ఆ క్లబ్బులోకి అడుగుపెట్టకూడదనుకున్నాడు చలపతి. ఆ మేనేజరు ప్రవర్తన అంత అవమానకరంగా వుంది చలపతికి. చేసేదేంలేక చలపతి పిచ్చి పట్టిన వాడిలాగా వూరంతా తిరుగుతున్నాడు. దోవలోనే నారాయణ ఎదురుపడ్డాడు.

"వెదకబోయిన తీగ కాళ్ళకే తగిలినట్టు, నువ్వే ఎదురొచ్చావు. మీ ఇంటికే వెడుతున్నాను" అన్నాడు నారాయణ చలపతి దగ్గరకి రాగానే.

"అదేం ? ఇవాళ అంత మంచి బుద్ధి పుట్టిందేం ?" అన్నాడు చలపతి.

"ఈ రోజుకి మీ యింట్లో ఆశ్రయం కావాలి." నారాయణ మెల్లగా నవ్వాడు.

చలపతి ఎందుకు, ఏమిటి అని అడగలేదు; ఒక్క క్షణం నారాయణని పరికించి చూసి, పద, ఇంటికి వెళదాం. ఏం తోచక బోరుకొట్టి చస్తున్నాను ! సమయానికి దేవుడల్లే వచ్చావు!" అన్నాడు.

ఇద్దరూ కలిసి చలపతి ఇంటికేసి నడవసాగారు. నారాయణ భోజనం చెయ్యనన్నా, బలవంతంచేసి తినిపించాడు చలపతి.

"ఒక ఆట వేద్దాం రా!" అంటూ చలపతి పేకముక్కలు పరవసాగాడు మంచంమీద కూర్చుని. నారాయణ మనసు ఆటమీద లేదు. పరాగ్గా ఉన్న నారాయణని మధ్యల్లో హెచ్చరిస్తూనే వున్నాడు చలపతి. నారాయణ ఆ రోజు శారీరకంగా- మానసికంగా బాగా అలసిపోయాడు.

పదకొండు గంటలు కొట్టటం వినిపించగానే పేకముక్కలు కిందపడేస్తూ ఆవలిస్తూ లేచి నుంచున్నాడు నారాయణ.

"ఇంక ఆడలేను బాబూ నిద్రవస్తోంది" అన్నాడు.

చలపతి గెస్ట్ రూమ్‌లో నారాయణకి పక్క ఏర్పాట్లు చేశాడు. మరి కాసేపు నారాయణ మంచంమీద కూర్చుని కబుర్లు చెప్పి తన గదికి వెళ్ళిపోయాడు.

"చలపతీ! ఆరుగంటలకల్లా లేపుతావు గదూ" అంటూ కేకేసి చెప్పాడు నారాయణ.

నారాయణకి చెప్పలేని ఆరాటంగా వుంది. చల్లటి ఫానుగాలి కింద పడుకున్నా వొళ్ళంతా వేడెక్కినట్టుగా వుంది. షర్టు విప్పి స్టాండుకి తగిలించాడు. పంకా జోరు హెచ్చించాడు. కిటికీలకున్న పరదలన్నీ పూర్తిగా పక్కకి తోశాడు. గది తలుపులు దగ్గరగా వేసి లైట్‌స్విచ్ ఆఫ్ చేశాడు. పలచని వెన్నెలలా బ్లూ లైట్ కాంతి గదంతా పరుచుకుంది. మెత్తగా వున్న పరుపుమీద వెల్లకిలా పడుకున్న నారాయణ తలలో పైన తిరుగుతున్న పంకాలాగా గిరిగిర ఎన్నెన్నో ఆలోచనలు తిరిగిపోతున్నాయి.

పొద్దుటే లేచి స్నానంచేసి షాపుకి వెళ్ళి గడ్డం చేయించుకోవాలి. చాకలివాడి దగ్గరికి వెళ్ళి వాడి మొహాన ఈ మురికి బట్టలు పారేసి, వాడి దగ్గరున్న ఇస్త్రీ బట్టలు జత తీసుకోవాలి తొమ్మిది గంటలకల్లా సత్యన్నారాయణని కూడా వెంటబెట్టుకుని ఆ చిట్‌ఫండ్ కంపెనీకి వెళ్ళాలి. వాళ్ళకి సెక్యూరిటీ డబ్బు కట్టేసి వెంటనే పనిలో జేరిపోవాలి. ఒక్కనెల ఆగుతే జీతం చేతికి వస్తుంది. అందులో ఒక్కరూపాయయినా ఖర్చుపెట్టకుండా తీసుకువెళ

గిరిజ చేతిలో పెట్టాలి. తను కాస్త నిలదొక్కుకునేవరకు గిరిజని ఉద్యోగం చెయ్యనిస్తాడు. ఆ పైన గిరిజని హాయిగా విశ్రాంతి తీసుకోమని చెపుతాడు. సుషమకి మళ్ళీ వచ్చే పుట్టినరోజుకి అచ్చు అలాటిదే గొలుసు చేయించి ఇవ్వాలి. తను వస్తులుండయినా సరే ఆ పని చెయ్యాలి.

నారాయణకి గొలుసు గుర్తురాగానే చటుక్కున లేచి కోటుస్టాండు దగ్గరికి వెళ్ళాడు. తన షర్టు జేబులో వున్న పర్సుని తీసుకువచ్చి దిండుకింద భద్రంగా దాచాడు. కళ్ళు మూసుకుని కలల్లోకి జారిపోయాడు.

## 31

చలపతి గణగణ మ్రోగిన అలారం మోత విని ఉద్రేకంగా లేచి కూర్చున్నాడు. రోజూ పదిగంటలయితే తప్ప చలపతికి తెల్లవారదు. నారాయణ ఆరు గంటలకల్లా మేలుకొలపమని చెప్పటంతో, అలారం సెట్ చేసి పెట్టాడు.

చలపతి తలుపులు తోసుకుని నారాయణ నిద్రపోతున్న గదికి వెళ్ళాడు. గది ఖాళీగా వుంది. అరే అప్పుడే వెళ్ళిపోయాడా అనుకుంటున్న చలపతి కళ్ళలో స్టాండుకు తగిలించి ఉన్న నారాయణ వస్త్రం కనబడింది. 'ఓహో, బాత్‌రూంకి వెళ్ళి వుంటాడు' అనుకుంటూ వెనుదిరగబోతున్న చలపతి ఎందుకో ఆగిపోయాడు. మంచంమీది దిండుకిందనించి ఏదో నల్లగా కనబడటంతో, చలపతి దగ్గరగా వెళ్ళి దిండు ఎత్తి చూశాడు. పర్సు. చలపతి చేతిలోకి తీసుకుని అప్రయత్నంగా తెరిచాడు! పర్సునిండుగా వందరూపాయల నోట్లు. చలపతికి నిద్రమత్తు వదిలిపోయింది. పెళపెళ లాడుతున్న వందరూపాయల నోట్లు కొత్తపెళ్ళికూతుళ్ళలాగా అణిగి మణిగి కూర్చున్నట్టుగా వున్నాయి పర్సులో.

చలపతి కొన్ని నెలలనుంచీ అంత డబ్బు ఒక్కసారిగా చూడటమే గగనమయిపోతోంది. చలపతికి అణిగివున్న కోరికలన్నీ ఒక్కసారిగా విజృంభించాయి. రేసులకి వెళ్ళి కొన్ని నెలలవుతోంది. పేకాట ఆడి కొన్ని రోజులవుతోంది. సిగరెట్లకి వెతుక్కోవాల్సి వస్తోంది. మరింకెన్నో అవసరాలు అతి బలవంతాన నిగ్రహించుకుంటున్నవన్నీ చెలియలికట్ట దాటిన కడలి తరంగాల్లా, ఉరుకులు పరుగులతో తోసుకురాసాగాయి. చలపతి ఒక్క క్షణం సందేహించాడు. తనేం పేదరికంవల్ల ఈ పని చెయ్యటంలేదు. పరిస్థితుల ప్రభావంవల్ల తన దగ్గర డబ్బుకి కటకటగా వుందిగానీ తలిదండ్రులకి తనొక్కడే కొడుకు. ళ్ళకివున్న లక్షలాస్తి తనదే. ఈ రోజు కాకపోతే రేపయినా తనేగదా

వారసుడు. వాళ్ళ కోపం తగ్గకాపోదు. తను ఆస్తికి హక్కుదారు కాకనూ మానడు అప్పుడు దీనికి రెండు రెట్లు నారాయణకి ఇచ్చేస్తాడు. కావాలంటే క్షమాపణ కూడా చెప్పుకుంటాడు.

చలపతి తను చేస్తున్న పనిని తనే సమర్థించుకోసాగాడు. నోట్లని తీసి తన జేబులో కుక్కుకుని ఖాళీపర్సుని తలగడకింద వుంచి, పిల్లిలా గది తలుపులు మూసి, తన గదిలోకి వెళ్ళిపోయాడు.

## 32

నారాయణ స్నానంచేసి వచ్చి బట్టలు వేసుకుని, దిండుకిందనించి పర్సు తీసి జేబులో పెట్టుకున్నాడు. చలపతి గదిదగ్గరికి వచ్చి తలుపుతట్టాడు.

"ఎవరది ?" చలపతి ఆవలిస్తూ లేచి వచ్చి తలుపుతీశాడు. ఎదురుగా నారాయణని చూస్తూనే "హలో, ఆరింటికి లేపమన్నావు కదూ! సారీ బ్రదర్. పదవుతేనేగానీ నాకు తెల్లవారినట్లుండదు" అంటూ నవ్వాడు.

"పోనీలే. నాకు ఐదింటికే మెలకువ వచ్చేసింది."

"రా, కూర్చో, కాఫీ తీసుకుందాం" అంటూ చలపతి నౌకర్ని పిలిచాడు.

"వద్దులే చలపతీ! నేను బయట తీసుకుంటాలే" అన్నాడు నారాయణ

"ఏమిటి ఇంత పొద్దున్నే నువు చేసే రాచకార్యం. కాఫీ తాగటానిక్కూడా టైము లేదంటావు ?" చలపతి మంచంమీద కూర్చుంటూ అడిగాడు.

"ఇవాళ నా జీవితంలో ఎంతో విశేషమయిన రోజు చలపతీ."

చలపతి సిగరెట్ వెలిగిస్తూ ఆగి ఆశ్చర్యంగా చూశాడు.

నౌకరు లోపలికి వచ్చాడు. కాఫీ, టిఫిను తెమ్మని చెప్పాడు చలపతి.

"ఊం, ఇంతకీ విశేషం ఏమిటో చెప్పలేదు." వలయాలుగా తిరుగుతున్న సిగరెట్ పొగలోంచి చూస్తూ అడిగాడు చలపతి.

ఈ రోజు నేను ఉద్యోగంలో చేరబోతున్నాను చలపతీ. ఇవాళనించి నా జీవితంలో మరో అధ్యాయం ప్రారంభం కాబోతోంది."

నారాయణ సంతోషాన్ని ఇట్టే పసికట్టేశాడు చలపతి.

"గుడ్. అయితే డబ్బు దొరికిందన్నమాట. దీనికోసమేనా నన్ను అడిగావు వారంరోజుల క్రిందట ?"

"అవును. డబ్బు దొరికింది." నారాయణ కిటికీలోంచి పడుతున్న సూర్య కిరణాలని చూస్తూ మెల్లగా అన్నాడు.

నౌకరు వేడి ఇడ్లీ, కాఫీలు తీసుకువచ్చాడు.

నారాయణ టిఫిను తిన్నాడు. చలపతి కాఫీ తాగుతూ తోటలో విరగ బూసిన పూలచెట్లని చూస్తున్నాడు.

నారాయణ కాఫీ పూర్తిచేసి టేబిల్ మీదనున్న గడియారంవైపు చూశాడు. ఏడుగంటలు దాటింది.

"చాలా థాంక్స్ చలపతీ."

"నువ్వు మాటి మాటికీ థాంక్స్ చెప్పకురా బాబూ, బదులుచెప్పే అలవాటు నాకు లేదు."

నారాయణ నవ్వుతూ లేచి నిలబడి ఒక అడుగువేసి ఆగిపోయాడు.

"చలపతీ! నువు మరో సహాయం చెయ్యాలి."

"ష్యూర్ చెప్పు."

"మనం ఏ పనయినా మొదలుపెట్టేటప్పుడు నలుగురి శుభాశీస్సులు వుంటే ఆ పని జయప్రదం అవుతుందని మా అమ్మ అంటూ వుంటుంది. ప్రస్తుతం నా దగ్గరవున్న మిత్రుడివి నువ్వొక్కడివే గాబట్టి ఆ పెద్దరికం నువు పుచ్చుకోవాలి" అన్నాడు నారాయణ.

చలపతి మంచం దిగి వచ్చి నారాయణ భుజంమీద చెయి వేశాడు. "విష్ యూ ఆల్ ద బెస్ట్ ఆఫ్ లక్ మై డియర్ ఫ్రెండ్. దిసీజ్ మై సిన్సియర్ విష్ గుడ్ లక్."

చలపతి గొంతులో ఏదో అడ్డుపడినట్టయింది. అంతరాంతరాల్లో ఏదో సన్నటి బాధ. సూటిగా నారాయణ మొహంలోకి చూడలేనట్టుగా పక్కకి చూస్తూ మెల్లగా అన్నాడు.

"థాంక్యూ వెరీమచ్." నారాయణ చలపతి చేతిని నొక్కి వదిలేశాడు.

"వస్తా చలపతీ" అంటూ నారాయణ గది బయటకి రాగానే వసుంధరాదేవి ఎదురొచ్చింది.

నారాయణ నమస్కారం చేశాడు. ఆవిడ చిరునవ్వుతో తలవూపింది

"మమ్మీ!నారాయణ ఇవాళ ఉద్యోగంలో చేరబోతున్నాడు." వెనకగా వచ్చిన చలపతి చెప్పాడు.

"చాలా సంతోషం నారాయణా! ఈ పని ఎప్పుడో చెయ్యవలసింది. పోనీలే. ఇప్పటికయినా తెలుసుకున్నావు" అందావిడ చలపతివైపు చూస్తూ.

"ఈ బుద్ధి నీకు ఎప్పటికి వస్తుందో నాయనా ?" అన్నట్టుగా వున్న ఆ వా చూపుని తప్పించుకుంటూ చలపతి ఎటో చూడసాగాడు.

"నేను బయల్దేరగానే మీరే ఎదురొచ్చారు. నా కెంతో సంతోషంగా వుందండీ," అన్నాడు నారాయణ అతనికి చటుక్కున తల్లి గుర్తుకి వచ్చింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగినట్లయింది.

ఆవిడ నవ్వింది. "శుభంగా వెళ్ళి జేరు నారాయణా" అందావిడ

నారాయణ ఆ యిద్దరి దగ్గరా శలవు తీసుకుని అప్పుడే తెరుస్తున్న బార్బర్ షాపులో దూరి గడ్డం చేయించుకున్నాడు. డబ్బులివ్వటానికి పర్సు తెరవబోతూ అందులోని వందరూపాయల నోట్లు, షాపువాడి కంటబడటం ఎందుకు అన్నట్టుగా గోడవైపు తిరిగి, పర్సుని కిందుగా పట్టుకుని చిల్లరవుండే అరలో చెయ్యి వుంచి ఒర్ధరూపాయి తీసి చటుక్కున పర్సుమూసి జేబులో పెట్టుకున్నాడు షాపువాడికి డబ్బులిచ్చి సరాసరి చాకలివాడింటికి వెళ్ళాడు. వాడి దగ్గరున్న బట్టల్లోంచి నారాయణ తన షర్టు, పేంటు తీసుకుని అక్కడే బట్టలు మార్చుకుని, విప్పినవి షాపులోనే పడేసి బయలుదేరాడు. వాడుక చాకలి గనుక వాడికి డబ్బు ఇవ్వవలసిన అవసరం లేకపోయింది.

'సత్యంగారూ' అంటూ నారాయణ వెళ్ళేసరికి సత్యన్నారాయణ అప్పుడే తయారవుతున్నాడు కొట్టు తెరవటానికి.

"రా, పొ పొ పొద్దున్నే వచ్చావే?" అన్నాడు.

"నాతోబాటు మీరుకూడా ఆ కంపెనీకి రావాలండీ వాళ్ళు మీకు బాగా తెలిసినవాళ్ళు. నాకంతా కొత్త" అన్నాడు నారాయణ

సత్యన్నారాయణ పెద్దగా నవ్వాడు. "క క కంపెనీ ప ప పదిగంటలగ్గాని తె తె తెరవరయ్యా" అన్నాడు.

"పోనీ లెండి ఆ టైముకే వెళదాం. ఈలోపల మీరు కొట్టుపని చూసుకోండి, అన్నాడు.

"మ మ మరి డబ్బు?" అసలయింది వుందా లేదా అన్న సందేహం వచ్చింది సత్యన్నారాయణకి.

"వుంది లెండి తెచ్చాను." జేబులోని పర్సుని తట్టుతూ అన్నాడు.

సత్యన్నారాయణా, నారాయణా కలసి వెళ్ళి తాళ్ళకొట్టుని తెరిచారు తొమ్మిది గంటలయ్యేవరకు కొట్టుమీదే గడిపారు. సత్యన్నారాయణ తెప్పించిన కాఫీ తాగాడు నారాయణ.

పదిగంటలవుతూండగా, ఇద్దరూ బయలుదేరి చిట్‌ఫండ్ కంపెనీకి వచ్చారు. అక్కడి మేనేజరు సత్యన్నారాయణకి బాగా పరిచయం వున్నవాడు. నారాయణని

పరిచయం చేశాడు. ఫార్మాలిటీస్ పూర్తయి ఫారమ్‌తోబాటుగా డబ్బు చెల్లించటానికి పర్సుతీశాడు నారాయణ . నోట్లుపెట్టిన అరలోవున్న జిప్ ఓపెన్‌చేసిన నారాయణ వెయ్యివేల ఓల్టుల షాక్ తగిలినట్టుగా అలాగే నిలబడిపోయాడు. ఊపిరి ఆడుతోందా లేదా అన్న అనుమానం వచ్చింది ఎదురుగా వున్నతనికి.

నారాయణ వాలకంచూసి సత్యన్నారాయణకి ఏదో అనుమానం వచ్చింది. దగ్గరగావచ్చి భుజంమీద చెయ్యివేస్తూ, 'నారాయణా' అంటూ పిల్చాడు.

నారాయణనికి ఒక్కసారిగా స్పృహ కలిగినట్టయింది. కంగారుగా పర్సులోని ఒక్కొక్క అరే గాలించేస్తున్నాడు. చేతులు వొణుకుతున్నాయి. కళ్ళు వర్షించటానికి సిద్ధంగావున్న మేఘాల్లా వున్నాయి మొహమంతా చిరుచెమటలు అలుముకున్నాయి.

నారాయణ కాళ్ళల్లో వున్న శక్తి హరించిపోయినట్టుగా ఎదురుగావున్న బల్లమీద కూర్చుండిపోయాడు.

'ఏమయిదండీ' అంటూ మేనేజరు ప్రశ్నించాడు.

"డబ్బు కనిపించటం లేదండీ వెయ్యిరూపాయలు ఇందులోనే పెట్టాను." నూతిలోంచి వచ్చినట్టుగా వున్న నారాయణ మాటలకి ఆయన ఆశ్చర్యంగానూ, అనుమానంగానూ చూశాడు.

"మరోసారి గుర్తుతెచ్చుకోండి, మరెక్కడయినా పెట్టారేమో" అన్నాడాయన సత్యన్నారాయణ జాలిగా చూస్తున్నాడు నారాయణని.

నారాయణ కళ్ళుమూసుకుని అతికష్టంమీద ప్రొద్దుట తను నిద్రలేచిన క్షణంనుంచి, ఇప్పటివరకు జరిగిందంతా వివరంగా గుర్తుచేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు.

నారాయణకి మనసులోని ఆరాటంతో ఐదుగంటలకల్లా మెలకువ వచ్చింది. అయినా అరగంటపైగా కళ్ళుతెరుచుకుని మంచంమీదే పడుకున్నాడు. ఆరవుతుండగా లేచి కూర్చుని లైటువేశాడు. పర్సుతెరిచి చూసాడు అందులోని పదివందల రూపాయలనోట్లు భద్రంగా వున్నాయి. పర్సుమూసేసి యధాప్రకారం దిండుక్రిందనుంచి బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు పళ్ళుతోమి, స్నానంచేసి బయటపడేసరికి ఆరున్నర అయింది. బట్టలేసుకుని పర్సు జేబులో పెట్టుకుని చలపతితో కలిసి టిఫిను తీసుకున్నాడు. బార్బర్‌షాపులో అతిజాగ్రత్తగా ఎవరి కంటపడకుండా చిల్లరమాత్రం తీసి పర్సు జేబులో పెట్టుకున్నాడు చాకలికి డబ్బు ఇవ్వనేలేదు. తిరిగి పర్సు తెరిచింది ఈ క్షణంలోనే. డబ్బు మాయమయింది.

అంటే అంటే తను ప్రొద్దున చూసిన తరవాతనించీ ఈ మూడుగంటల లోపల డబ్బు మాయమయింది. అదీ పర్సు పర్సుగానే వుండి అందులోని నోట్లు మాత్రం మాయం అయ్యాయి. చిల్లరంతా యధాప్రకారంగానే వుంది. నారాయణ ఎంత ఆలోచించినా డబ్బు ఎలా మాయమయిందీ అర్థంకావటంలేదు. బాకలి దగ్గర బట్టలు మార్చుకునేటప్పుడుకూడా తను పర్సు ఎదురుగా పెట్టుకునే మార్చుకున్నాడు ఆ క్షణంలో ఆ గదిలో ఎవరూలేరు కూడాను. వెంటనే పర్సుని జేబులో పెట్టుకున్నాడు.

కళ్ళుమూసుకుని అదే ఆలోచిస్తున్న నారాయణకి ఒక విషయం రూఢి అయింది. తను బాత్‌రూమ్‌లోకి వెళ్లేటప్పుడు చూసినప్పుడు డబ్బు పర్సులోనే వుంది. పర్సును జేబులో పెట్టుకున్నతరువాత పోయే ఆస్కారంలేదు. అంటే తను స్నానంచేసి వచ్చేలోపల ఎవరో ఆ నోట్లని తీసుకుని వుండాలి. అవును తను పర్సు దిండుకిందవుంచి అరగంటపైగా బాత్‌రూమ్‌లో వుండిపోయాడు. జరిగిందేదో అప్పుడే జరిగివుండాలి.

నారాయణకి ఆ విషయం రూఢి అయ్యేసరికి గుండెలు టకటక కొట్టుకోవొచ్చి నాయి చలపతి ఇంట్లో ఎవరి పనయివుంటుంది? తను బాత్‌రూమ్‌లోవున్న సమయంలో ఎవరో గదిలోకి వచ్చివుండాలి. ఎవరయివుంటారు? నౌకర్లా? తను తలుపుతట్టినతరువాతే చలపతి నిద్రలేచి వచ్చి తలుపుతీశాడు. ఏకాగ్రతగా ఆలోచిస్తున్న నారాయణకి ఎక్కడో అలారం బెల్లులాటిది వినిపించింది మనసులో. జాగ్రత్తగా గుర్తుచేసుకున్నాడు. తను బాత్‌రూములోకి వెళ్లేసమయంలో ఎక్కడో అలారం మ్రోగినట్లుగా జ్ఞాపకం వస్తోంది నారాయణకి. చలపతిగదిలోనా? తను చలపతితో ఆరుగంటలకల్లా నిద్రలేపమని చెప్పాడు. చలపతి ఆరుగంటలకి అలారం పెట్టివుండాలి. తనని లేపటానికి వచ్చివుండాలి. తను బాత్‌రూమ్‌లో వున్నాడు. ఎదురుగా దిండుకింద పర్సు.

నారాయణ ఇంక ఆలోచించలేకపోయాడు. అంటే...అంటే...చలపతి... చలపతి. చలపతి అలాటిపని చేస్తాడంటే నారాయణకి నమ్మబుద్ధికావటంలేదు.

నారాయణకి ఒక్కొక్కటే గుర్తుకి వస్తున్నాయి. తను అప్పు అడిగినప్పుడు చలపతి డబ్బు లేదన్నాడు. తను రోడ్డుమీద ఎదురయినప్పుడు బోర్ కొట్టి వస్తున్నారాబాబూ అన్నాడు డబ్బులేనప్పుడే చలపతికి బోర్ కొడుతూ వుంటుంది అంటే చలపతి డబ్బు ఇబ్బందుల్లో వుండి వుండాలి. ఎదురుగా ఇంత డబ్బు చూసేసరికి మనసు చలించి వుండవచ్చు. నారాయణ చటుక్కున లేచి నిల్చున్నాడు. తను వెంటనే చలపతిని కలుసుకుంటేగానీ ఈ మిస్టరీ విడిపోదు.




నారాయణ చకచకా పరుగెత్తినట్టుగా బయటికి నడిచాడు. 'నా న్నా నారాయణా! ఎ ఎక్కడికి?' అంటూ సత్యన్నారాయణ వెనకనుంచి అరవటం నారాయణకి వినపడలేదు.

రన్నింగ్ రేస్‌లోలాగా పరుగెడుతున్నాడు నారాయణ. ఆయాసంవచ్చి రోడ్డు వారగా ఓ క్షణం ఆగాడు. ఎదురుగా కాస్మోపాలిటన్ క్లబ్బు, బయట ఏదో టాక్సీ ఆగివుంది. నారాయణకి చటుక్కున ఓ ఆలోచన వచ్చింది. క్లబ్బులో కనుక్కుంటే తెలుస్తుంది. చలపతి డబ్బు ఇబ్బందుల్లో వున్నదీ, లేనిదీను.

చటుక్కున నారాయణ దృష్టి క్లబ్బు లోపలినించి వస్తున్న వ్యక్తి మీదపడింది. చలపతి! మరో స్నేహితుడితో కలిసి టేక్సీదగ్గరగా వస్తున్నాడు.

'చలపతీ' అంటూ నారాయణ వేసిన కేకకి రోడ్డుమీద తిరుగుతున్న జనం అంతా తలలు తిప్పి వింతగా నారాయణకేసి చూశారు.

చలపతి టేక్సీలో కూర్చున్నాడు. టేక్సీ కదలబోతోంది. నారాయణ ఒక్క ఉదుటున రోడ్డుకి అడ్డంగా పరుగుతీశాడు, టాక్సీ ఎక్కడ కనుమరుగవుతుందో అన్నట్టుగా. వెనకనించి స్పీడుగా వస్తున్న కారుని చూడనేలేదు. 'కీచుమంటూ ఆగిపోయిన కారు బ్రేకులు, ఒక్క-క్షణం ఆలస్యంగా పనిచేశాయి. నారాయణ శరీరం నెత్తుటిమడుగులో తేలింది.

చుట్టూ జనం పోగయ్యారు. చలపతి, స్నేహితుడు టేక్సీదిగి కారుదగ్గరగా వచ్చారు. గుంపుని చీల్చుకుంటూ లోపలికి జొరబడిన చలపతి గుండెలు ఆగిపోతాయేమో నన్నట్టుగా చేత్తో గుండెల్ని నొక్కుకుంటూ నిలబడిపోయాడు

'నారాయణా' అన్నమాట వొణుకుతున్న నోట్లోంచి బయటికి రావటంలేదు. చలపతికి కళ్ళు తిరిగి వొళ్ళు తూలినట్లయింది. నారాయణ జేబులోంచి తొంగి చూస్తున్న ఖాకీపర్సు నెత్తుటి మడుగులో తేలుతోంది. చలపతికి స్పృహ తప్పినట్లయింది. పక్కనున్న స్నేహితుడి భుజంమీద తలవాల్చి కళ్ళుమూసు కున్నాడు.

"చలపతీ! వాడు నారాయణరా, మన నారాయణ" అంటున్న స్నేహితుడి పిలుపు చలపతికి వినపడలేదు స్నేహితుడు కంగారుగా చలపతిని చేత్తో పొదివిపట్టుకుని జనంలోనించి ఇవతలకి లాక్కువచ్చాడు. భళ్ళున వాంతి చేసుకున్న చలపతి రోడ్డుమీదే కుప్పలా కూలిపోయాడు.

## 33

సుందరయ్యగారు ఆ రోజే జ్వరం కాస్త తగ్గినట్టుగా వుండటంతో గదిలో కుర్చీవేసుకుని కూర్చున్నారు. ఎవరో మనిషి ఎదురుగా నిలబడటంతో తలఎత్తి చూశారు.

'ఎవరూ?' అన్నారాయన కళ్ళు చిట్లించి చూస్తూ.

"నేను నారాయణ ఫ్రెండునండీ" అన్నాడా మనిషి.

"ఊ, నారాయణ ఇంట్లో లేడనుకుంటా బాబూ" అన్నారాయన.

అతను సందేహిస్తూనే కబురు చల్లగా చేరేశాడు.

"నారాయణకి యాక్సిడెంటు జరిగిందండీ. హాస్పిటల్లో వున్నాడు" అన్నాడు మెల్లగా.

'ఆ' అంటూ తెరుచుకున్న సుందరయ్యగారి నోరు అలాగే వుండిపోయింది. వచ్చినతనికి కంగారుపుట్టింది.

'ఏవండీ' అంటూ గట్టిగా పిల్చాడు

సుందరయ్యగారు జవాబు చెప్పలేదు. నోరు మూతపడలేదు. కళ్ళు తెరిచి చూస్తూనే వున్నాయి.

శారద అతని కేకకు లోపల్నించి పరిగెత్తుకు వచ్చింది. అతను విషయం శారదకి చెపుతూ 'ఆయన అలా అయిపోయారేవిటండీ. కాస్త మాట్లాడించండి' అన్నాడు గాబరాగా.

శారద తండ్రి దగ్గరగా వచ్చి చేత్తో కదుపుతూ 'నాన్నా' అని పిలిచింది. ఆ కుదుపుకి ఆయనతల భుజంమీదికి వాలిపోయింది శారద ఘొల్లుమంది. గిరిజ, పార్వతమ్మగారు పరుగెత్తుకువచ్చారు. ఇరుగు పొరుగు చేరారు.

సుందరయ్యగారి శరీరంలోంచి ప్రాణవాయువు అనంతవాయువుల్లో కలిసిపోయిందని నిర్ధారణచేశారు.

రోధనతో నిండిపోయిన ఆ ఇంట్లో, ఏడుపురానట్టుగా చూస్తున్నది గిరిజ మాత్రమే. శంకరం సుందరయ్యగారి కొడుకులకు టెలిగ్రాములు ఇప్పించి గిరిజని తీసుకుని హాస్పిటల్‌కి వెళ్ళాడు. నారాయణని ఆపరేషన్ థియేటర్‌లోకి తీసుకువెళ్ళారు.

పరిస్థితి ప్రమాదకరంగా వుందని చెప్పారు డాక్టర్లు గిరిజ శంకరం ఆపరేషన్ థియేటరు బయట కూర్చుని వున్నారు. ఎప్పటికో తలుపులు తెరుచుకున్నాయి శంకరం, గిరిజ ఆత్రుతగా లేచి నుంచున్నారు.

"ఇప్పుడే ఏమీ చెప్పలేం" అంటూ డాక్టర్లు వెళ్ళిపోయారు.

పీడకలలాటి నెలరోజులు గడిచిపోయినాయి. నారాయణ బెడ్‌మీద పడుకుని వున్నాడు. కాళ్ళమీద దుప్పటి కప్పివుంది.

సాయంత్రం నాలుగు గంటలయింది. హాస్పిటల్ విజిటర్స్‌తో సందడిగా వుంది. నారాయణ బెడ్‌దగ్గర గిరిజ, శంకరం, చలపతి, సత్యన్నారాయణ వున్నారు.

"నారాయణా! రేపు డిశ్చార్జి చేస్తామన్నారు. ఇంటికి వెళ్ళిపోవచ్చు రేపు" అన్నాడు శంకరం.

నారాయణ విని మౌనంగా వూరుకున్నాడు.

"న్నా న్నా నారాయణా, నువు చా చా చాలా అదృష్టవంతుడివోయ్" అన్నాడు సత్యన్నారాయణ.

'ఇది అదృష్టమంటారా?' నారాయణ దుప్పటికప్పివున్న కాళ్ళవైపు చూస్తూ మెల్లగా నవ్వాడు.

ఆ నవ్వు అందరిగుండెల్ని పిండేట్టుగావుంది. గిరిజ కళ్ళు తుడుచుకుంది. సత్యన్నారాయణకి జాలివేసింది.

" కా కాలు పోయిందని బా బా బాధపడతావేంటి? పే పే ప్రాణంపోయుంటే ఏ ఏ ఏంజేసేవాడివి?" కోపంగా అభిమానంగా అన్నాడు సత్యన్నారాయణ

"హాయిగా వుండేది. అందరం అదృష్టవంతులం అయ్యేవాళ్ళం." నవ్వుతూనే

అన్నాడు నారాయణ. ఆ నవ్వులోని దిగులు, బాధ, చలపతి గుండెల్లోకి దూసుకుపోయింది. తలవంచుకున్నాడు.

"మీ అన్నయ్యలిద్దరూ నీ కాలు ఎలావుందో రాయమంటూ ఉత్తరాలు రాశారు" అన్నాడు శంకరం.

నారాయణ మౌనంగా విన్నాడు. సుందరయ్యగారి ఖర్మకాండలు పూర్తవ్వగానే, శలవులేదంటూ కొడుకులిద్దరూ వెళ్ళిపోయారు. తల్లినికూడా తమతో రమ్మన్నారు. హాస్పిటల్లో వున్న నారాయణని విడిచి వెళ్ళనంది.

నారాయణకి జరిగిన ప్రమాదానికి తానే కారణం అన్న మాట చలపతి గుండెల్లో నాటుకుపోయింది. మనిషి తీసిపోయాడు. మౌనంగా, దిగులుగా వుంటున్నాడు. అంతరాత్మ అనుక్షణం చేసే చీత్కారాలని భరించలేకుండా వున్నాడు. చలపతికి ఎన్నో చెడ్డగుణాలు వుండవచ్చు. కానీ అతనిలాటి నీచపు పని ఏనాడూ చేసి ఎరగడు. చేతినిండా ఎల్లవేళలా డబ్బు నిండుగా వుండేది. మాయచేసో, కల్లబొల్లి ఖబుర్లుచెప్పో సంపాదించేవాడు, తల్లిదగ్గరనుంచి. ఎలాటి దురదృష్టపు క్షణంలో తనకెలాటి ఆలోచనవచ్చిందో చలపతికే అనూహ్యంగా వుంది. ఆ కుటుంబానికి కలిగిన ఆపదకి, దుఃఖానికి తానే కారణం అన్న వ్యధ అతన్ని నిలవనీయకుండా చేసింది. అతనికి ఆ క్షణంలో ఒకే ఒక్క మార్గం కనిపించింది. జరిగింది జరిగినట్టుగా అక్షరం పొల్లుపోకుండా తండ్రిదగ్గర నివేదించుకున్నాడు.

రాజేశ్వర్రావుగారు కొడుకు చెప్పినదంతా విని బాధపడ్డారు. ఆయన ఎంతటి పక్కా వ్యాపారస్తులో, అంతటి ఉదారపురుషులు కూడాను.

చేతులు కాలిన తరువాత ఆయన మాత్రం చేయగలిగింది ఏముంది కనుక. రెండువేల రూపాయలు చలపతికి ఇచ్చారు. నారాయణకి నయం అయి ఇంటికి వచ్చేవరకు ఖర్చుపెట్టమని చెప్పారు.

ఈసారి చలపతి చేతికి డబ్బు ఇవ్వటానికి ఆయన సందేహించలేదు. మనుమల్ని చదువగలిగే నేర్పు ఆయనకి పుట్టుకతోనే అబ్బింది. కొడుకులోని పశ్చాతాపాన్ని ఆయన గ్రహించారు. అందుకే చలపతి చేతికి నిర్భయంగా డబ్బుని ఇవ్వగలిగారు.

విజిటర్స్ టైం అవటంతో ఒకొక్కరే మెలమెల్లగా వెళ్ళిపోతున్నారు. సత్యనారాయణ నారాయణకి ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు. శంకరాన్ని పంపటానికి గిరిజ వరండా వరకు వెళ్ళింది.

చలపతి ఈ అవకాశం కోసరమే వెనకగా ఆగిపోయాడు. నారాయణ దగ్గరగా వచ్చి, అతని చేతిని తన చేతిలోకి తీసుకుని 'నారాయణా' అంటూ పిల్చాడు.

నారాయణ తలెత్తి చూశాడు. చలపతి కళ్లు తడిగా వున్నాయి.

'నన్ను క్షమించు నారాయణా!' మెల్లగా అన్నాడు.

నారాయణ ఆప్యాయంగా చలపతి చేతిని నొక్కాడు. వేదాంతిలాగా నవ్వాడు మెల్లగా. అతనికిప్పుడు చలపతిమీద ఏవగింపు గానీ, కోపం గానీ లేదు. 'అంతా మర్చిపో చలపతీ. జరిగేది మన మంచికే అనుకుంటే గాని బ్రతకలేని మనుషులం' అన్నాడు నారాయణ.

చలపతి వెళ్ళిపోయాడు. గిరిజ లోపలికి వచ్చింది. నారాయణ మనసు ఆర్ద్రంగా వుంది. పిచ్చిది. తనని కావాలని చేసుకుని ఎన్ని అవమానాలు, ఎంత బాధ, దుఃఖాన్ని అనుభవించిందో.

'గిరిజా!' మెల్లగా పిల్చాడు నారాయణ.

గిరిజ దగ్గరగా వచ్చింది.

"నీకు చాలా అన్యాయం చేశాను గిరిజా." ఆమె మొహంలోకి చూస్తూ మెల్లగా అన్నాడు.

గిరిజ అతని కాళ్ళమీధ దుప్పటి సరిజేస్తూ "కష్టసుఖాలు మనుషులకేగదా వచ్చేది. బాధ ఎందుకు?" అంది.

"ఈ కుంటివాడితో జీవితాన్ని గడపగలవా గిరిజా?" అతని ప్రశ్న విని గిరిజ జాలిపడింది.

"ఈ కుంటితనం నాకే వచ్చివుంటే మీరేం చేసేవారు?" అతని జుట్టుని మెల్లగా సవరిస్తూ గిరిజ ఎదురుప్రశ్న వేసింది.

నారాయణ ముఖంలో సంతోషం చిందులేసింది. గిరిజ చేతిని అందుకుని కళ్ళమీద వుంచుకున్నాడు.

"గిరిజా! దేముడు చాలా పెద్దవాడు సుమా. నేను పెద్దవాడిగా వున్నంతకాలం నన్ను చల్లగా చూశాడు. మంచివాడిని అయిపోదామనుకుంటూ వుండగానే కుంటి వాడిని చేసేశాడు. చూశావా విచిత్రం!"

"బాగుంది తర్కం. అయితే ఈసారి మనకి పుట్టబోయే బాబుకి దేముడు అని పేరుపెడదామా?" అంది నవ్వుతూ.

నారాయణ గిరిజని పరీక్షగా చూశాడు. అంతవరకు అతను ఆ విషయాన్నే

గమనించలేదు. నారాయణ చూపుని ఎదుర్కొనలేక గిరిజ సిగ్గుతో తలవంచు కుంది.

* * *

కథ చెపుతూ గతంలోకి జారిపోయిన నారాయణ కొడుకు పిలుపుతో తిరిగి చూశాడు.

"చెప్పు నాన్నా. కథ చెబుతానంటూ మాట్లాడవేం? అప్పుడేమయింది ఆ అబ్బాయికి?" అంటూ అడుగుతున్నాడు సురేష్.

"ఆ అబ్బాయి శ్రద్ధగా చదివేవాడు కాదు. అందుకని బాగా చదువొచ్చేది కాదు. చదువు మధ్యలో ఆపేశాడు. వాడినేదయినా వుద్యోగం చెయ్యమనేవాడు వాళ్ళ నాన్న. ఆ అబ్బాయికి బద్ధకం ఎక్కువ. కష్టపడకుండా డబ్బు సంపాదించాలనుకున్నాడు. అందుకని బోలెడన్ని లాటరీ టిక్కెట్లు కొంటూ వుండేవాడు ఇంట్లోంచి డబ్బు తీసుకువెళ్ళి.కానీ ఆ అబ్బాయికి ఒక్కసారి కూడా ఒక్క రూపాయి అయినా రాలేదు. వాళ్ళ అమ్మ, నాన్న ఎప్పుడూ బాధపడుతూ వుండేవాళ్ళు ఆ అబ్బాయిని గురించి. వాళ్ళు పెద్దవాళ్ళు అయిపోయారు. అయినా ఆ అబ్బాయి కానీ సంపాదన లేకుండా తిరుగుతూ వుండేవాడు. అప్పుడేమయిందంటే?"

"ఏమయింది నాన్నా?" అంటూ సుషమ కూడా వచ్చి కూర్చుంది.

"ఏమయిందంటే? ఆ అబ్బాయికి స్నేహితులున్నారని చెప్పాకదూ. ఆ స్నేహితుకి ఒక చెల్లెలుండేది. ఆ అమ్మాయి ఇష్టపడి ఈ మొద్దబ్బాయిని పెళ్ళి చేసుకుంది." అప్పుడేమయిందంటే......

"ఏమయింది నాన్నా?" సుషమ తండ్రికి దగ్గరగా జరిగింది.

"ఏమయిందంటే అప్పుడు ఆ అబ్బాయికి, అమ్మాయికి ఇలాటి ఓ చిన్న అమ్మాయి పుట్టింది." అంటూ నారాయణ సుషమని దగ్గరగా తీసుకున్నాడు.

కథ వింటున్న గిరిజ నవ్వింది సురేష్ కూడా నవ్వాడు సుషమ సిగ్గుపడింది. "పోండి నాన్నా. తరవాత చెప్పు" అంది కోపంగా.

"తరవాతేమయిందంటే? ఆ పాపాయికి పాలు పట్టటానికి కూడా డబ్బు వుండేది కాదు. అయినా ఆ అబ్బాయికి బుద్ధిరాలేదు. సంపాదన లేకుండా అలాగే తిరుగుతూ వుండేవాడు. అందుకని ఆ అమ్మాయి ఉద్యోగంలో చేరింది."

"ఆ అబ్బాయి చాలా చెడ్డవాడు కదా నాన్నా?" సుషమ మధ్యలో అంది.

"అవునమ్మా. చాలా చెడ్డవాడు! అప్పుడు ఒకరోజున ఆ అబ్బాయికి కారు ఏక్సిడెంటు జరిగింది."

"చచ్చిపోయాడా నాన్నా?" సురేష్ ఆత్రంగా ప్రశ్నించాడు.

"చచ్చిపోలేదు. కానీ ఆ అబ్బాయి కాలు పోయింది. కుంటివాడయిపోయాడు. ఆ ఖబురు వింటూనే వాళ్ళ నాన్న కాస్తా చచ్చిపోయాడు. ఆ అబ్బాయి దిగులుతోనే వాళ్ళమ్మ కూడా చచ్చిపోయింది."

"తరవాత ఏమయింది నాన్నా?"

"మరి ఆ అబ్బాయేమో కుంటివాడుగదా! బయటికి వెళ్ళి పని చెయ్యలేడు. పని చెయ్యకపోతే డబ్బురాదు. అందుకని అప్పుడు ఆ అమ్మాయేమో ఆ అబ్బాయికి ఒక సలహా చెప్పింది. టైపు నేర్చుకోమని చెప్పింది. ఆ అమ్మాయే సంపాదించి అందరినీ పోషించేది. ఆ అబ్బాయి స్నేహితులు కూడా చాలా సహాయం చేసేవాళ్లు. కొన్నాళ్ళయ్యాక ఆ అబ్బాయి టైపు చెయ్యటం బాగా నేర్చుకున్నాడు. కొంచెం కొంచెంగా డబ్బు సంపాదించటం మొదలుపెట్టాడు. అప్పుడేమో ఆ అమ్మాయి బి.ఎ చదివి పాసయింది. టీచరు ట్రెయినింగు కూడా అయింది. హైస్కూల్లో టీచరుగా చేరింది. మరి మధ్యలో వాళ్ళకి ఇంకో అబ్బాయి కూడా పుట్టాడు" అంటూ ఆగాడు నారాయణ.

"అప్పుడేమయింది?" సురేష్ ప్రశ్న.

"కథ కంచికి మనం ఇంటికి. సురేష్ నేనొకటి అడుగుతా చెపుతావా?" అన్నాడు నారాయణ.

"ఓ" తలెగరేశాడు సురేష్.

"మరి ఆ అబ్బాయికీ, అమ్మాయికి యిన్ని కష్టాలెందుకని వచ్చాయిరా. చెప్పు చూద్దాం?" అన్నాడు నారాయణ.

"ఆ అబ్బాయి చాలా చెడ్డవాడు నాన్నా." ఠక్కున సమాధానం చెప్పాడు సురేష్.

"ఎందుకని చెడ్డవాడురా?"

వాడికి జవాబు తట్టలేదు.

"ఎందుకంటే? ఆ అబ్బాయి చదువుకోవాల్సిన వయసులో చదువుకోలేదు. ఉద్యోగం చెయ్యాల్సిన వయసులో ఉద్యోగం చెయ్యలేదు. కష్టపడి పనిచెయ్యకుండా లాటరీల్లో లక్షలు సంపాదించాలనుకునేవాడు. అందుచేతే వాళ్ళ అమ్మ, నాన్న చచ్చిపోయారు వాళ్ళకి అన్ని కష్టాలు వచ్చాయి. అవునా?"

అవునన్నట్టుగా సురేష్ తల వూపాడు.

"అందుకని నీది ఇప్పుడు చదువుకునే వయసు. ఇప్పుడు బాగా చదువుకుంటే మంచి ఉద్యోగం వస్తుంది. బోలెడంత డబ్బు సంపాదిస్తావు. అప్పటికి నువ్వు పెద్దవాడివి అవుతావు. నీకు తెలివితేటలూ, బుద్ధీ పెరుగుతాయి. నువ్వు సంపాదించేటప్పుడు నీకు మంచిదని అనిపిస్తే అప్పుడు లాటరీ టికెట్లు కొందువుగానీ. లాటరీలు మంచివికాదు అనిపిస్తే మానేద్దువుగాని. సరేనా?"

సురేష్ ఓ క్షణం ఆలోచించి తలూపాడు అంకీకారసూచకంగా. నారాయణ సురేష్‌ని దగ్గరకి తీసుకున్నాడు. "మరి ఇప్పుడు రూపాయి ఇవ్వమంటావా అమ్మని?" అన్నాడు.

"ఉహు. మా మాష్టారు కూడా కేకలేస్తారు" అన్నాడు వాడు.

"గుడ్ బాయ్" నారాయణ కొడుకు భుజం తట్టాడు.

శంకరం, భార్య తలుపు తోసుకుని లోపలకు వచ్చారు. గిరిజ సంభ్రమంగా ఎదురు వెళ్ళింది.

"హైదరాబాదునించి ఎప్పుడు వచ్చారన్నయ్యా? కూర్చో వదినా" అంటూ మర్యాదచేసింది.

"రాత్రే వచ్చామమ్మా! బాగున్నారా అంతా?" శంకరం సురేష్‌ని దగ్గరకి తీసుకుంటూ అడిగాడు.

"ఈ పదిరోజులకే గిరిజ నీ మీద బెంగపెట్టుకుంది శంకరం. రోజూ క్యాలెండరు చూడటమే. పదిహేనో తారీఖు ఎప్పుడొస్తుందా అని?" నారాయణ నవ్వాడు.

"శంవు పదిరోజులన్న పేరే గానీ క్షణంలో గడిచిపోయిందనుకో. హైదరాబాదులో ఆరు రోజులున్నాం; రెండు రోజులు నాగార్జునసాగర్ తిరిగి యథాస్థాన ప్రవేశయామి."

"శారద వదిన కులాసాయేనా?" గిరిజ వదినగారిని అడిగింది.

"బాగానే వున్నారు ఎప్పుడూ మిమ్మల్నే తలుస్తూ వుంటుందావిడ" అంది శంకరం భార్య.

"గోపీ వుద్యోగం కోసరం అని ఆవిడ తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చింది గానీ, ఆవిడ వెళ్ళిపోయాక మాకూ్కూ-ాా ఇల్లంతా చిన్నబోయింది," అంది గిరిజ దిగులుగా.

శంకరం చేతిలో వున్న పాకెట్ విప్పి అందమయిన హేండ్‌బ్యాగ్ సుషమకి, మౌత్ ఆర్గన్ సురేష్‌కి ఇచ్చాడు.

"ఇవి చలపతి మావయ్య మీకివ్వమని పంపిదాడ్రా" అన్నాడు శంకరం.

"చలపతి బావున్నాడా శంకరం?" నారాయణ అడిగాడు.

"వాడికేం, పెళ్ళికొడుకులాగా వున్నాడు. హైదరాబాదు వెళ్ళాక పక్కా బిజినెస్ మాన్ అయిపోయాడు. ఇప్పుడు వాళ్ళ నాన్న బిజినెస్సంతా వాడే చూస్తున్నాడు. మిమ్మల్నందరినీ శలవుల్లో హైదరాబాదు రమ్మని మరీ మరీ చెప్పాడు" అన్నాడు శంకరం.

శంకరం భార్య హేండ్‌బ్యాగ్‌లోంచి అందమయిన రెండు పెన్నులు తీసి సుషమకి ఒకటి, సురేష్‌కి ఒకటి ఇచ్చింది.

"ఇవి మీ మావయ్య ప్రెజంటేషన్. తీసుకోండి" అంది.

పెన్నులు చూడగానే గిరిజకి ఇదివరకటి సంగతులు గుర్తుకొచ్చినాయి.

"అన్నయ్యా! వదినకి రోజుకెన్ని పెన్నులు కొనిస్తున్నావు?" అంది నవ్వుతూ.

గిరిజ అడిగిందేమిటో శంకరానికి అర్థంకాలేదు.

"ఏవిటమ్మా? పెన్నులేవిటి?" అన్నాడు.

"మామ్మ బ్రతికిఉండగా నేనెప్పుడూ పెన్నులు పాడుచేస్తానని కేకలేసే వాడివి. కొత్తపెన్ను కొని ఇమ్మంటే రచయిత్రివి అవుతావా అంటూ భయపడి పోయేవాడివే పాపం? మరిప్పుడు మా రచయిత్రి వదినగారిని ఎలా చేసుకున్నావు?" అంటూ నవ్వింది గిరిజ.

"అరే మీ అన్నయ్యకి రచయిత్రులంటే అంత భయం వున్న సంగతి తెలియదే!" శంకరం భార్య మాటలకి అంతా నవ్వారు.

శంకరం భయం నటించాడు. ఇలాటివన్నీ బయటపెట్టెయ్యకే గిరిజా. మీ వదిన మన కథ రాసెయ్యగలదు.

"ఓహో అయితే అన్నా చెల్లెళ్ళు అంతటి గ్రంథసాంగులన్నమాట." నవ్విందావిడ.

"నువ్వన్నమాట నిజమేనన్నయ్యా. 'వీళ్ళ'తో వేగలేం."

గిరిజ వదినగారిని చూసి కొంటెగా అన్న మాటకి అందరూ ఫక్కున నవ్వారు. నవ్వులు పువ్వుల జల్లులై రాలినాయి.

———

# పచ్చపావడా

## కె. లలితాచలం

"పండగొస్తుంది, అమ్మాయినీ, అల్లుడ్నీ తీసుకురా" అంది అమ్మ నాన్నతో. పండగన్న మాట వినగానే ముసిముసిగా నవ్వుకుంటూ మురిసిపోయింది మువ్వ. సంతోషం పట్టలేక ఉబ్బి తబ్బిబ్బయిపోయింది. మువ్వకి పండగంటే సంబరం. తనని కిందటి సంవత్సరం బళ్ళో చేర్చేటప్పుడు అమ్మ చెప్పింది, "చక్కగా పంతులు చెప్పినట్లు చదువుకోవాలి. బాగా చదువుకుంటే నీకు పచ్చ పావడా కొంటాను" అని.

మువ్వకి పచ్చపావడా అంటే ఎంతో ఇష్టం. మువ్వ బళ్ళో చేరాక అక్షరాల కంటే తొందరగా మూడు నాలుగు పండుగలొచ్చేశాయి. ఒక పండక్కి అమ్మ "డబ్బులు లేవే మువ్వా, మళ్ళొచ్చే పండక్కి పచ్చపావడా కొంటాగా !" అంది చీరకి మాసికలు కుట్టుకుంటూ. మళ్ళీ పండగ పైసలకోసం ఆగకుండా చకచకా వచ్చేసింది. కాని మువ్వ పచ్చపావడా కొనడానికిదాచినడబ్బంతా ఇల్లంతా కురుస్తున్న వానకి గొడుగుగా తాటాకులు కొనడానికే సరిపోయాయి.

వాన కురిస్తే నీ పచ్చపావడా తడిసిపోతుందని ఇల్లు కప్పుతున్నాడు అయ్య. మళ్ళీ పండక్కి పావడా కుట్టిస్తాగా !" అంది అమ్మ మువ్వని బుజ్జగిస్తూ. మువ్వకి పచ్చపావడా తడిసిపోతుందని భయమేసింది. అందుకే అమ్మతో మరి ఆ పావడా సంగతి అనలేదు. పండగ కోసం. పావడాకోసం ఎదురు తెన్నులు చూసింది మువ్వ. మరో పండగ వచ్చింది. అప్పుడు మువ్వకి చాలా జ్వరం వచ్చింది. అప్పుడే అక్కకి కూడా పెళ్లైపోయింది. అక్కంటే మువ్వకి ఎంతో ఇష్టం – జ్వరం తగ్గేటప్పటికి బావ అక్కని, తీసుకుని ఊరెళ్ళిపోయాడు. బావంటే మువ్వకి చాలా కోపం వచ్చింది. అక్క వెళ్ళిపోయినందుకు దిగులు దిగులుగా అనిపించింది. ఆ దిగులుతో మువ్వ కొన్ని రోజులు పావడా మాటే మరిచిపోయిం



చాలారోజుల తరువాత మళ్ళీ ఆ చిన్నారికి పావడా మాటే జ్ఞాపక
పండగొస్తోందని మువ్వ తల్లి చెప్పగానే, మొచ్చింది. గంతులు వేసుకుంటూ తల్లి

దగ్గరకు వచ్చింది. తల్లివంక బిక్కు బిక్కుమంటూ చూసింది. "అడగనా ? వద్దా ?" అన్నట్లుగా కొంచెం బెరుకు బెరుకుగా చూసింది. ఆగలేక, అణచుకో లేక అమ్మని అడిగేసింది. "అమ్మా ! పండక్కి పచ్చపావడా కొనవే" అని. అమ్మ ఏమని చెపుతుందో ! అని ఒళ్ళంతా చెవులు చేసుకుని రిక్కించి వింది. అమ్మ, మువ్వని దగ్గిరగా తీసుకుని ముద్దుపెట్టుకుని ముఖాన పడుతున్న చింపిరి వెంట్రుకలు సవరించింది. చిన్నగా నవ్వి,

"కొంటాలే. పచ్చపావడా తెమ్మని సాలెనరసిమ్మతో చెప్పాలే!" అంది. స్వాతి వానకోసం ఎదురు చూస్తున్న ముత్యపు చిప్పలా సంతోషంతో అమ్మ ఒళ్లో తల దూర్చేసింది మువ్వ గువ్వలా ముడుచుకుపోతూ.

"మరి పండక్కి అక్కా బావా, అత్తా మావా అందరూ వస్తారు. అప్పుడు .........." అమ్మ ఏవేవో చెప్పుకు పోతోంది. కాని మువ్వ చెవులకు అవేమీ వినిపించటంలేదు.

కళ్ళముందు పచ్చపావడా వచ్చి నిలిచింది. అమ్మ చెప్పిన మాట, ఆశమ్మ అమ్మే జీడిముక్కలాగా తియ్యగా అనిపించింది. గుడిగంటలు ఆగకుండా మోగుతున్నట్లనిపించింది. ఎంతో ఎత్తున కట్టిన గుడిగంటలు తను ఎగరకుండానే కొడుతున్నట్లుగా అనిపించింది. పూజారి పంతులు అడక్కుండానే ప్రసాదం పెట్టినంత సంబరపడిపోయింది మువ్వ. పరుగు పరుగున వెళ్ళి తన తోటి పిల్లలందరికీ చెప్పొచ్చేసింది. తనకు వచ్చపావడా రాబోతోందని గర్వంగా కళ్లు పెద్దవి చేసి చక్రాల్లా తిప్పుతూ చెప్పింది. మువ్వ కళ్ళలో పచ్చపావడా నాట్యం చేసింది. తనకు అమ్మ పచ్చపావడా కొన్నట్లూ, తను ఆ పావడా కట్టుకున్నట్టుగా, అందరూ తననీ తన పావడానీ చూస్తున్నట్లుగా మురిసిపోయింది గర్వంగా. పండుగకోసం, పావడాకోసం ఎదురు చూస్తోంది మువ్వ.

పండగ వస్తోందని, అమ్మ బూజులు దులిపింది. గోడలు మెత్తింది. ఈతాకుల చీపురు సున్నంలో ముంచి, వెల్లవేసింది. మువ్వ పేడ పోగుచేసుకొచ్చింది. అమ్మ ఇల్లంతా అలికింది. మువ్వ ముగ్గుగుల్ల తెచ్చింది. అమ్మ ఇల్లంతా చిగురు కొట్టింది. ముగ్గులు పెట్టింది. ఇల్లంతా పూసిన పొచ్చపొదులాగా ఉంది.

మువ్వ కనులలో కలలలో తిరిగే పచ్చపావడా ఇలలోకి వచ్చింది. మువ్వ ముందు నిలిచింది. అమ్మ చేతులో కొచ్చింది. అమ్మ బొందు పావడా కుట్టింది చేత్తో. మువ్వ అమ్మవంక, పావడా వంక, మార్చి మార్చి చూసింది. ఆ కళ్ళలో ఏదో తెలియని వింత కాంతి.

"పావడా వే సు కుం టే ఎంత

బాగుంటుందో !" అనుకుంది. మువ్వ, పావడా వంక ఆశగా చూస్తూ అమ్మ పక్కనే కూచుంది. మునివేళ్ళతో పావడా నలిపి తృప్తిపడింది. "కుడుతూ కుడుతూ అమ్మ పావడా పక్కకి పెడితే బాగుండును. దబుక్కున తొడుక్కుని చూడొచ్చు" అనుకుంది మువ్వ. కాని అమ్మ వెళ్ళలేదు. పావడా కుట్టి చెక్కపెట్టెలో పెట్టి గొళ్ళెం పెట్టింది. "పండుగనాడు తొడుక్కుందువుగాని ఏం" అని వెళ్ళిపోయింది.

"ఇంకా పండగెప్పుడే !" అంది మువ్వ అమ్మ వెనకాలే వెడుతూ. పండగని తిట్టుకుంటూ.

"అక్క, బావా వచ్చాక" అంది అమ్మ. అక్క వస్తోందనగానే పండగ మీద కోపం ఎగిరిపోయింది.

పండ గొచ్చేసింది. నాన్న, అక్కనీ బావనీ వెంటబెట్టుకుని వచ్చాడు. అక్క పొట్ట పెద్ద బానలా ఉంది. మువ్వకి నవ్వొచ్చింది అక్కని చూస్తే. కాని, అమ్మ చెప్పింది అక్కకి దేముడు పాపాయిని ఇస్తాట్ట. పాపాయంటే మువ్వకి చాలా ఇష్టం. అందుకే అక్క బుగ్గమీద పెద్ద ముద్దుపెట్టింది సంబరం పట్టలేక. అత్తా, మావా కూడావచ్చారు. అందరూ ఏవేవో కబుర్లు చెప్పుకున్నారు. నవ్వుకున్నారు.

అక్కకీ, అత్తకీ, బావకీ, మావకీ మువ్వ పావడా చూపించింది. అమ్మ ఎప్పుడు పావడా కట్టుకోమంటుందా ! అని ఇల్లు వదలకుండా అమ్మ కొంగు పట్టుకునే తిరిగింది మువ్వ.

నాన్న మామిడి కొమ్మలు తెచ్చాడు. గుమ్మాలకి తోరణాలు కట్టాడు అత్త గుమ్మానికి పసుపు పూసి తెల్లబొట్లు పెట్టింది. అక్క వాకిట్లో కళ్ళాపి జల్లింది. ఒంగలేకపోయినా, నక్షత్రాల్లా చుక్కలు పెట్టి ముగ్గులు కలిపింది. ముద్దబంతులు, ఊకబంతులు ఒడినిండా కోసుకొచ్చింది మువ్వ. అత్త దండలు గుచ్చింది అమ్మ, అక్కకీ అత్తకీ తల దువ్వి ముడివేసింది. మువ్వకి సవరం పెట్టి బంతిపూల జడ వేసింది. మెటిక విరిచి ముద్దుపెట్టుకుంది. నాన్న, బావ, మావయ్య ప్రమిదల్లో ఒత్తులు వేశారు. అక్క, అత్త, అమ్మ నూనె పోశారు. వెలిగించారు. అమ్మ దేముడికి పూజ చేసింది. దేముడికి పిండివంటలు పెట్టింది. అందరికీ కొత్తబట్టలు ఇచ్చి తను కూడా కట్టుకుంది.

మువ్వ పచ్చపావడా కట్టుకుని, పసుపుపచ్చని ముడిరవిక తొడుక్కుంది. తనను తాను పదే పదే చూసుకుని మురిసిపోయింది. ఆ దీపాల వెలుగులో ఇల్లంతా తిరిగింది. వీధంతా తిరిగింది. ఆడింది, పాడింది. పరవశించిపోయింది మురిపాల మువ్వ.

బావ టపాకులు కాల్చాడు. మువ్వకి

టపాకులన్నా చీకటన్నా, బూచాడన్నా చాలా భయం. అందుకే జీర్ణాడే పచ్చ పావడాని చేత్తో ఎత్తికుని దూర దూరంగా నిలబడింది. మువ్వ తలలో బంతులు, నల్లరేగడి గట్టున పూసిన బంగారు పువ్వుల్లా మెరిసిపోయాయి. నిండుపంటకు ఒరిగి ఊగుతున్న పంట చేనల్లే, నిండు చూలాలల్లే మువ్వ, పావడా బరువు మోయలేక బరువుగా నడుస్తుంటే, ఇంటిల్లిపాదికీ అమ్మవారల్లే కనిపించింది మువ్వ.

ఊరంతా పండగ. ఇంటింటా పండగ. ఎవరి కన్నుల్లో చూచినా ఆనందోత్సాహాలే. ప్రతిచోట, ప్రతి ఇంట, దీపాల తోరణాలు. ప్రతి మనసులో సంతోషం ఎగిరి ఎగిరి పడుతోంది సముద్రంలా.

ఆలనాడు సత్యభామ నరకాసురుణ్ణి చంపిందో లేదో! కాని, ఈనాడు తామే సత్యభామలైనట్లు, ఆ నరకాసురుణ్ణి తామే చీల్చి చెండాడినట్లుగా సంబరపడి పోయారు జనం. దీపావళి వెళ్ళి వారం అయినా వచ్చిన చుట్టపక్కాలతో ఇళ్ళు కళకళలాడుతూనే ఉన్నాయి. ఆ సంబరం తరగటంలేదు. ఎక్కడ చూచినా చిటచిటలు, పటపటలు.

మువ్వకి ఊరి సంబరం పట్టటం లేదు. తన లోకమే తనది. పచ్చ పావడా కట్టుకుని, గిరగిరా తిరిగి పావడాని బుట్టలాగా చేసి, అందులో కూచుని కిలకిలా నవ్వుతూ మైమరచి పోతోందిమువ్వ. ఆ పసికూల ఆనందానికి అవధులు లేవు మువ్వకి పావడాయే ప్రాణం.

పండుగ వెళ్ళి వారం వెళ్ళింది కాని అక్కా బావా, అత్తా మావా వెళ్ళలేదు. ఇల్లంతా సందడి. మనసంతా సంబరం. మువ్వ పావడా వారం తిరిగినా మువ్వని వదిలి నీటిముఖం చూడలేదు. మువ్వనే చుట్టుకుపోయింది. పావడాకి కూడా మువ్వంటే ప్రాణం కాబోలు.

చీకటి చుట్టుముట్టింది కారుబొగ్గులా. ఇంటింటి ముంగిటా దీపాలు వెలిగాయి.

అక్కడక్కడా ఇంకా టపాకుల ధుమధుమలు, చిటపటలు వినిపిస్తూనే ఉన్నాయి.

రివ్వున గాలి వీచింది. దీపాలన్నిటినీ ఆర్పేసింది. కారుచీకటి కమ్మేసింది. వాకిట్లో ఆడుకుంటున్న మువ్వకి భయం వేసింది. మెరుపు మెరిసి మాయమైంది. ఆ మెరుపు వెలుగులో ఏదో భయంకర మైన ఆకారాన్ని చూసింది మువ్వ. అమ్మ చెప్పిన బూచాడు జ్ఞాపకం వచ్చాడు. అంతే, మువ్వ భయంతో కెవ్వున కేకేసింది. "అమ్మా! బూచాడు. నాన్నా! బూచాడు ఎత్తుకు పోతున్నాడు," అంటూ అరిచింది. ఆ కేక అందరికీ వినిపించింది. ఇంటిల్లి పాదికీ వినిపించింది. మువ్వ తండ్రి పరుగు పరుగున వాకిట్లోకి వచ్చాడు.




కళ్ళు పొడుచుకుని చీకట్లోకి చూశాడు. చిట్టితల్లికోసం తడిమి చూశాడు. ఆ చీకట్లో దారీ తెన్నూ తెలియకుండా పిచ్చివాడిలాగా అటూ ఇటూ ఎటో పరుగులెత్తాడు, "మువ్వా మువ్వా" అంటూ. తాను వెలిగించిన దీపాలు తన కాళ్ళతోనే తొక్కాడు. తన ఇంటి ముందు ముగ్గు తొక్కాడు. తన చేతులతో ప్రేమగా పెంచిన మొక్కలు కసాసా కాళ్ళతోనే తొక్కి చంపేశాడు. 'మువ్వా, చిట్టితల్లీ!' అంటూ దిక్కులు పిక్కటిల్లేలాగా అరుస్తూ, ఆయాస పడుతూ, లేస్తూ పరుగులు తీశాడు. ఎక్కడో, "నాన్నా! నాన్నా" అన్న ఆర్తనాదం వినిపిస్తూనే తండ్రి కూతుళ్ళ మధ్య దూరం పెరిగిపోయింది.

వెలుగు చీకటిని మింగేస్తే, చీకటి వెలుగుని కప్పేస్తుంది. అది వారిద్దరి మధ్య కలకాలంగా జరుగుతున్న దోబూచులాట. చీకటిని చప్పరించి మింగేస్తూ వెలుగు తొంగి చూసింది. భళ్ళున తెల్లవారింది. మూసుకున్న కళ్ళు తెరిపించింది. ముందున్నది చూడ మన్నది. వెలుగును చూస్తే అందరికీ ఏదో ధైర్యం.

"రాత్రంతా ఎంత భయంతో గడిపిందో చిట్టితల్లి మువ్వ. తెల్లవారు తూనే ఒళ్ళు కదిలించింది. నెమ్మదిగా "అమ్మా" అంటూ మూలిగింది. ఒళ్ళంతా బరువు. ఒణుకు, భయం. కొద్దికొద్దిగా కళ్ళు తెరిచి చుట్టూ కలయ చూసింది మువ్వ. అదంతా కొత్త

ప్రదేశం. అది తను చిన్నప్పటినుంచీ తిరిగినచోటు కాదు. తను ఎంతో ప్రేమతో పెంచిన ముద్దబంతులు లేవు. అక్క పెట్టిన ముగ్గూ, అత్త దిద్దిన పసుపు కుంకం, నాన్న కట్టిన తోరణాలు, మావపెట్టిన దీపాలు అసలే లేవు. "మరి నే నెక్కడున్నాను? బూచాడింట్లోనా?" బూచాడు తలపులో కదలాడగానే మువ్వకు మరీ భయం వేసింది. గజగజలాడిపోయింది. గట్టిగా కళ్ళు మూసుకుని, పెద్దగా ఏడ్చింది. ఇంతలో పచ్చపావడా జ్ఞాపకం వచ్చింది కాబోలు నడుం దగ్గర తడిమి చూసుకుంది తన చిట్టిచేతులతో. పావడా చిరిగిపోయింది. చీలికలు వాలికలై పోయింది. మువ్వకు దుఃఖం ఆగలేదు. ఎలా? అమ్మ ఇచ్చిన కొత్తపావడా చిరిగిపోయింది. అమ్మ కొడితే? అమ్మ దగ్గరకు వెళ్ళడం ఎలా? పారిపోతా! అమ్మ దగ్గిరకి పోతా! వెక్కి వెక్కి ఏడ్చింది. పారిపోవాలని పెనుగు లాడింది. మువ్వని ఎవరో కట్టేశారు. "అమ్మా! అమ్మా!" అంటూ చాలాసేపు ఏడ్చింది. అలసిపోయింది మువ్వ. ఆకలేసింది. నెమ్మదిగా కళ్ళు నులుము కుని చుట్టూ చూసింది, కొంచెం ధైర్యం తెచ్చుకుంటూ.

తను చాలా ఎత్తున ఉన్నట్లుగా అనిపించింది. కిందకు చూసింది మువ్వ. అంతా జలమయం. దూరంగా మనుషులు కనిపించారు. అమ్మకోసం, నాన్నకోసం గొంతెత్తి పిలిచింది. చేతులు చాచింది. వత్తులు ఆరిపోయిన ప్రమిదల్లాగా జీవంలేని ఎన్నో శరీరాలతోపాటు అమ్మా నాన్నా కూడా మువ్వ కళ్ళ ముందునుంచే ప్రవాహంలో కొట్టుకు పోయారు. మువ్వతల్లిని మాత్రం పచ్చపావడా రక్షించింది. తాను చెట్టు కొమ్మకు చిక్కుకుని, మువ్వను తను గట్టిగా నడుముకు కౌగిలించుకుని పట్టుకుంది. మువ్వకు మిగిలింది చీలికలు వాలికలైన పచ్చపావడా. పచ్చపావడాకు మిగిలింది మువ్వ. వారిద్దరి అనుబంధం ఏనాటిదో!





# స్నేహం పవిత్రమైనది

కంఠంనేని రాధాకృష్ణమూర్తి

గోడ దూకాడు రామారావు. కాలేజీ రోజుల్లోని ఆటల ప్రావీణ్యం అతనికిప్పుడు ఉపకరించింది. వీధివేపు అంతా చీకటిగా ఉన్నా పెరటిలో మాత్రం వెల్తురు బాగానే ఉంది, వరండా బయట వెలుగుతున్న బల్బుద్వారా. ఆ మూల గుబురుగా ఉన్న సన్నజాజిపొద వెనక కొద్దిపాటి మసకతనం ఉండే చప్పున అటు నడిచాడు.

ఎక్కడా అలికిడిలేదు. వరండా అవతలగా తెరిచి ఉన్న గుమ్మంలోంచి డైనింగ్ టేబులుమీద స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రలు, బోర్లించినపళ్ళాలు,వాటర్ జగ్, గ్లాసులు మొదలైనవి కనిపిస్తున్నాయి.

పొదవెనక నిలబడి ఉన్న రామారావు గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. అతని కళ్ళనిండా భయం. కాళ్ళలో నిస్త్రాణ. రెండురోజుల క్రితం చేసిన భోజనం కావటంతో అతనికి తన శరీరమే భారంగా అనిపిస్తోంది.

దొంగతనం చేయటానికి వచ్చాడు అతనిప్పుడు. డబ్బు తస్కరిద్దామని కాదు. విలువైన ఆభరణాలకోసమూ కాదు. కేవలం తిండి, తిండిని దొంగిలించుదామని! రెండు రోజులనుంచీ పస్తులుంటున్న భార్యాబిడ్డల ఆకలిని తీర్చటంకోసం - న్యాయమైన రీతిలో ఆ పని చేయటానికి అవకాశాలు లేక, చాతకాక-అన్యాయంగానైనా సరే సంపాదించుదామని !! మధ్యతరగతి మనుష్యులు అతి హేయంగా భావించే చోరత్వానికి అయిష్టంగా, దిగులు దిగులుగా, భయం భయంగా...

కొద్దిసేపు తర్వాత గుండె దిటవు పర్చుకుని రామారావు మొండిధైర్యంతో ముందుకు కదలబోయి చటుక్కున ఆగిపోయాడు. లోపలి గదిలోంచి ఒక యువతి వరండాలోకి వస్తోంది. స్లీవ్‌లెస్ జాకెట్ ధరించి ఉందామె ఆరోగ్యంతో ఆమె శరీరం నవనవలాడుతూ కన్పిస్తోంది. ఖరీదైన యాపిల్ పండులా ఉందామె. ఆమె వెనకే మరో యువకుడు వచ్చాడు. అందంలోనూ ఆరోగ్యంలోనూ అతనామెతో పోటీ పడుతున్నాడు పైజమా, బనీను.

వాళ్ళిద్దరూ తననెక్కడ గమనిస్తారోనని భయపడ్డాడు రామారావు. కాని వాళ్ళగొడవలో వాళ్ళున్నారు.

"ఇన్నాళ్ళా మీరు కాంపుకుపోయి ఉండి వచ్చేదీ?" అంటోందామె.

"ఏంచేయను డియర్..." ఏమో అంటూ అతనామెను డైనింగ్ టేబులు వద్దకు నడిపించుకుపోయాడు.

వాళ్ళిద్దరూ టేబులుకు అటువేపున పక్కపక్కనే కుర్చీల్లో కూర్చున్నారు. రామారావుకు అభిముఖంగా.

ఇబ్బందిగా కదిలి మరింత పొదిగి నిలబడ్డాడు, రామారావు తన మొహం మీద వెల్తురు పడకుండా జాగ్రత్త పడుతూ.

గిన్నెమీద మూత తీసిందామె. రెండు ప్లేట్లలో తనకూ, అతనికీ ఏమో వడ్డించింది గరిటతో.

గుటకలు మింగాడు రామారావు.

వాళ్ళిద్దరూ నెమరేస్తున్నారు. ఒకరి నోటి కొకరు అందించుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు. ఒకవేపు ఒకళ్ళు ఆప్యాయంగా చూసుకుంటున్నారు.

ముచ్చట వేసింది రామారావుకు వాళ్ళను చూస్తుంటే. ఆ సమయాన తన భార్య గుర్తుకొచ్చింది. ఎండిపోయి పీలగా ఉంటుందామె. పెళ్ళయి ఎనిమిదేళ్ళు దాటిందిగాని ఏనాడూ తామిద్దరూ

ఈమాత్రం తీరికగా జంటగా కూర్చుని తినటమూ, కబుర్లాడటమూ జరగలేదు. ఆదర్శానికి పోయి పేదపిల్లని పెళ్ళి చేసుకున్నాడు కట్నం తీసుకోకుండా. తనవేపూ ఆమెవేపూ అంతా పెద్దసంసారాలు. మంది ఎక్కువా ఇళ్లుఇరుకూనూ. వివాహ ప్రారంభమైంది. దినాల్లో కూడా శృంగారమూ, తత్సంబంధమైన ఆనందమూ తానెరగడు, ఏదో అంతానిద్రపోతూరనిపించాక లేవటము, భార్య మెడ గిల్లటమూ, వెల్లాయిలో లేక మరదళ్ళో ఎక్కడ ఆలకిస్తారోనన్న భయంతో అతి జాగ్రత్తగా ఆ మొక్కుబడిని కాస్తా తీర్చుకోవటమూ తప్ప. నరాల అల్లరి ఆగిపోయేది. అంతే, మరే ఆనందమూ లభించేదికాదు. అంతకన్నా జంతువులు నయం ఏ ఇన్హిబిషన్సూ లేకుండా ఇంకా స్త సహజానందాన్ని అనుభవిస్తాయి...

అప్రయత్నంగా దవడలు గిట్టగరుచుకున్నాయి రామారావుకు. క్షణంపాటు అరణ్యన్యాయం అతని మెదడులో వైబ్రేటయింది. వాళ్ళిద్దరినీ ఖూనీచేసి ఆ ఇంటి నాక్రమించుకుని తనూ తన భార్యాపిల్లలూ కాపురంచేస్తే?! అవెంటనే ఉసూరుమన్నాడు, నాగరిక సమాజము, దాని సంకుచిత న్యాయసూత్రాలూ గుర్తుకువచ్చి.

ఆమె భర్త ఏదో అన్నట్లున్నాడు, ఆమె పగలబడి నవ్వుతోంది కుర్చీలో వెనక్కి జారగిలబడి. ఆమె పవిట జారిపోయి లోనెక్ లోంచి రొమ్ములు రెండూ కలుసుకున్న చోటు గుండెల్ని జలదరింపజేస్తుంది. అట్లాంటి సెన్సారు కాని దృశ్యాన్ని రామారావు అంతకు ముందెన్నడూ చూసిఉండలేదు. అతని నరాలలోని యవ్వనం కడుపులోని ఆకలిని జయించటానికి కొద్దిసేపు పెనగులాడింది.

ఆమె భర్త మాటిమాటికీ జోకులు వేస్తున్నట్లున్నాడు, ఆమె అలా నవ్వుతూనే ఉంది. కొంటెగా మునిముని నవ్వులు నవ్వుతున్న ఆమె భర్తగ్లాసును నోటిపద్ద ఉంచుకుని చటుక్కున తన పుక్కిటిలోని నీటిని తెరిచిఉన్న ఆమె నోటిలోకి ధారగా ఊదాడు. ఉక్కిరిబిక్కిరి అయిందామె. పొలమరింత అయి దగ్గసాగింది. ఆమె మొహంనిండా నీటితడి. ఇప్పుడు నవ్వటం ఆమె భర్త వంతయింది

అట్లాంటి శృంగారం గురించి రామారావు ఏదో ఫ్రెంచి నవలలో చదివాడు. విచిత్రమనిపించిందతనికి. డబ్బు భౌతికపరమైన సౌకర్యాలని సమకూర్చటంతో పాటు మనస్సంబంధితమైన శృంగారభావాల్నికూడా రేపుతుందిగావును. తనలో ఏనాడూ, ఆఖరికి వివాహపు మొదటి దినాల్లోకూడా భార్య సమక్షంలో ఈ మాత్రపు శృంగారభావాలు కదలలేదు. కారణం—ఎప్పుడూ మనస్సులో నిండి

ఉండే సమస్యలు! ఆర్థికపరమైనవి– కొన్నాళ్ళు ఉద్యోగంలేక డబ్బులు లేకా, ఇంకొన్నాళ్లు ఉద్యోగంఉండీ డబ్బులు చాలకా. ప్రస్తుతం ఆరునెలలనుంచీ మళ్ళీ నిరుద్యోగం. వ్యర్థమైన చదువు, వ్యర్థమవుతున్న యవ్వనం, ఆకలి, ఆకలి, ఆకలీ...తల విదిలించాడు రామారావు.

అమాంతంగా ఆమెను పొదవుగా రెండు చేతుల్లోకి ఎత్తుకున్నాడామెభర్త. గారంగా ఆమె ఏమో గునుస్తోంది అతని చెవులవద్ద. ఆమెనలా ఎత్తుకుని అతను లోపలి గదుల్లోకి పోయాడు తలుపులైనా వేసుకోకుండా,

కొద్దిసేపు ఎదురుచూసాడు రామారావు, ఒక నిముషం, రెండునిముషాలు. మూడు నిముషాలు...ఇక ఆగలేక చప్పున ముందుకు నడిచాడు.

చాలాభాగం గిన్నెలకు మూతలువేసి లేవు స్వీట్సు, చిప్సు, అన్నము, చారు, మటన్‌ఫ్రై, గడ్డపెరుగు, ఏమేమో ఉన్నాయి. అంతవరకూ అతనిలో మునగదీసుకుని ఉన్న ఆకలి ఒక్కసారిగా వొళ్ళువిరుచుకుంది. ఆవురావురు మంటూ వాటిమీద పడ్డాడు రామారావు.

లోపలిగదిలోంచి ఉండి ఉండి ఆమె కేరింతలు మధురంగా వినిపిస్తున్నాయి.

పళ్లెంలోకి గబగబాఅన్నమూకూరలు వడ్డించుకున్నాడు రామారావు. తింటున్నాడేగాని అతనికి రుచేమీ తెలియటం లేదు. మనస్సంతా ఇంటివద్ద సొమ్మసిల్లి పడిపోయిన భార్యాబిడ్డలమీద ఉంది.

"నాన్నా! నువ్వుకూడా ఏమీతినలేదు కదా, మరి నీకు ఆకలి కావటంలా??" తను ఆకలితో మాడుతూనే తండ్రి గురించి బెంగపడే ప్రియపుత్రుడు రాజు,

"ఏ స్నేహితుల ఇంటికన్నా వెళ్ళి ముందు మీరూ, బాబూ ఇంత తినిరండి, నా సంగతి తర్వాత చూడవచ్చు." భార్య అర్థింపులోని ఆప్యాయత...

ఇంక తినబుద్ధి కాలేదతనికి. ఒక పెద్ద గిన్నెను అందుకుని అందులోకి అన్నాన్నీ, కనిపించిన కూరల్నీ కలగాపులగంగా వేసుకున్నాడు. ఫ్రిజ్ లోంచి కొన్ని యాపిల్ పళ్ళను తీసి జేబుల్లో కుక్కుకున్నాడు. గిన్నెతో ముందుకు కదలబోతూ గుమ్మంలోకి చూసి ఉలిక్కిపడ్డాడు.

ఇందాకటి యువకుడు! ఎప్పుడు వచ్చాడోగాని గుమ్మంలో నిలబడి తీక్షణంగా చూస్తున్నాడు తనవేపు.

"ఎవరు నువ్వు?"

"ఇంకా ఎవరని అడుగుతారేమిటండీ దొంగ అయితేనూ." అతని వెనక నిలబడి ఉన్న యువతి అంటోంది.

తిండి ధ్యాసలోపడి పరిస్థితుల్ని పట్టించుకోనందుకు తనను తాను నిందించుకున్నాడు రామారావు. గిన్నెను టేబులుమీద ఉంచాడు...

* * *




"అవున్సార్, ఆ రాత్రి వాళ్ళిద్దరినీ నేను చంపేసాను. కాదు చంపాల్సి వచ్చింది. అట్లాంటి పరిస్థితి ఎందుకు వచ్చిందన్నది మీరు కొంచెం ఆలకించాలి. ఆ రాత్రి వాళ్ళిద్దరినీ నేనెంతో బతిమిలాడుకున్నాను గిన్నెలోకి ప్రోగు చేసుకున్న అన్నంతోపాటు వదిలిపెట్టమని. మొదట నాస్థితిగతుల్ని వాళ్ళకు వివరించి చెప్పటానికి ప్రయత్నించాను. ఇంటివద్ద ఆకలికి శోషిల్లిపోయిన నా భార్యాబిడ్డలు, నా నిరుద్యోగం, అదంతా. సంపాదనలేనివాణ్ణి బంధుమిత్రులంతా వదిలివేస్తారు. మొదట్లో అందిన చోటల్లా అప్పులు చేసాను. అప్పులు పుట్టటం ఆగిపోయాక ఇంట్లో రోజువారీ తిండి పెద్ద సమస్య అయిపోయింది. ఆఖరులో కొన్నాళ్ళు మొహమాటాన్ని అమ్మకానికి పెట్టి బతికాను. రెండురోజులకొకసారి ఏ మిత్రుడి ఇంటికో సకుటుంబంగా భోజనాల సమయానికి జేరుకునేవాణ్ణి ఏదవ లేక నవ్వుతూ భోజనం పెట్టక తప్పేది కాదు వాళ్ళకు కాని మొహమాటాలయినా ఎన్నాళ్ళని సాగుతాయి కనక! తొందరలోనే ఆ ట్రిక్కు పనిచేయటం మానేసాయి. మరి డబ్బుకు ప్రాధాన్యత నిచ్చే స్నేహితులు నాతోనే చెప్పేసారు మరోసారివస్తే మర్యాదదక్కదని, కాస్త మంచీ మర్యాదల్ని మెయింటెయిన్ సేచే వాళ్లు వాళ్ళ భార్యలద్వారా ఒకరంపు ఎత్తిపొడుపుల్ని నా భార్యముందు ప్రయోగింపజేసారు. నా భార్యను మహాఇల్లాలుగా చెప్పుకోవచ్చు. పాపం ఆవిడ

అట్లాంటి రోజుల్లో కూడా గుడ్లనీళ్లు కుక్కుకుని నాకు ధైర్యం చెప్పటానికి ప్రయత్నించేదిగాని ఏనాడూ నా అప్రయోజకత్వానికి నన్ను కించబరుస్తూ మాట్లాడి ఎరుగదు. ఆమె మరోరకంగా అందరు ఆడవాళ్ళలా ప్రవర్తించి ఉన్నట్టయితే నేనింతగా సంసారంపట్ల బాధ్యతను ఫీలయి ఉండేవాణ్ణి కాదేమో. ఏనాడో రైలుక్రింద తలపెట్టి ఉండేవాణ్ణి. కాని నా భార్యాబిడ్డలు నాపట్ల అసాధారణమైన ప్రేమనుప్రదర్శించారు. ఆ ప్రేమకు తట్టుకోలేకపోయాను. రెండు రోజులపాటు తిండిలేక వాళ్ళు ఇంట్లో శోషిల్లి పడిపోతే చూడలేకపోయాను. బాధ్యత నా వెన్ను తట్టింది. నీతీ, మంచీ మర్యాదా, పరువు, ప్రతిష్ఠలూ వీటికోసం ప్రాకులాడటం వెర్రితనమనిపించింది, ఆరోజయినాగాని కేవలం ఇంత తిండిని దొంగిలిద్దామని మాత్రమే ఆ ఇంటికి వెళ్ళాను. కాని వాళ్ళు నేనెంత బ్రతిమిలాడినా వినిపించుకోకపోవటమూ, నన్ను పోలీసుల కప్పజెప్పటమే తమ ధ్యేయమన్నట్లుగా ప్రవర్తించటమూ, అదే సమయాన అతిగా ప్రేమించే నా భార్యాబిడ్డలు నా కళ్ళముందు దీనంగా దిగులుగా కనిపించటమూ జరగటంతో నాకు నేను ఏమిచేస్తున్నానో తెలియని ఉన్మాద స్థితిలో అక్కడ బల్లమీద కనిపించిన పళ్లకోసుకునే చాకునుతీసుకుని వాళ్ళతో కలబడ్డాను తప్పించుకోవటానికి నా కంతకంటే మరోస్థితి కనిపించక పోయింది. వాళ్ళకున్నది డబ్బు సమకూర్చిన మదబలమయితే నాకున్నది సంసారంమీది ప్రేమ నా శరీరంలోకి ఆవహింపచేసిన పిచ్చిబలం. అదొక డెస్పరేట్ ఎటంప్ట్! ఆఖరికి నా పిచ్చిబలం నెగ్గింది.వాళ్ళిద్దరూ నాఎదురుగార క్తంలో పొర్లుతూ కనిపించారు..."

చెప్పటం ఆపి కొద్దిసేపు మౌనం వహించాడు రామారావు. తర్వాత మళ్ళీ మొదలెట్టాడు.

"అయ్యా! నాకిక్కడ ఒక సంగతి అర్థంకావటంలేదు. ఆ రాత్రి వాళ్ళను నేనెంతో బ్రతిమిలాడుకున్నాను నన్ను వెళ్ళిపోనిమ్మని కాని వాళ్ళు వొప్పుకోలేదు, నా పరిస్థితి అంతా వినివుండి కూడా, ఆఖరికి చేతులెత్తిదణ్ణం పెట్టాను. అయినా వాళ్ళలోకి దాక్షిణ్యమనేది ప్రవేశించలేదు.నేను శిక్షించబడాలన్నట్లు ప్రవర్తించారు. నిజానికి వాళ్ళకు నేను చేసిన అపకారమేమిటి? వాళ్ళకు చెందిన ఇంత తిండిని దొంగిలించటం అంతేనా? నిజంగానే అదంత పెద్ద నేరమా — పోలీసుల కప్పజెప్పేంతగా - అంటే పనిష్మెంట్ ఇవ్వబడాల్సినంతగా ?? ఒకళ్లకు సంబంధించిన ఈమాత్రపు తిండిని లాక్కోవటమేవాళ్లకంతకోపాన్ని కలిగిస్తున్నప్పుడు నాకసలు తిండి అనేది లభించనీకుండా అన్ని అ వ కా శా లీ

 యు

కలియుగ సీత




లాక్కున్న ఈ వ్యవస్థపట్ల నాకింకెంత క్రోధంఉండాలంటారు? సరే, నేనారోజు దొంగతనం చేయకుండా ఉండాల్సింది మీమీన్యాయసూత్రాలప్రకారం మరయితే అట్లాంటి స్థితిలో నేనేమి చేయాలంటారు? నా భార్యాబిడ్డలు ఆకలిచావు చస్తూ ఉంటే చూస్తూ ఊరుకుని, నన్నుకూడా అదే చావుకి ఎరని కమ్మంటారా? చెప్పండి సార్, చెప్పండి!! సమాజం అల్ప సంఖ్యాకులకు సుఖాల్నీ, అధిక సంఖ్యాకులకు కష్టాల్నీ, ఆకలినీ నిర్దేశిస్తూ ఒకరకమైన వికృతవ్యాపారన్యాయాన్ని ప్రదర్శిస్తున్నప్పుడు, ఆ న్యాయానికి బలిఅవుతున్న బడుగువర్గాలు వాళ్లకు చేతనయిన, ప్రకృతి వాళ్ళకు నేర్పిన ఆటవిక న్యాయాన్ని ఆశ్రయించడం తప్పంటారా ???

“బహుశా మీరు నాకు ఏ ఉరిశిక్షనో విధించవచ్చు. నాకు పెద్దగా బాధలేదు. మరి నా భార్యాబిడ్డల మాటేమిటి ? వాళ్ళని ఆత్మాహుతి చేసుకొమ్మంటారా? అదికూడా మీ దృష్టిలో నేరమే!! మీచేత స్థాపించబడి పోషించబడే ఈ అనాథ శరణాలయాల్లో మాలాటి నీతిమంతులకి స్థానాలుండవు. అంతకంటే నాభార్య ఏ వేశ్యాగృహాన్నో ఆశ్రయిస్తే బాగుంటుంది. నా కొడుకు ఈకసితో,రగుల్తున ఊపగతో పెరిగి పెద్దవాడయ్యాక మరో యాంటీ సోషల్ ఎలిమెంట్‌గా తయారవుతాడు. అప్పుడు మీరు వాళ్ళకు

మళ్ళీ శిక్షలు విధిస్తారు గావును, మీరు మీరు గీసుకున్న గీతల ప్రకారం! ఎట్లాంటి న్యాయమండీ మీది?? మరో నేరం జరగకుండాఉండటానికి సృష్టించబడాల్సిన మీ న్యాయసూత్రాలు మరిన్ని నేరాల్ని వృద్ధిచేయటానికి ఉపయోగపడుతున్నాయంటే అదీ ఒక న్యాయమేనంటారా..."

* * *

చాలాకాలం నడిచింది కేసు కోర్టులో. తీర్పు వెలువరించటానికి ముందురోజు రాత్రి జడ్జి మనోహరరావు తన గదిలో చాలాసేపు అసహనంగా పచార్లుచేసాడు. డబుల్ మర్డరు కేసు! చట్టప్రకారం ముద్దాయికి కఠినమైన శిక్షనే విధించాలి. కాని అందుకు ఆయనకు మనసొప్పటం లేదు. జరిగిన నేరంలో వ్యక్తిగతంగా ముద్దాయికంటే సామూహికంగా వ్యవస్థకు ఎక్కువభాగం ఉందనిపిస్తోందతనికి. ఏ వ్యక్తిలోనూ పుట్టుకతోనే నేరప్రవృత్తి ఉండదనీ, సమాజపు ఆర్థిక పరిస్థితులూ, పరిసరప్రభావాలూ, సాంఘిక మానసిక పరిస్థితులూ వ్యక్తిని నేరాల్లోకి నెడతాయనీ, క్రిమినల్ న్యాయ చట్టాలను అమలుజరిపేటప్పుడు పై విషయాల్ని ప్రాతిపదికగా తీసుకోవాలనీ భావిస్తాడాయన. మారుతున్న సమాజంతోపాటు న్యాయశాస్త్రంకూడా మారాలంటాడు. అలా మారటానికి తనవంతు కర్తవ్యాన్ని నెరవేర్చటానికి ప్రతిన్యాయమూర్తి ప్రయత్నించాలంటాడు. చరిత్రాత్మకమైన తీర్పులిచ్చిన కొందరు న్యాయమూర్తులూ, వాళ్ళ తీర్పులూ గుర్తుకొచ్చాయతనికి. తనుసీనియజడ్జి. ఏనాడూ తను అవినీతికి లొంగలేదు. సిన్సియారిటీకి కట్టుబడి ఉన్నాడు ఇన్నేళ్ళనుంచీ. అట్లాంటి తనకు చట్టాల్ని మార్చే లేక అవి మారటానికి దోహదంచేసే అవకాశాల్ని క్రియేట్ చేసే హక్కుంది నైతికంగా...

ఆ మర్నాడు కోర్టులో కేసు పూర్వాపరాల్ని సమీక్షిస్తూ తనతీర్పులో చివరిభాగాన్నిలా చదివాడు జడ్జి మనోహరరావు.

"...ఈ కేసులో ముద్దాయి నేరం చేయటానికి మూలకారణం, ఆకలిఅన్నది సుస్పష్టం. ఫలానా నేరానికి చట్టం ఫలానా శిక్షను నిర్దేశిస్తోందంటే దానికి వెనక ఉన్న ఉదేశ్యం ఆ శిక్షను చూసి భయపడో లేక ఆ శిక్షద్వారా పశ్చాత్తాపం చెందో ఆ వ్యక్తిగాని, సమాజంగాని మరొకళ్లుగాని మళ్ళీ అట్లాంటి నేరాన్ని చేయకుండా ఉంటారనీ, ఉండాలనీనూ. కాని ఆర్థికపరమైన ఇట్లాంటి నేరాల విషయంలో ఆ రకంగా ఆలోచించడానికి ఏమాత్రమూ అవకాశంలేదు. ముద్దాయి విడుదలై తిరిగి సమాజంలోకి వస్తే మాత్రం మళ్ళీ ఇట్లాంటి నేరాన్ని చేయడనేందుకు గ్యారంటీ లేదు.

కారణం – అతని ప్రాథమికావసరాలు అంటే తిండి, బట్ట, షెల్టర్, ఇట్లాంటివి తీరే అవకాశాలు సామాజికంగా సుదూర భవిష్యత్తులో ఎక్కడా లేవు కాబట్టి. ముద్దాయిని శిక్షించటంద్వారా శిక్ష యొక్క మూలఉద్దేశ్యం ఫుల్ ఫిల్ కావటం లేదంటే ఆ శిక్ష వృథాప్రయోగ మన్న మాట! ముద్దాయి చదువుకున్న వాడు. అర్హతలున్న మానవుడికి అవస రాలు తీరటంలేదంటే అది అతనితప్పు కాక అతనుంటున్న సమాజానిదవు తుంది..."

ఇట్లా మరికొన్ని పేజీలు చదివాక తన తీర్పునిలా ముగించాడు జడ్జి మనోహరరావు.

"...అలా అని క్రిమినల్ నేర స్థుల్ని శిక్షించకుండా వదిలివేయటం సమాజశ్రేయస్సు దృష్ట్యా మంచిదికాదు. కాబట్టి ముద్దాయి రామారావుకు పద్నాలు గేళ్ళ కఠినకారాగారవాస శిక్షను విధి స్తున్నాను. అయితే న్యాయం పవిత్ర మైనది. పరిస్థితుల కారణంగా ఒక వ్యక్తి ఒకసారి నేరం చేసినంత మాత్రాన అతని జీవితాన్ని బలి తీసు కునే హక్కు ఏ సమాజానికీ, ఏ న్యాయ చట్టానికీ లేదు.ఉండరాదుకూడా. అతనికి ఒకసారి అవకాశాన్ని ఇచ్చి చూడటం మానవత్వమూ, నాగరికతా లక్షణమూ అనిపించుకుంటుంది. ఆ కారణంగా ముద్దాయిని వెంటనే జైలుకి పంపటం కాకుండా మొదట ఏడేళ్ళపాటు ఏదైనా ఫ్యాక్టరీలో సామాన్య కార్మికుడిగా పని చేయించాలి. ఆ ఏడేళ్ళ కాలంలోనూ సంఘం అతని నడతనీ, గుణగణాల్నీ పరిశీలించి ఆ తర్వాత ఆ విషయంలో మంచి రిపోర్టులు ఇస్తే ఆతనికి విధించిన శిక్ష దానికదే రద్దవుతుంది. అలాకాక చెడురిపోర్టులు వస్తే మాత్రం కోర్టు తిరిగి పరిశీలించి విధించబడ్డ అసలు శిక్షను అమలుజరపటానికి అనుమతి నిస్తుంది..."



# ప్రశ్న — సి.యస్.రావు

అది వేసవి సాయంకాలం—సూర్యుడు చల్లబడినా వాతావరణం వెచ్చగానే వుంది. అభ్యుదయ నాటక సమితి రిహార్సల్ హాలులో ఆ సమితి సంస్థాపకుడు శర్మాజీ కూర్చుని ఒక కొత్త నాటికకు, ప్రొడక్షన్ నోట్ రాస్తున్నాడు. ఆ సమాజంలోని నలుగురు నటులు శర్మాజీ ఏకాగ్రతకు అంతరాయం కలగకుండా ఏదో పిచ్చాపాటి నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు.

శర్మాజీ ఆ సమాజానికి ప్రయోక్త, దర్శకుడు. సామాజిక స్పృహ, అభ్యుదయ భావాలుకల మనిషి. సమాజంలోని మూఢనమ్మకాలను, కుళ్ళుని రంగస్థలం ద్వారా తొలగించాలని తాపత్రయపడే మనిషి ... మనిషిలోని మానవత్వాన్ని పెంపొందించటానికి, ఆలోచింపచేయటానికి నాటకం ఒక బలమైన ఆయుధం అని నమ్మిన మనిషి. గతయిరవై ఏళ్లగా చిత్తశుద్ధితో కళాసేవ చేస్తున్నాడు. క్రమశిక్షణకు మరో పేరు శర్మాజీ—గత యిరవై ఏళ్లలోను ఎందరో నటులు ఆయనదగ్గర తర్ఫీదు పొందారు పేరు తెచ్చుకున్నారు. క్రమశిక్షణకు తట్టుకోలేక కొంతమంది, మంచి అవకాశాలు వచ్చి కొంతమంది, అవకాశాలు లేక కొంతమంది ఎప్పటికప్పుడు వెళ్ళిపోతూనే వున్నారు—కొత్తవారు వస్తూనే వున్నారు...

శర్మాజీ సమాజం ఒక ప్రవాహం. పాతనీరు పోవటం కొత్తనీరు రావటం ప్రవాహ లక్షణం—

ఇప్పుడువున్న కొత్తనీరు. ఆయనతో పాటుగా కూర్చున్న ఆ నలుగురు నటులు.

హీరో ప్రకాష్

కమెడియన్ తంబు

విలన్ నాగరాజు

హీరో తండ్రి చిట్టిబాబు.

నిజానికి యీ నలుగురికీ నాటకమంటే సరదాలేదు. అది ఒక కాలక్షేపం అనుకుంటారు. హీరో తండ్రి పాత్ర వేసే చిట్టిబాబు భార్య పురుటికి పుట్టింటికి వెళితే నాటకం వెయ్యడానికిదిగాడు. హీరో ప్రకాష్ లక్ష్యంవేరు. శర్మాజీ పలుకుబడి, పేరూగల మనిషని ఆయన నాటక ప్రదర్శనలకు చాలామంది పెద్దవాళ్లు వస్తారని, అలా పెద్దవాళ్లతో పరిచయం

**1978** చక్రపాణి మొదటి అవార్డు పొందిన కథ




అయితే తాను రంగస్థలం మీంచి వెండి తెరకు చేరుకోవచ్చునే ఆశతో ఆ సంస్థలో చేరాడు. కమెడియన్ తంబు హీరోయిన్ పరిచయం కోసం మాత్రమే చేరాడు... విలన్ నాగరాజు నలుగురితోపాటు నారాయణ.

ఎవరి మనసులో ఏ లక్ష్యాలు వున్నా శర్మాజీ మనసులో వున్న లక్ష్యం మంచి

నాటకాన్ని ప్రదర్శించడం. అతని నిజాయితీ అలాంటిది.

ప్రొడక్షన్ నోట్సు రాస్తున్న శర్మాజీ "టైమ్ ఎంతయిందయ్యా" అన్నాడు తన పని తాను చేసుకుంటూ.

"ఆరూ-పది" అన్నాడు కమెడియన్ తంబు.

"అమ్మాయి ఆరుగంటలకే వస్తానంది. యింకా రాలేదే" అన్నాడు శర్మాజీ పుస్తకం మూస్తూ.

"ఎందుకొస్తుందండీ" అన్నాడు నాగరాజు.

"అదేం మాటయ్యా!" అన్నాడు శర్మాజీ నవ్వుతూ.

"మీరు అమ్మాయీ, అమ్మా అంటూ హీరోయిన్స్‌ని నెత్తిని పెట్టుకుంటారు. వాళ్ళేమో తోకాడిస్తారు," అన్నాడు నాగరాజు.

శర్మాజీకి ఆ మాట నచ్చలేదు. "గౌరవం యిచ్చి పుచ్చుకోవటం సంస్కారం" అని మాత్రం వూరుకున్నాడు.

అన్న టైమ్‌కి హీరోయిన్ లత రాలేదన్న తపన అతని మనసులోనూ వుంది.

మరో అయిదు నిముషాలు గడిచాయ్.

చిట్టిబాబు వాచీ చూసి "ఆరూ—పదిహేను, సినిమా టైమయ్యింది," అన్నాడు.

"మీరు సినిమాకు వెళదామనుకుంటున్నారా" అన్నాడు శర్మాజీ.

"నేను అనుకోవటం లేదండీ. లత వెళ్ళి వుంటుందేమో అని అనుకుంటున్నాను."

"అలా ఎలా వెళ్తుందయ్యా? మన మంతే సరదాకి నాటకాలు ఆడుతున్నాం గాని ఆమెకు నాటకమే బ్రతుకుతెరువు. మరో రిహార్సల్‌కేదో వెళ్లుంటుంది. అక్కడ కాస్త ఆలస్యమయితే ఇక్కడికి రావటం ఆలస్యమయ్యింది" అన్నాడు శర్మాజీ.

"అసలు వాళ్ళ మీద మీ విశ్వాసమే పాడుచేస్తుందండీ వాళ్ళని" అన్నాడు కమెడియన్ తంబు.

శర్మాజీ ఒకసారి తంబు కళ్ళల్లోకి చూసాడు. తంబు చూపులు తిప్పేశాడు.

"ఆరున్నర దాటిందిసార్! యింక ఆవిడ రాదు" అన్నాడు చిట్టిబాబు.

"ఏవిటి నీకింత నమ్మకం" అన్నాడు శర్మాజీ చిరాగ్గా.

"నిజం చెబితే మీరు చిరాకు పడతారు! అందుకే ఎవరూ మీ ముందు నిజం చెప్పరు" అన్నాడు చిట్టిబాబు.

"పోనీ నువ్వు చెప్పొచ్చుగా" అన్నాడు కాస్త కటువుగా శర్మాజీ.

తంబు "చిట్టిబాబు పిరికిపీనుగ సార్! వాడి ఉద్దేశమేమంటే లత మధుబాబుతో సినిమాకు వెళ్ళివుంటుందేమోనని!" అన్నాడు వ్యంగ్యంగా.

హీరో ప్రకాష్ నవ్వాడు.

"మీరు మాట్లాడే మాటలేమిటో నాకర్థంకావటంలేదు. సూటిగా చెప్పండి" అన్నాడు శర్మాజీ.

నాగరాజు నవ్వి "ఇరవై ఏళ్ళబట్టి నాటకాలు వేస్తూ మీకింత అమాయక మేవిటండీ బాబూ. వాడనేది ఏవిటంటే లతకు నాటకంకంటె మంచి గిరాకీ తగిలుంటుందీ అని."

"తగిలుండటం ఏవిటి?"

తగిలింది మధుబాబు కొత్త సమాజం పెట్టాడు. కొత్త నాటకం రిహార్సల్స్ చేస్తున్నాడు. రసికుడు. భార్య జబ్బుతో హాస్పిటల్లో వుంది. చేతినిండా డబ్బుంది. అందుబాటులో లత వుంది. ఇంకా చెప్పాలంటే......" అంటూ ఏదో చెప్పబో తున్న చిట్టిబాబు మాటలకు శర్మాజీ అడ్డు తగిలి—

"ఏవిటయ్యా ఆ మాటలు? మనతో కలిసి నటించే ఓ అమ్మాయి గురించి అలా మాట్లాడటం తప్పుకాదూ......? అసలు నన్ను అడిగితే యిక్కడ లేని మనిషిని గురించి చెడు మాట్లాడటం చాలా చెడ్డ అలవాటు. లత అలాటిది కాదు," అన్నాడు.

సరిగ్గా అదే సమయానికి ఆ హాలు లోకి అడుగు పెట్టబోయి తన గురించే ఏదో మాట్లాడుకుంటున్నారని గ్రహించి వినాలన్న కుతూహలంతో బయటే ఆగి పోయింది లత. పొంచివుండి వింటోంది!

"లత మీకు నటిగానె తెల్సుసార్! కాని ఆమె చాలా తెలివైంది. మీరు రంగస్థలాన్ని దేవాలయంగా భావిస్తారు. ఆమె షోరూమ్‌గా భావిస్తుంది...... వయసులో వుంది. దీపం వుండగానే యిల్లు చక్కబెట్టుకుంటోంది" అని వ్యాఖ్యానించాడు ప్రకాష్!

"బాగా చెప్పావ్! వెధవది నాటకం వేస్తే కడిగి వందరూపాయలిస్తారు. నెల రోజులు రిహార్సల్ చెయ్యాలి. మధు బాబులాటి వాడితో ఒకరోజు గడిపితే, నాటకానికి వచ్చే వందా వస్తాయి! రాత్రికి వచ్చే ఆదాయమూ వస్తుంది" అన్నాడు తంబు.

"ప్లీజ్ స్టాపిట్! లేవండి రిహార్సల్ చేద్దాం" అన్నాడు శర్మాజీ ఆదేశ పూర్వకంగా.

అందరూ లేచి నిలబడ్డారు.

"హీరోయిన్ లేకుండా..." అని నసిగాడు ప్రకాష్.

"ఆమె బదులు డమ్మీగా నేనుంటా నయ్యా!" అని కసురుకున్నాడు శర్మాజీ.

"మీరా! హీరోయిన్ బదులు డమ్మీగా మీరు వుంటారా...?" వాడికి యిన్స్పిరేషన్ ఎలా వస్తుందిసార్? వాడామె చెక్కిళ్ళు తాకాలి; మీకు గెడ్డముంది," అన్నాడు కమెడియన్ తంబు—ప్రకాష్ వంక జాలిగా చూస్తూ.

"సరేనయ్యా, ఆ అమ్మాయి లేని

సన్నివేశాలే చేద్దాం. ప్రారంభించండి" అన్నాడు శర్మాజీ.

వాళ్ల మాటలన్నీ విన్న లత "సారీ సార్, లేటయ్యింది" అంటూ రిహార్సల్ హాలులోకి ప్రవేశించింది.

ఆమె పరోక్షంలో ఆమె గురించి చులకనగా మాట్లాడిన నలుగురు నటులు ఆమెను చూడగానే ఎక్కడలేని మర్యాద చేయటం ప్రారంభించారు.

ఒకడు "ముందు కాఫీ తాగండి" అన్నాడు.

"మొహం నిండా ఆ చెమట ఏమిటి? నడిచి వచ్చారా......? రిక్షాలో రాక పోయారా?" మరొకడు.

"ఇప్పుడు కాఫీ ఏమిట్రా? కూల్ డ్రింకో, హార్లిక్సో తెప్పించండి...... ఆవిడ అలిసి పోయినట్టున్నారు," అన్నాడు హీరో ప్రకాష్.

"ఏం వద్దండీ! మంచినీళ్లు చాలు—లేవండి రిహార్సల్ చేద్దాం!" అంది లత నవ్వుమొహంతోనే.

రిహార్సల్ ప్రారంభమయ్యింది...

దాదాపు ఒక గంటసేపు చాలా పకడ్బందీగా రిహార్సల్స్ జరిగాయ్.... హీరో ప్రకాష్ సమాజంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయం గురించీ, పురుషుడు చేసిన తప్పే స్త్రీ చేస్తే సంఘం ఆ పురుషుడిని ఎలా గౌరవిస్తుందో ఆ స్త్రీని ఎంత చిన్న చూపు చూస్తుందో వివరించ బడిన సంఘటనలను ప్రకాషూ, లతా కూడా అద్భుతంగా నటించారు. నటనలో చెమ్మగిల్లిన కళ్లను ఒత్తుకుంటూ, "ఈవేళ కాస్త త్వరగా యింటికి వెళ్లాలండి" అంది లత శర్మాజీతో—

"అలాగేనమ్మా! రేపు మాత్రం టైముకిరా" అన్నాడు శర్మాజీ.

"ఇదేనండి హీరోయిన్స్‌తో ఉన్న యిబ్బంది. రిహార్సల్స్‌కి ఆలస్యంగా వస్తారు. త్వరగా వెళతానంటారు" అన్నాడు తంబు.

"ఈవేళ ఒక్కరోజుకేనండి" అంది లత.

ఒక్క క్షణం ఏదో ఆలోచించింది. ఓ నిర్ణయానికి వచ్చింది. తోటి నటులను ఉద్దేశించి "నాదో చిన్న ప్రశ్నండి. మీకు తోచిన సమాధానాలు యివ్వాలందరూ. శర్మాజీ గారు అక్కర్లేదు. వారు పెద్ద వారు. వారు చాలా సులువుగా సమాధానం చెప్పగలరు," అంది లత.

"అడగండి" అన్నాడు ప్రకాష్.

"మీరు అడగాలేకాని ఒక్క ప్రశ్నేం ఖర్మ! వంద ప్రశ్నలయినా వరసగా సమాధానాలు చెబుతాం" అన్నాడు తంబు.

"నోటితో చెప్పడంకాదు. నేను ప్రశ్న వేస్తాను. దానికి సమాధానం ఎవరికి తోచింది వారు కాగితంమీద రాయండి. ఎవర్నీ ఎవరూ సలహా

అడగకూడదు. అందే కాపీ కొట్టొద్దు అని" అంది లత.

"మేం స్టూడెంట్లము అనుకున్నారా కాపీకొట్టడానికి. జెంటిల్‌మన్స్.కాగితాలు సప్లయి చేయండి" అన్నాడు నాగరాజు ౧రుడిలా ముందుకివచ్చి.

ఒక తెల్లకాగితం నాలుగు ముక్కలు చేసి నలుగురికీ యిచ్చింది. నలుగురూ ప్రశ్న కోసం ఎదురుచూస్తున్నారు.



"మీకు తెలిసిన పతివ్రతల పేర్లు ఒక్కొక్కరూ రెండేసి రాయండి... ప్రశ్న జాగ్రత్తగా విన్నారుగా! నేనడిగింది మీకు తెలిసిన పతివ్రతల పేర్లు" అంది లత.

"ఓస్ యింతేనా" అన్నారు నల్గురూ ముక్తకంఠంతో.

"అంతే. పైకి చెప్పకుండా కాగితం మీద రాయండి" అంది లత.

ఆ ప్రశ్నలోని అంతరార్థంకోసం శర్మాజీ ఆలోచిస్తున్నాడు. అది మామూలు ప్రశ్న మాత్రం కాదు అనుకున్నాడు. నలుగురు నటులు సమాధానాలు రాశారు.

"చదవనా" అన్నాడు హీరో ప్రకాష్.

"చదవండి" అంది లత.

"అరుంధతి – అనసూయ" అని చదివాడు.

చిన్నగా నవ్వింది లత...

"ఏవిటి అలా నవ్వుతున్నారు? వీరిద్దరూ పతివ్రతలు కారా?" అన్నాడు ప్రకాష్.

"కారని అనడానికి నేనెంతటి దాన్ని?" అని మాత్రం అంది లత.

"నేను చదువుతానండీ, దమయంతి–చంద్రమతి" అని ఆమె అడక్కుండానే చదివేశాడు నాగరాజు.

లత స్పష్టంగా నవ్వుతూ "రాజపత్నుల్ని ఎన్నుకున్నారా" అంది.

"వీళ్ళిద్దరూ పాప్యులర్ పతివ్రతలేనండి" అన్నాడు నాగరాజు.

"అవును! అందుకే వారిమీద కావ్యాలు కూడా రాశారు–ఆ తర్వాత ...?" అంటూ చిట్టిబాబు ముఖంలోకి చూసింది.

"సీతా – సావిత్రీ నండి" అన్నాడు చిట్టిబాబు.

ఈసారి కాస్త గట్టిగా నవ్విందావిడ.

"ఏవిటి అలా నవ్వుతారు! పేరు మోసిన పతివ్రతలండీ వీళ్ళు. అలాంటి వాళ్ళని మీరెందుకు అనుమానిస్తున్నారో నా కర్థంకావటంలేదు..." అన్నాడు చిట్టిబాబు.

"పతివ్రతల్ని నేనెందుకు అనుమానిస్తానండి బాబు ... నేనెక్కడ......? వారెక్కడ ...? తంబుగారూ మీరేం రాశారు...?

"ద్రౌపది–అహల్య" అని చదివాడు తంబు.

ఈసారి లత విరగబడి నవ్వింది.

"నాకు తెలుసు అయిదుగురు భర్తలున్న ద్రౌపదినీ, ఇంద్రుడిచేత మోసగింపబడిన అహల్యను–పతివ్రతలన్నారని నవ్వుతున్నాను."

"కాని వాళ్ళిద్దరూ పతివ్రతలమని ప్రూవ్ చేసుకున్నారు. మన పురాణాలు ఘోషిస్తున్నాయ్ – పెద్దవాళ్ళు ఒప్పుకున్నారు. మనం కాదంటే గొడవ వస్తుంది కదండి" అన్నాడు తంబు.

"వారందరూ పతివ్రతలు కారని నేను నవ్వలేదండి — నేనడిగిన ప్రశ్న మీకు తెలిసిన పతివ్రతల పేర్లు రాయమని. ఈ పతివ్రత లెవ్వరూ మీకు తెలియదు. వీరందరూ మీరు విన్న పతివ్రతలు—అందుకు నవ్వొచ్చినవ్వాను. మీ అమాయకత్వానికి జాలిపడినవ్వాను. చూడండి! మిమ్మల్ని కన్నతల్లులున్నారు. అగ్నిసాక్షిగా మీరు పెళ్లాడిన భార్యలున్నారు ... తోబుట్టువులున్నారు. మీలో కొందరికి మీ రక్తాన్ని పంచుకు పుట్టిన కూతుళ్ళున్నారు. వీళ్ళెవరూ పతివ్రతలు కారు...? మీ వాళ్ళనే మీరు పతివ్రతలుగా అంగీకరించలేరా......" అంది ఆవేశంగా లత.

నలుగురి నటుల ముఖాలు తెల్లబోయాయి.

లత తెలివికి శర్మాజీ ముగ్ధుడయ్యాడు—

"కన్న తల్లినీ, కట్టుకున్న భార్యనీ, ఒకే కడుపున పుట్టిన తోడబుట్టినదాన్ని, మీ రక్తాన్ని పంచుకుపుట్టిన కన్న కూతుర్నీ పతివ్రతలుగా చూపించలేని మీరు — నాలాంటి మీ తోటి నటిని పతివ్రతగా ఎలా గుర్తించగలరులెండి ? నా గురించి మీరేం మాట్లాడినా బాధ లేదు. వస్తాను" అని లత ఒక్కడుగు వేసి "అన్నట్టు చెప్పడం మరిచాను! రోజూ నా కూడా రిహార్సల్స్‌కి పదేళ్ళ పిల్ల వచ్చేది—మీరందరూ చూశారు... అది నా చెల్లెలు అని చెప్పేదానిని అందరితోటి. అది నా చెల్లెలు కాదు. నా కడుపున పుట్టిన బిడ్డ — పదేళ్ళ కూతురు వుందీ అంటే నాకు వయసు మళ్ళిపోయిందని, హీరోయిన్ వేషం యివ్వడానికి అనుమానిస్తారని అలా అబద్ధమాడాను ... ఆ పిల్లకి కూడా అబద్ధం ఆడటం నేర్పి అక్కా అని పిలిపించుకున్నాను ... ...! ఆ పిల్ల యీవేళ ఉదయం చనిపోయింది. ఆపిల్ల జన్మకు కారకుడయిన మగవాడు ఉన్నాడుకాని తండ్రిని అని చెప్పుకునే మగవాడు కాదు! అందుకే తల్లినీ, తండ్రినీ నేనే అయ్యాను! దాన్ని పూడ్చి పెట్టాను. అందుకని రిహార్సల్స్‌కి కాస్త ఆలస్యమయింది! వస్తానండి" అని అందరికీ నమస్కరించి వెళ్ళిపోయింది లత.

ఆ క్షణంలో చెమ్మగిల్లిన శర్మాజీ కళ్లకు, లతలో లత కనపడలేదు!

లతలో నటి కనబడలేదు !!

లతలో స్త్రీ కనబడలేదు !!!

లతలో ఒక అమ్మను చూశాడు.






కొండవాగు బండరాళ్ళమీదుగా పొర్లి,

కిందనున్న యిసుకలో సెలయేరుగా మారి గలగలా నవ్వుతోంది. రోజల్లా కాసిన ఎండ ఎర్రగామారి, ఆహ్లాద కరంగా ఉంది. ముడుచుకుపోయిన సుగంధరాజనాలు విప్పారి, సువాసనల్ని వెదజల్లుతున్నాయి. కాని రాజారావు గుండెలో పార్వతి మీది ద్వేషం అలానే ఉండిపోయింది.

బొమ్మలు విరిగితే ఏడవకూడదని పిల్లలకు పాఠాలు చెప్పే రాజారావు, కలలు చెదిరి మౌనంగా ఏడ్చాడు. ఆశాసౌధాల్లో విహరించడం వెర్రితన మని భావించే రాజారావు, పునాదుల్లేని ప్రేమ సౌధం పేకమేడలా కూలినందుకు మనస్సు ముక్కలై మరీఏడ్చాడు. ఏడ్చి ఏడ్చి గూడుకట్టుకొన్న బాధని ద్వేషంగా మార్చుకొని, వెన్నలాంటి మనసుని రాతిమనసుగా మార్చుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

పార్వతి తలపుల్లో తనకింతచోటూ, సదభిప్రాయమూ ఉన్నాయని నిర్ధారణ

చేసుకొన్నరోజున, "మనసులో మీమీది మమతలు కలలుగా రూపొందించుకొంటూ, మూడునెలలుగా స్వాప్నిక జగత్తులో ఉంటూ ఉండివచ్చాను. మీ కభ్యంతరం లేకపోతే మిమ్మల్ని మళ్ళీ సుమంగళిగా చేసే అదృష్టం నాకిస్తారనుకొంటాను," అని స్కూలువరండాలో రాజారావు, ఆమెని అడిగాడు. పార్వతి చివ్వున కళ్ళెత్తి రాజారావు కళ్ళలోకి చూసింది. నీళ్ళతెరలు కమ్మిన పార్వతి కళ్ళలో తనబొమ్మను చూసుకొంటూ మౌనంగా నిలబడిపోయాడు. పార్వతి తలవంచుకొని నెమ్మదిగా అంది. "నాకు, ఆరేళ్ళ కొడుకున్నాడన్న సంగతి మీరు మరిచిపోయారనుకొంటాను!"

"అన్నీ ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. మీ అంగీకారంకోసం ఎదురు చూస్తూంటాను."

"అత్యాశకు పోవడమేమోనని ఆలోచిస్తున్నాను. పసివాడిమనసు బాధపడ్తుందన్న భయంతో, మళ్ళీ వైవాహిక జీవితంలో అడుగుపెట్టడానికి ధైర్యం చాలటంలేదు. నామీది జాలికొద్దీ మీరీ నిర్ణయానికి రావడం నాకిష్టంలేదు. కాదు, ప్రేమంటారూ, అదృష్టవంతురాల్ని. అయినా ఆలోచించడానికి కొంచెం వ్యవధికావాలి."

ఆ మాటలకే రాజారావు పొంగిపోయాడు. పార్వతి కొడుకుని చేరదీసి సన్నిహితుడైపోయాడు. తన కొడుకు భవిష్యత్కు భయంలేదని నిశ్చయించుకొన్న పార్వతి, అదే సెలయేటి ఒడ్డున రాజారావు చేతిలో చేయివేసినరోజున, మీదవడ్తోన్న రుద్రగన్నేరు పువ్వుల్నీ, గలగలా పారుతున్న సెలయేటినీ, కొండల్ని ఆక్రమిస్తున్న పొగమంచునీ- ఇంకా పరిసరాల్నీ, ప్రకృతినీ, అన్నిటినీ మరిచిపోయి, పార్వతిచేతిని ముద్దుపెట్టుకొన్న మధురానుభూతి కలగానే మిగిలిపోయింది రాజారావుకి.

"త్వరపడి ఆ రోజు నిర్ణయానికి వచ్చినందుకు విచారిస్తున్నాను. మన ఈ వివాహం జరగడానికి అవకాశంలేదు. బ్రతుకుబాటలో మనం ఒకరికష్టసుఖాలు మరొకరు పంచుకొనేబదులు, బడిపిల్లల భవిష్యత్తుకు మార్గంచూసే సహఉద్యోగులుగా ఉండడమే మేలనుకొంటున్నాను," అని చిన్న చీటీముక్కలో, పార్వతి రాజారావుని కలలోంచి వాస్తవంలోకి గిరాటువేసింది. కారణాలు అడిగి అలసిపోయిన రాజారావు, కొంత బాధపడి, ఆబాధలోంచి నెమ్మదిగా తేరుకొన్నాడు.

అయితే కారణం తెలిసినరోజున తగిలిన విఘాతానికి తట్టుకోలేకపోయాడు. మెడలో తాళికట్టి తిరిగి సుమంగళిగా చెయ్యడానికి సిద్ధపడ్డ తనని మొదట అంగీకరించి, తర్వాత నిరాకరించిన పార్వతి, ఆ స్కూలు

అధికారవర్గంలోని సోమశేఖరానికి ఉంపుడుగత్తెగా మారినందుకు, రాజారావు హృదయంలో కొండవాగులు పొంగాయి. లోకంలో ఉన్న ఎండంతా గుండెల్లోనే కాసింది.

కసికొద్దీ చేతికందిన రాయి తీసి, నీళ్ళలో విసిరేశాడు. "నామీది కోపమంతా ఆ రాయిమీద చూపిస్తున్నారనుకొంటాను!" వెనకనుంచి వినవచ్చిన మాటలతో రాజారావు తలతిప్పిచూశాడు. పెదాలమీద చిరునవ్వుతో పార్వతి నిలబడిఉంది.

"ఆకాశంలో ఉన్న తారవి. నీళ్ళలోని నీడవి. ఎన్నిరాళ్ళు వేస్తే తగిలినట్లు?" రాజారావు నీళ్ళలోకి చూస్తూ అన్నాడు.

"పైనున్న చుక్కనికాను, నేలమీది నక్షత్రాన్నే. నీళ్ళలో నీడనికాను. ఒడ్డునున్న మనిషిని. నన్ను రాళ్ళతో కొట్టడం అనవసరం. మీరన్న ప్రతి మాటా నాకు తగుల్తూనేఉంది!" పార్వతి పెదాలమీద అదే చిరుచినవ్వు వెనుక అణగారిన హిమాలయాల్లాంటి మనోవేదన రాజారావుకి తెలియదు.

"నేలమీది నక్షత్రానివికాదు, నేలరాలిన చుక్కవి! ఒకరాత్రికి ఎంత తీసుకొంటావు?" యిళ్ళని నిలబెట్టి మనుషులను నాశనంచేసే న్యూట్రాన్‌బాంబులా, మనిషిని నిలబెట్టి మనసును దహించే ప్రశ్న అడిగాడు.

"నేలరాలినిచుక్కనయినా, నన్నందుకొనే తాహతు మీకు లేదు. అది బలవంతులకి, ధనవంతులకి చెల్లుతుందికాని, బడిపంతులికాదు!" సమాధానం యిచ్చి, 'పతనమైనదాన్ని. మీరే నాకందని చందమామగా ఉండిపోయారు.' అని మనసులో అనుకొంటూ, పార్వతి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది. పార్వతి మనసులో మాటలు రాజారావుకి వినబడలేదు. వినబడ్డ మాటలు రాజారావు ఆలోచనలో చోటుచేసుకొన్నాయి.

కొండలమాటున అస్తమించిన సూర్యుడి వెనుకనే చీకటి పరుగెత్తుకొంటూ వచ్చింది. ఆచీకటిలో రాజారావుకి వెలుగుబాట కనిపించింది. అప్పుడప్పుడూ జీతాలందుకొనే తనలాంటి బడిపంతులు - అందనివాటిని చూస్తూ ఆనందించాలే కాని, పొందటానికి ప్రయత్నించకూడదు! ప్రేమంటే ఏమిటో చదివి తెలుసుకోవాలే కాని, ప్రేమించకూడదు!

పిండారబోసిన వెన్నెల్లో సెలయేరు వెండినురగల్ని వెదజల్లుకొంటూ, గలగలా పారుతోంది. రాజారావు మనసు హాయిగా నవ్వింది.




ఒకరోజు కాలేజీనుంచి స్నేహితురాళ్ళతో కలిసి ఇళ్ళకి తిరిగి వస్తుండగా ఒక విచిత్రమయిన సంఘటనను చూసింది సబిత ! రోడ్డు మీద పోతూవున్న ప్రతి వాడూ ఆగి నిలబడి, "అరె ! అరెరె ! అదేంటి అన్యాయం" అంటూ ఆశ్చర్యం, భయంతో పాటు, ఆందోళనకి లోనయి ఉండిపోయాడేగాని ముందుకురికి వాళ్ళని ఎవరూ విడదీయలేకపోయారు. జెమా జెట్టీలవంటి నలుగురు యువతులు, ఒక

ఒంటరి యువకుడిమీద కలిసికట్టుగా ముట్టడి చేస్తున్నారు. ఆ నలుగుర్నీ ఎదుర్కొని నిలబడి, వాళ్ళు నాలుగు దెబ్బలు వేస్తే అతను ఒక దెబ్బయినా వేయటానికి ప్రయత్నిస్తూ వున్నాడు. ధైర్యంగా నిలబడి దెబ్బకి దెబ్బ తీయటానికి ప్రయత్నిస్తూ వున్నాడుగాని అలవికాని ప్రయత్నాన్ని విరమించి పారిపోవటానికి ఏమాత్రం అతను ప్రయత్నించటంలేదు. అతని మొండి పట్టుదలకి లోలోనే అభినందించినా, అతని పరిస్థితి సవితకి ఆందోళన కలిగించింది. సమయం గడచినకొద్దీ అతను నీరసించిపోతూ వున్నాడు కాని తన ప్రయత్నం మానటంలేదు. అందు వలన అప్రయత్నంగానే "పోలీస్, పోలీస్" అంటూ కేకలు పెట్టింది సవిత. అల్లంతదూరంలో పోలీస్ విజిల్ విన్పించింది. అందువలన ఆ దుండగులు పారిపోయారు. రక్తం చిమ్ముతున్న గాయాలతో, చెదిరిన జుట్టుతో, మొహం నిండా చెమటతో అతను మిగిలి పోయాడు.

"ఏమిటండీ? ఎవరు వాళ్ళు?" అని అడిగింది అతని దగ్గరగా వెళ్ళి సవిత.

"ఎవరో రాస్కెల్సు. కాలేజీనుంచి తిరిగి వస్తూ వుండగా దారి కాచి మీద పడ్డారు. తగిన బుద్ధి చెప్పాను లెండి," రొప్పుతూ అన్నాడు.

"చాలా సంతోషం లెండి. మీకు ఎక్కువగా దెబ్బలు తగిలిన సంగతి గమనించినట్లు లేదు మీరు!" అని నాలుక కొరుక్కుంది సవిత. అతను నవ్వాడు. సవిత సిగ్గుపడింది. అలాగ పరిచయమయిన అతన్ని తరచూ కాలేజీలో చూస్తూనే వుంది సవిత. కాలేజి యూనియన్ ఎలక్షన్లప్పుడు, కాలేజీలో ఫంక్షన్సు జరిగినప్పుడూ అతను విద్యార్థుల్లో మంచి యాక్టివ్‌గా తిరుగుతూ వుండేవాడు.

అతని పేరు బ్రహ్మయ్య. బి. ఏ. ఫైనల్ ఇయర్ చదువుతూ వుండేవాడు. తరచూ స్టేజి ఎక్కి ఉపన్యాసాలు ఇచ్చేవాడు. అతని చుట్టూ ఎప్పుడూ చాలామంది విద్యార్థులు వుండేవారు. నలుగుర్నీ కూడగట్టటంలోనూ, ఉపన్యాసాలతో అందర్నీ ప్రభావితుల్ని చేయటంలోనూ అతను అద్భుతమయిన శక్తి సామర్థ్యాల్ని ప్రదర్శిస్తూ వుండే వాడు. ఆ తరువాత స్టూడెంట్స్ యూనియన్ ఎలక్షన్లప్పుడూ, ఇనాగరల్ ఫంక్షన్ జరిగినప్పుడూ సవితకి అతన్తో పరిచయం పెరిగింది.

పొట్టిచేతుల చొక్కా, ఖద్దరు పంచా, నల్లని ఉంగరాలు తిరిగిన క్రాపూ, బలిష్ఠమయిన ఆకర్షవంతమయిన విగ్రహం. ఆరోగ్యం, ఉత్సాహం మూర్తీభవించిన అతని వ్యక్తిత్వం, అన్నిటినీ మించి అతని పట్టుదలా... బ్రహ్మయ్యలోని ఈ లక్షణాలు సవితని

ఆకర్షించాయి. అందువలన సవిత అతనితో పరిచయాన్ని పెంచుకుంది.

అయిదుగురన్నల తర్వాత పుట్టి చాలా గారాబంగా పెరిగింది సవిత. ఆమె అంటే తల్లిదండ్రులకి వేదవాక్కు. ఆమె కోరితే కొండమీద కోతినన్నా తెచ్చి ఇవ్వాలని ఉత్సాహం చూపిస్తారు సవిత అన్నదమ్ములు. ఆమె తండ్రి గాంధేయవాది. కొడుకులందరికీ ఆయన మాట సుగ్రీవాజ్ఞ. వాళ్ళది బాగా కలిగిన కుటుంబం. పెద్ద బంగమూ.

ఆ సంవత్సరం గిరున తిరిగి పరీక్షలయ్యాక వేసవి సెలవుల్లో ఇంటికి వచ్చినప్పుడు ఆమె వివాహ విషయం ప్రస్తావనకి వచ్చింది. తండ్రితో తన మనసులోని మాటను సూచనగా తెలిపింది సవిత. ఆమె పెద్దన్నలు ఇద్దరూ ఆ వూరు వెళ్ళి బ్రహ్మయ్య గురించిన విషయాలు సేకరించుకుని వచ్చారు.

కుర్రవాడు బుద్ధిమంతుడే. తల్లి దండ్రులూ, తోడబుట్టినవాళ్ళూ ఎవరూ లేరు. ఏమంత ఆస్తిపాస్తులు లేవు. అతని మేనమామలు అతన్ని చదివిస్తున్నారు. కాని కుర్రవాడు ఆవేశ పరుడు. ముందూ వెనకా చూడని తత్త్వం. పైగా మొండివాడు. అంతావిని ఆమె అన్నలు, బంధువులు పెదవి విరిచారు.

"తల్లీ! నీకు పోలీసు ఆఫీసరు కావాలా? కలెక్టరుగా చేస్తున్న పెళ్ళి కొడుకు కావాలా? లేక అమెరికాలో వుద్యోగం చేస్తూవున్న డాక్టరు కావాలా? ఎవరు కావాలో చెపితే ఫొటోలు తెప్పిస్తాము. నీవు చూసి ఇష్టపడితే ఘనంగా పెళ్ళిచేస్తాము" అని అడిగారు అన్నలు.

చాలాసేపు ఆలోచించి, "నాకు బ్రహ్మయ్యగారు కావాలి" అంది సవిత.

"బాగా ఆలోచించు. నువేం చిన్న పిల్లవి కాదు నాకు బొమ్మ కావాలి అంటానికి" అన్నాడు ఆమె పెద్దన్న అసహనంతో.

"ఇదేం ఆటగాదు. పెళ్ళి — అంటే నూరేళ్ళ జీవితం" అని హెచ్చరించాడు ఆమె రెండో అన్న.

"బాగా ఆలోచించు తల్లీ. నీ సుఖం కోసమే గదా మా తాపత్రయమంతాను" అని ప్రాధేయపడ్డారు మిగిలిన అన్నలు.

వాళ్ళు ఎవరికీ ఈ బ్రహ్మయ్య సంబంధం ఇష్టంలేదు. అందుకే సవిత మనసుని మళ్ళించటానికి రకరకాల ప్రయత్నాలు చేశారు. అయితే, ఆ ప్రయత్నాల సంరంభం హెచ్చినకొద్దీ సవిత నిర్ణయమూ మరింత గట్టిపడింది గాని ఏ మాత్రం సడలలేదు.

చివరికి ఆమె తండ్రి 'తాతయ్యగారు' తన నిర్ణయాన్ని ప్రకటించటంతో ఆ వివాదం సమసిపోయింది. బ్రహ్మయ్య

వూరు వెళ్ళి మంతనాలు సాగించారు ఆమె అన్నలు.

ఆ రోజులలోనే ఒకసారి సవితకోసం వచ్చాడు బ్రహ్మయ్య. ఆ సమయంలో మగాళ్ళు ఇంట్లో లేరు. అతన్ని చూసి ఎంతో సంతోషపడిపోయి ఆహ్వానించి కూర్చోపెట్టింది సవిత. సకల మర్యాదలూ చేసి స్వయంగా కాఫీ కలిపి తెచ్చి ఇచ్చింది.

చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాక అసలు విషయానికి వచ్చాడు బ్రహ్మయ్య.

"బహుశా ఈ సంగతి మీకు తెలీదనుకుంటాను" అన్నాడు.

"ఏ సంగతి ?" అన్న ఆమె ప్రశ్నకి బ్రహ్మయ్య ఇరుకున పడ్డాడు.

"అదే...అదే..." అన్నాడు.

"అదే అంటే ?" అంటూ కొంటెగా రెట్టించింది. బ్రహ్మయ్య చాలాసేపు ఆలోచనలోపడి నిట్టూర్చి అన్నాడు.

"మన ఇద్దరి మధ్యా అనుబంధం కుదిరేది గాదు."

"ఎందువలన ?"

"స్వాభావికంగా నేను కమ్యూనిస్టుని. మీ వాళ్ళందరూ భూస్వాములు. వర్గ వైరుధ్యం అనేది వుంది. అది వర్గాన్ని చాలా ఎడంగా వుంచే అవకాశం వుంది. అందువలన మన మధ్య ఏ రకమయిన బంధమయినా సరే అనేకమయిన ఇబ్బందుల్ని తెచ్చిపెట్టే ప్రమాద ముంది."

"ఆ ఇబ్బందులు అధిగమించ జాలనివా ?"

"అవును."

"ఏమిటవి ?"

"ఘర్షణలు. వాటిమధ్య అనుబంధాలు ఆత్మీయతలు నలిగిపోతాయి."

"అయినా సరే సిద్ధమయితే..."

"అందువలన చాలా కష్ట నష్టా లుంటాయి. నీలాంటి సుకుమారి అసలే సహించలేదు."

"అయితే ఇప్పుడు ఏం చేస్తానంటారు ?" రోషంతో సవిత ముక్కుపుటాలు అదిరాయి.

"బాగా ఆలోచించి సరయిన నిర్ణయం తీసుకోమని కోరుతున్నాను" అన్నాడు.

సవిత చివాల్న లేచింది. ఉబికి వస్తూ వున్న కన్నీటిని అణచుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది. బ్రహ్మయ్యకి పరిస్థితి అవగాహన అయింది, తల వంచుకుని కూర్చుని ఆలోచనలో పడ్డాడు.

కాసేపయాక మొహం కడుక్కొని తిరిగివచ్చింది సవిత. ఆమెని చూసి బ్రహ్మయ్య నవ్వాడు.

"సవితాదేవిగారూ !"

"ఏమిటి చెప్పండి" అంది సవిత కఠినంగా.

"మీ నిర్ణయం మారదంటారా ?"

"ఆ ప్రశ్న తలెత్తే అవకాశం లేదు.




అవసరమయితే అవివాహితగానయినా వుండిపోతాను" అంది సబిత నిశ్చలంగా.

"సరే. మీ నిర్ణయం ప్రకారమే మన పెళ్ళి జరగనీయండి."

సబిత మనస్సు సంతోషంతో నిండి పోయింది ఆమె కనులలో మెరుపులు తొంగిచూసాయి.

"చాలా థాంక్సండి" అంది.

''మరి నేను వెళ్ళివస్తాను.''

"ప్రొద్దుపోతూ వుంది. ఇప్పుడేం వెళ్తారు? ఇవేళ్టికి వుండి రేపుదయమే..."

"కాదు...లెండి నేనువెళ్ళిపోవాలి." అంటూ లేచి నాలుగడుగులు వేశాడు. వేసి, ఆగి వెనుదిరిగి వచ్చాడు. "నన్ను మీవాళ్ళు ఒక కోరిక కోరారు. అది చాలా వింతగా వుంది," అన్నాడు.

''ఏమిటది ?"

"మీవాళ్ళంతా మిమ్మల్ని చూడకుండా వుండలేరట. అందువలన నేను వచ్చి మీవూళ్లోనే వుండాలట !''

''మీరేమన్నారు ?''

"ఇంకా ఏమీ అనలేదు. సరేననాల్సి వచ్చేటట్టుంది. మీ గురించి నాకు ఏదీ తప్పేట్టులేదు గదా !" నవ్వాడు బ్రహ్మయ్య.

"చాలా థాంక్సు.''

అతను లేచాడు. అతను చాలా దూరం వెళ్ళిపోయేదాకా అక్కడే నిలబడి చూస్తూ వుంది సబిత. మలుపు తిరగబోతూ ఆగి వెనుదిరిగి చూసాడు అతను. ఆమె అక్కడే నిలబడి అతన్నే చూస్తూ వుంది

ఆ వేసవిలోనే పెళ్ళి జరిగింది.

రిజల్ట్సు వచ్చాయి. బ్రహ్మయ్య సెకెండు క్లాసులో పాసయాడు.

సబిత ఇంటర్మీడియట్‌తోనే చదువు మానేసింది. అతను అత్తగారి వూళ్లో మకాం పెట్టాడు. సాయంత్రం శ్రామికులు వుంటూ వుండే గుడిసెల వైపు వెళ్ళేవాడు. రాత్రుళ్ళు బాగా ప్రొద్దుపోయాకగాని తిరిగి వచ్చేవాడు గాదు.

సంవత్సరం తిరగ్గానే సబిత తల్లి అయింది.

పాపకి "అరుణ" అని పేరు పెట్టాడు బ్రహ్మయ్య.

అప్పుడే గొడవలూ మొదలయ్యాయి.

ఒక వ్యవసాయకూలీకీ భూస్వామికీ తగవు వచ్చింది. ఘర్షణ అయి ఆ కూలీకి బాగా దెబ్బలు తగిలాయి. హాస్పిటల్‌లో చేర్చారు.

బ్రహ్మయ్య కూలీల తరవున ఆ భూస్వామిని నిలదీసి అడిగాడు.

"అలాగ చెయి చేసుకుని చావు దెబ్బలు కొట్టే అధికారం అతనికి ఎవరిచ్చారు ? అతను ఇవ్వదలచుకున్న సంజాయిషీ ఏమిటి ?"

"నేనేం సంజాయిషీ ఇవ్వవలసిన అవసరంలేదు." అని మొరాయించాడు ఆ భూస్వామి. వాద ప్రతివాదాలు ఎటూ తేలక పెద్ద గొడవయింది. చిలికి చిలికి గాలివాన అయింది.

వ్యవసాయ కూలీలు సమ్మె మొదలు పెట్టారు. వాళ్ళకి బ్రహ్మయ్య నాయకత్వం వహించాడు. సబిత అన్నదమ్ములు బ్రహ్మయ్య కి ఎన్నోవిధాల చెప్పారు. "ఈ గొడవలు అన్నీ మన కెందుకయ్యా?'' అని అన్నారు.

"ఇది గొడవా ? ఇందులో న్యాయం వుందా ?'' తీవ్రంగా అడిగాడు బ్రహ్మయ్య.

"పెట్టే చెయ్యే ఎప్పుడయినా కొట్ట వచ్చును. అదీ పద్ధతే."

"పద్ధతా నా బొందా ? ఎవరిది ఆ పెట్టే చెయ్యి ? ఈ గాలి ఎవడిది ? ఈ నీరు ఎవడి బాబుగాడి సొమ్ము ? ఈ భూమి మీ తాతగాడిదా ? కాదు. కాదు. ఎవడయితే దీన్ని దున్ని సాగుచేస్తాడో వాడిదే ఆ భూమి. అక్రమంగా ఈ భూముల్ని ఆక్రమించుకుని ఇవతలివాడు చమటోడ్చి సాధించిన శ్రమ ఫలితాన్ని బొక్కసాలలో నింపుకునేదేనా ఆ పెట్టే చెయ్యి ? కష్టజీవి సంపాదించి పెడుతూ వుంటే, దాన్ని ఈ సోమరిపోతులు జేబుల్లో దాచుకుంటున్నారు. పైగా దౌర్జన్యాలా ? ఆ దవుర్జన్యాలకి సమర్ధనలా ?" — తీవ్రంగా అన్నాడు బ్రహ్మయ్య.

"అయితే ఇంతకీ నువ్వు అనేదేమిటి?" అన్నాడు సబిత పెద్దన్న.

"ఈ దోపిడీ, దౌర్జన్యాలూ ఇలాగ సాగటానికి వీలులేదు."

"అంటే ?"

"కష్టపడి పనిచేసిన ప్రతివాడికీ,

కడుపునిండా తినడానికి హక్కు వుంది కాని శ్రమజీవికి ఆ అవకాశం మీరు ఇవ్వటంలేదు. అతడ్ని మీరు దోచుకుంటున్నారు. అందుకోసం పద్ధతులూ, పాము పిల్లలూ అంటూ చెప్తూ మీ దౌర్జన్యాలు కొనసాగిస్తున్నారు. చివరికి బంజరుభూములూ, పోరంబోకులూ కూడా మీ అక్రమ ఆక్రమణల కిందకి తెచ్చుకున్నారు. అందుకోసం మీరు అణచివేత పద్ధతుల్ని పాటిస్తున్నారు. ఇది ఇలాగ సాగటానికి వీలులేదు."

"నీ తలలో పురుగు పుట్టింది."

"కాదు. మీ తలల్లో స్థిరనివాసం ఏర్పరచుకున్న పురుగుల్ని ఏరివేయటానికే నా ప్రయత్నం."

"నోర్ముయ్యి"

"మీరే నోర్ముయ్యండి."

కలబడేదాకా వచ్చింది పరిస్థితి. కొందరి జోక్యం వలన ఆ ప్రయత్నం నివారింపబడింది.

ఆ రాత్రి సవిత తండ్రి వచ్చాడు. బ్రహ్మయ్యని దగ్గర కూర్చోపెట్టుకుని నచ్చచెప్ప బూనాడు.

"తరతరాలుగా వస్తూవున్నకట్టుబాట్లు ఎలాగ మార్చగలవు బాబూ ?"

"వాటిని మార్చటానికి ప్రయత్నం అనేది సాగుతూనే వుంటుంది. ఫలితం సాధించేవరకూ ఆ ప్రయత్నం సాగక తప్పదు."

"కాని అందువలన మేము ఇబ్బందుల్లో పడుతున్నాము బాబూ! ఏది ఏమయినా మనం మనం ఒకటి కాదంటావా ?"

"ఇటువంటి విషయాలలో అటువంటి బంధాలేవయినా వుంటే అవి ఛిన్నాభిన్నమయిపోక తప్పదు మామగారూ !"

"అంతేగాని నువు నీ పద్ధతి మార్చుకోనంటావు. అందువలన చాలా కష్టనష్టాలున్నాయి బాబూ! నీ మంచిని కోరేవాడిని. ఆలోచించు. ఇపుడు నీవు ఒంటరివిగాదు. నిన్నే నమ్ముకున్న నీ భార్యా, కూతురూ వున్నారు. మమ్మల్ని అర్థంచేసుకో నువు మారాలి."

"ఎవరికోసమూ ఎవరూమారరండీ?"

"నువ్వు చదువుకున్న విద్యావంతుడివి. నీ చదువు నీకు నేర్పింది అదేనా ?"

"నా చదువు నాకు ఇదే నేర్పిందండీ. చుట్టూ చూడమంది. ఆలోచించమంది. అన్యాయాన్ని ఎదిరించి ఆచరణకి దూకమంది. ఇంతకంటే ఏ చదువయినా ఏం చెప్తుందండీ ?"

విసిగి వేసారి వెళ్ళిపోయారాయన.

వ్యవసాయ కూలీలకి, రైతులకి పట్టుదలలు పెరిగాయి. ఆవేశకావేశాలు విజృంభించాయి. పొలాలు కళ దప్పి పాడుపడినట్లయాయి. కూలీల గుడిసెల్లో ఒక కొత్త గుడిసె వెలిసింది. బ్రహ్మయ్య మకాం అందులోకి మారింది.

అరుణ ఇప్పుడు మేనమామల ఇంటికి వెళ్ళటం మానేసింది. వాళ్ళు వెలివేయ బడ్డారు. సబిత పట్నంలో పంతులమ్మగా వుద్యోగం మొదలెట్టింది. తీరిక లేకుండా తిరుగుతూ వున్నారు బ్రహ్మయ్య. కూలీల్ని కూడగట్టి వూళ్లో అక్రమ ఆక్రమణలో వున్న బంజరుభూముల్ని ఆక్రమించటానికి ఉద్యమం ప్రారంభించాడు బ్రహ్మయ్య. చెదురు మదురు సంఘటనలు మొదలయ్యాయి. పెనగులాటల్లో కసి కార్పణ్యం విజృంభించాయి. ఆ వూరి వ్యవసాయ కూలీలు పదిమైళ్ళు నడిచి వేరేచోట పని చేసుకుని వస్తున్నారు. వేరే వూళ్ళనుంచి కూలీల్ని తెచ్చుకుని తమ పనులు చేయించుకుంటున్నారు రైతులు – అధిక వేతనాలు ఇచ్చి. ఆ భత్యాలే ఇస్తే వీళ్ళే చేద్దురు. కాని పట్టుదలలు అడ్డువచ్చాయి.

గడ్డిపరక వేస్తే భగ్గుమంటూ వుంది.

బయటి వూళ్ళనుంచి వచ్చేవాళ్ళను రాకుండా చెయ్యాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ ప్రయత్నాలు సాగకుండా వమ్ముచేయాలని అవతలి వాళ్ళు పథకాలు వేస్తున్నారు.

ఒకరోజున బంజరుభూముల్ని ఆక్రమించారు కూలీలు.

అవతలివాళ్ళు ప్రతిఘటించారు.

కర్రలు లేచాయి. తలకాయలు పగిలాయి. రక్తం పారింది.

పోలీసులు వచ్చి రెండు వైపుల వాళ్ళనీ పట్టుకెళ్ళింది. అవతలివాళ్ళు డబ్బు కట్టి బెయిలుమీద విడుదలయి వచ్చారు.

బ్రహ్మయ్య, ఆతని అనుచరులూ జైలులోనే వున్నారు.

కేసు నడిచింది.

బ్రహ్మయ్యకి మరి కొందరికి శిక్షలు పడ్డాయి.

సబిత బాగా చిక్కిపోయింది.

ఎముకలగూడువలె అయిపోయింది.

ఆమె అన్నలు ఆమె మొహం చూడదం మానుకున్నారు.

ఆమె తండ్రి మాత్రం కడుపుతీపిని చంపుకోలేక అప్పుడప్పుడూ చాటుగా వచ్చి కూతుర్ని చూసి వెళ్తూ వుంటాడు. ఒకరోజు సబిత తండ్రి వచ్చి పసిపిల్ల వాడివలె కన్నీరు పెట్టాడు.

"ఇంతా చేసి అల్లుడు సాధించింది ఏమిటి తల్లీ ?"

"అదే నాకూ అర్థంకావటంలేదు నాన్నా."

"నిజంగానే నువ్వు ఆ మాట అంటున్నావా, సబితా ?"

"నిజంగానే నాన్నా."

"అయితే అతనికి చెప్పి ఎందుకు వాప్పించవు ? ఆ ప్రయత్నం నువ్వు ఎందుకు చెయ్యవు ?"

"నా ప్రయత్నం నేను చేస్తూనే వున్నాను, నాన్నా."

"అయినా అతను నీ మాట వినలేదంటావు."

"ఆయన్ని మార్చటం ఎవరి తరమూ కాదు నాన్నా. అందుకే నేనే మారాను."

"నువ్వు మారావా ?"

"అవును నాన్నా. సంసారం చేస్తూ వున్నాక ఎవరో ఒకరు సర్దుకుపోవాలి గదా."

"అసలు నీకేం తక్కువని ఇట్లాంటి అవస్తని కొనితెచ్చుకున్నావమ్మా ! ఇలాగ దిక్కూ మొక్కూ లేకుండా ఆర్థాకలితో పడి వుండటం ... ఈ అవస్తలు..."

"మనిషికి - ఆకలిని తీర్చుకోవటం అవసరమేగాని, అదే అంత ముఖ్యమయినది కాదు నాన్నా."

"పోన్లే. ఒక్కగాను ఒక్క కూతురువి. ఒక ముచ్చటలేదు. నువ్వు ఇలాగ పడి బ్రతటం చూడటం మాకు ఎంతబాధగావుంటుందో ఆలోచించమ్మా. అతనికేం? వెళ్ళి జైలులో కూర్చున్నాడు..."

"అయితే ఇప్పుడు నేనేం చెయ్యను నాన్నా ?"

"నువ్వూ, అరుణా వచ్చెయ్యండి. మాతో వుందురుగాని. మీ అమ్మ ఎంతో సంతోషిస్తుంది. ఆవిడ గుండెల్లోని దిగులూ, గుబులూ ఎగిరిపోతుంది. వాళ్ళకి ఎన్ని పట్టుదలలు వున్నా నీ అన్నలు కూడా ఎంతో సంతోషించి నిన్ను నెత్తిమీద పెట్టుకుంటారు."

"అది జరిగేది కాదు నాన్నా. నా భర్త నడిచేదే నా బాట..."

"అయితే - నిన్ను కన్న నేరానికి నీ కన్నతల్లి అలాగ కృంగి, కృశించి చనిపోవాల్సిందేనా ? నీ తల్లి ఎంత కాలంగానో మంచం దిగటంలేదు. నువ్వు రాకపోతే తను ఇక బ్రతకదు తల్లీ. తను ఏం నేరం చేసిందని ఆమెకి ఈ శిక్ష తల్లీ..." ఆయన పసివాడివలె ఏడ్చాడు.

"నాన్నా..." సవిత కళ్ళలో నీళ్ళు పొంగివచ్చాయి, తల్లి గురించిన ప్రస్తావనతో.

"నా మాట విను తల్లీ. కడుపుతీపి ఎంత గొప్పదో అంత భయంకరమైన దీను."

సవిత కన్నీరు తుడుచుకుంది.

"సరే. పద నాన్నా" అని కూతుర్ని తీసుకుని అతని వెంట వెళ్ళింది. అవసానదశలో వున్న 'సవిత తల్లి' కూతుర్ని చూసి కోలుకుని కొత్తజీవితం పొందింది. అందుకు చాలా రోజులు పట్టింది ఆమెకి.

అప్పుడే సవితకి జైలునుంచి బ్రహ్మయ్య వుత్తరం రాసాడు.

"సవితాదేవీ ! జైలులో వున్న నాకు మిత్రులద్వారా సంగతి సందర్భాలన్నీ తెలిసాయి. నేను నిన్ను నడిపించిన దారి ముళ్ళబాట అని నాకూ తెలుసు. ఎన్ని ప్రతికూలమయిన పరిస్థితులయినా

ఎదిరించి నువ్వూ నా దారినే నడుస్తావని నేను అనుకోవటం అత్యాశే. కాని ఇపుడు నీ దారిని నువ్వు ఎన్నుకున్నావని విని ఎంతో విచారించినా—నాకు సంతోషంగాను అన్పించింది. మన దారులు చీలాయి. అందుకు నేను నిన్ను నిందించను. ఒకవేళ నీవు నన్ను దూషించినా నేనేం అనుకోను. ఇకనుంచీ మనం భార్యాభర్తలం కాకపోయినా మంచి మిత్రులుగా నయినా వుందాము. ఇన్నాళ్ళ నా సాహచర్యంలో నా ప్రయత్నాల గురించిన కొంత అవగాహన నీకు ఏర్పడి వుండవచ్చునన్న ఆశే నా మనసులో నీ మీది మిత్రభావం ఇంకా కొంత మిగిలివుండేటట్టు చేసింది. అరుణని ధైర్యం, వుత్సాహమే వూపిరిగా బ్రతికే వ్యక్తిగా తయారుచెయ్యటానికి ప్రయత్నించు. చాలా థాంక్సు సబితా. ఉంటాను—మిత్రుడు బ్రహ్మయ్య."

ఆ వుత్తరం చాలా దుఃఖాన్ని తెచ్చి పెట్టింది సబితకి. లోలోపల ఎంతగానో కుమిలిపోయింది. అరుణని కావలించుకొని ముద్దాడింది సబిత. బ్రహ్మయ్యది కఠోరమైన నిర్ణయం! అది ఇక మారదు. ఆ వుత్తరం సంగతి తెలిసి బిందులు తొక్కారు ఆమె అన్నలు.

ఆమె తండ్రి దిగులుతో కృంగిపోయాడు. మంచం పట్టాడు.

ఆ దిగులుతోనే ఆమె తల్లి కన్ను మూసింది.

శిక్ష పూర్తయింది.

బ్రహ్మయ్యని అతని అనుచరుల్ని వదిలిపెట్టారు.

ఊళ్లో మరల గొడవలు మొదలయ్యాయి. అడపా దడపా సంఘటనలు జరిగాయి. ఆవేశం కావేశం విజృంభించాయి.

ఇపుడు — సబితని, అరుణని పూర్తిగా మరిచిపోయాడు బ్రహ్మయ్య. మనిషి పూర్తిగా మారిపోయాడు. ఈ బ్రహ్మయ్య బాగా చిక్కిపోయాడు. కళ్ళు లోతుకు పోయాయి. బుగ్గలు లోపలికి తోసుకుని పోయాయి. కొండంత మనిషి కేవలం అస్థిపంజరంగా మిగిలిపోయాడు. ఈ మధ్య అతన్ని దగ్గొకటి పట్టుకుంది. ఆ దగ్గుతోపాటు రక్తం కూడా పడుతూ వుంది. వేళకి నిద్ర లేదు. తిండి తిప్పలు లేవు. గడ్డం పెరిగింది. జుట్టుమాసి జడలు కట్టినట్లుగా అయింది. అయినా ఆ కళ్ళల్లో ఒక పట్టుదల-ఒక మెరుపు-ఒక ఆలోచన.

ఆ రోజు అపరాత్రి సబిత దగ్గరికి వచ్చి కూర్చున్నారు ఆమె అన్నలు. వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకుంటున్న దాన్నిబట్టి సబితకి అర్థమయింది.

"ఊరు అతలాకుతలమయింది. తలకాయలు పగలటం సర్వసాధారణమయింది. ప్రశాంతమయిన పల్లెపట్టు జీవనంలో అశాంతి చోటు చేసుకుంది ఎవరూ తలెత్తుకుని తిరగలేకుండా వున్నారు. మంచీ, చెడూ లేకుండా

పోయింది. తమ మోచేతి క్రింది సీళ్ళుతాగి బ్రతకవలసిన కూలీల ఆగడాలు పెచ్చు మీరిపోతున్నాయి. పోరంబోకు భూముల్ని ఆక్రమించి దారులు లేకుండా చేశారు వాళ్ళు వూరి చెరువు నీరు విచ్చలవిడిగా ఉపయోగిస్తున్నారు. ఆదేమన్న వాళ్ళని దారుణంగా అవమానిస్తున్నారు. సమాజ జీవనం ఛిన్నాభిన్నమయింది. కట్టుబాట్లు తెగిపోయాయి. ఒక విశృంఖలత విశ్వ విహారం చేస్తూ వుంది. దీన్ని ఇలాగే సాగనిస్తే ఏది ఎలాగ అవుతుందోనన్న భయం, గ గు ర్పా టు జ నా న్ని వెర్రెత్తిస్తున్నది. అందువలన అందరూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చారు."

—సబిత గుండెల్లో గుబులు తొంగి చూసింది.

"ఈ పరిస్థితికి కారణమయిన ఒకే ఒక్క వేరుపురుగుని తొలగించటమే ఆ నిర్ణయం. మిగిలిఉన్న ఆ ఒక్క బంధాన్ని అతనే త్రెంపివేసుకున్నాడు. అతనికి మనసు అనేది వుందా ? మమత అసలే లేదా ? విశ్వాసం అంటే ఏమిటో తెలుసా ? అనురాగం, ఆత్మీయత, అనుబంధం అనేవి అసలు వుండవా ? అతను ఏమి మనిషి ?

అసలు అతను మనిషేనా అని?! మనిషే అయితే—తననే కోరి పెళ్ళిచేసు కుని, తననే నమ్ముకుని ఎన్నో కష్టాలు అవమానాలు సంతోషంతో అనుభవించ టానికి సిద్ధమయిన, కట్టుకున్న భార్యని-ఒకే ఒక్క అల్పసంఘటన ఆధారంగా అలాగ క్రూరంగా వదిలివేయటానికి నిర్ణయం తీసుకుంటాడా? అలాగ బంధాలు పుటుక్కున త్రెంచివేసుకొనే వాడు మనిషిగా జీవించదగునా?

—భయంతో వొణికిపోయింది సబిత మనస్సు. గుండెలు వూగులాడాయి.

"తల్లీ! చెల్లీ! ఇన్నాళ్ళూ నిన్ను చూసే మేము — అజ్ఞాతవాసానికి సిద్ధపడిన, న్యాయంకోసం కట్టుబడిన పాండవుల వలె వుండిపోయాము. ఇక ఆ బంధ నాలు లేవు. వాటిని అతనే త్రెంచివేసు కున్నాడు. ఏక్షణాన్నయితే అతను నీతో ఆ అనుబంధాన్ని త్రెంచివేసుకున్నాడో అప్పుడే మేమూ ఆ బంధాన్నుంచి విముక్తులమయ్యాము. ఇవాళ పెద్ద గొడవ జరగవచ్చును. ఆ గొడవలో ఏమయినా కావచ్చును. మమ్మల్ని క్షమించు చెల్లీ," అని చివ్వున లేచి పోయారు అయిదుగురూ.

'అన్నా, అన్నా.' అనే దీనాలాపం, ఆర్తనాదం సబిత నోటినుంచి వెలువ డకముందే వాళ్ళు చాలా దూరం వెళ్ళి పోయారు—నకచకా-ఉద్రేకం పరవళ్ళు తొక్కుతుండగా.

పరుగులాంటి నడకతో వాళ్ళనే అనుసరించింది సబిత.

ఊరు మాటు మణిగింది. అర్ధరాత్రి దాటి ఎప్పుడో అయింది. ఆ తర్వాత చాలా గంటలూ గడిచాయి. ఒకటి రెండు కుక్కలు దీనంగాశోకిస్తున్నాయి.

ఊరికి వుత్తరాన వున్న స్మశానంలో నక్కలు గోలపెడుతున్నాయి.

నల్లని కాటుకవంటి చీకటి. ఈదురు గాలి

ముళ్ళు గుచ్చుకున్నా— ఎదురుదెబ్బ లకి కాళ్ళుపగిలి రక్తంచిమ్మినా లెక్క చేయలేదు సవిత. గుండెలోంచి ఎగ దన్నుకవస్తూవున్న ఆందోళనని అణుచు కోలేక పడుతూలేస్తూ పరుగెత్తింది సవిత—పిచ్చిపట్టినట్లు.

రచ్చబండ దగ్గర చేరిన నలుగుర్నీ కూడగట్టుకుని కర్రలు, బ్యాటరీలైట్లూ తీసుకుని డొంకవెంట సాగిపోయారు 'వాళ్ళు'. పరుగుతోవాళ్ళని వెంటాడింది సవిత.

అంతలోనే—కేకలు - పెడబొబ్బలు. భీషణమైన దూషణలు.

కర్రలు లేచాయి.

టపటప మన్నాయి.

ఆ క్రందనలు చెలరేగాయి,

భీషణంగా సాగుతున్నది పోరాటం.

"ఆగండి. ఆగండి" అంటూముందుకి దూకి వారి మధ్యకి వెళ్ళింది సవిత.

వెంటనే 'అమ్మో, అయ్యో' — ఆక్రందన చేసింది బాధగా. సవిత శరీరం క్షణాల్లో రక్తసిక్తమయింది, తమమధ్య స్త్రీ గొంతువిని అందరూ ఆగిపోయారు. బ్యాటరీలైటు వెలిగింది. ఆ వెలుగులో రక్తంలో మునిగి—తల బ్రద్దలయిన సవితని ముందువరుసలో నిలబడివున్న ఆటు బ్రహ్మయ్య—ఇటు ఆమె పెద్దన్నా ఇద్దరూ చూసారు. ఆమె అన్నలు తెల్లబోయి నిశ్చేష్టు లయారు. ఆమెను ఆస్థితిలో చూడగానే గిర్రున వెనుదిరిగాడు బ్రహ్మయ్య.అతని వెనకే అతని అనుచరులూ.

'చెల్లీ!'

బావురుమని ఏడుస్తూ ఆమెమీద పడ్డారు ఆమె అన్నలు అయిదుగురూ— పసిపిల్లల్లా విలవిలలాడి పోయారు కసి దీరా అతన్ని తిట్టుకుంటూ చెల్లెలిశవాన్ని బుజాలమీదకి ఎత్తుకున్నారు.

గబగబ నడుస్తూవున్న బ్రహ్మయ్య హఠాత్తుగా ఆగాడు. వెలికలు తిరిగాడు బాధతో విలవిలలాడ్తూగిలగిల్లాడ్తూ క్రింద కూలిపోయాడు. ఫెళ్ళు ఫెళ్ళునదగ్గాడు. ఊశాడు. బాటరీలైటు వెల్తురులో—అతను వూసింది రక్తమని చలనరహితుడుగా అయిపోయిన అతను నిర్జీవుడనీ—అతని అనుచరులకి అర్థమయింది.బ్రహ్మయ్యని భుజాలమీదకి ఎత్తుకున్నారు వాళ్ళు. కసిగా తిట్టుకుంటూ—కరడుగట్టినభూస్వా ముల తత్వాన్ని నిరసిస్తూ ముందుకి సాగారు.

తెలతెల వారుతోంది.

అప్పుడే తూర్పుదిక్కున ఎర్రని రంగులు తొంగిమాస్తూ వున్నాయి. ఆ రంగుల మేలవింపులో ఆందోళనవుంది. ఆవేశమూ వుంది. ఆ రంగులు వేటికి ప్రతీకలు అన్న సంగతిని ఎవరికివాళ్ళు నిర్ణయించుకోవటంలోనే ఔచిత్యం వుందనిపిస్తుంది.

———




ఆ రోజంతా నేను చాలా అశాంతిగా గడిపాను.

నా మనసులో పొంగుతున్న ఉద్రిక్తతని ఆపటం నా వశం కావటం లేదు. "ఎవరో పిచ్చివాడు." జయ మాటలు మాటి మాటికీ, నా చెవుల్లో మారుమోగుతున్నాయి. నాకు జయ కంఠం నులిమి వేయాలనిపిస్తోంది! నన్ను ఈ నరకంలోకి తోసి, జయ ఎంత హాయిగా, జీవితం వెళ్ళదీస్తోంది! ఆడపిల్ల అయినా, జయకి వెరపులేదు. అపాటి ధైర్యం, మనో నిబ్బరం ఎంత ప్రయత్నించినా నా కెందుకు వుండటం లేదు! నా మనసు ఎందుకింత తేలిగా అయిపోతోంది! ఆ రోజు, ఆ మర్నాడంతా నేను గదిలో తలుపులు మూసుకుని కూర్చుని బయటికి రాలేదు. అక్కయ్య నా గురించి మళ్ళీ ఆదుర్దాపడసాగింది.

"ఒరేయ్, ప్రసాద్! ఒక్కసారి మళ్ళీ హాస్పిటల్‌కి వెళ్ళి చూపించుకు రారా."

"ఎందుకు అక్కయ్యా?"

"నీ ఒంట్లో సరిగ్గా లేనట్టుంది." బెంకుగా అంది.

నేను ఛర్రుమన్నట్టు చూసాను.

"మీ కెవరికీ, ఎప్పుడూ నలతగా

అనిపించదా అక్కయ్యా! మీ రెవరూ ఎప్పుడూ అశాంతిగా వుండరా ? మీరు హాస్పిటల్‌కి పరుగెత్తుతున్నారా !"

"అదికాదురా !"

నేను హఠాత్తుగా అక్కయ్యకి చేతులు జోడించాను.

"అక్కయ్యా ! నీకు పుణ్యం వుంటుంది. నేను పిచ్చివాడినన్న సంగతి నాకు ఎప్పుడూ గుర్తుచెయ్యకు. లోకం అంతా నన్ను చూసి నవ్వనీ, నన్ను హేళన చెయ్యనీ, కానీ — కానీ — నువ్వు మాత్రం —"

అక్కయ్య చప్పున నా చేతులు పట్టుకుంది.

"ప్రసాదూ —"

"ఈ ప్రపంచంలో, నన్ను అర్థం చేసుకోగలిగిన వాళ్ళెవరైనా వుంటే, నువ్వు ఒక్కదానివేనని నమ్ముతున్నాను. నువ్వు కూడా నన్ను..."

"ప్రసాద్! యింకేం మాట్లాడకురా. యింకేం మాట్లాడకు'' అంది అక్కయ్య.

ఆ రోజుతో అక్కయ్య నా ఆరోగ్యం గురించి అడగటమే మానేసింది. నేనే అప్పుడప్పుడూ వెళ్ళి డాక్టర్‌చేత చెక్ చేయించుకుంటున్నాను. వాళ్ళు చెప్పిన మాత్రలు దగ్గరపెట్టుకుని శ్రద్ధగా వాడుకుంటున్నాను !

రాను, రాను, నా జీవితం, కటకటాల మధ్య మృగంలా మరీ మరీ ఒంటరితనంగా అయిపోయింది ! ఈ ప్రపంచం నన్ను వెలివేసినట్టుగా, దూరంగా వుంచేసింది ! బంధువులతో నా సంబంధ బాంధవ్యాలు తెగిపోయినాయి ! పుస్తకాలు, పెరటితోట పెంపకం నా లోకం అయిపోయినాయి! చదువుకునే రోజుల్లో, సరదాగా నేర్చుకున్న గిటార్ మళ్ళీ సాధన ప్రారంభించాను. నా ఒంటరితనంలో నాకు అది ఒక తోడు అయింది. కానీ నేను కావాలని కల్పించుకున్న ఈ కాలక్షేపాలు, నాకు ఆనందం కలిగించటంలేదు !

మాటా పలుకూ లేని బొమ్మలతో ఆడి, ఆడి విసుగెత్తిపోయిన చిన్నపిల్లవాడిలా వుంది నా మనస్తత్వం. నాకు స్నేహితులు కావాలి ! నా జీవితం నవ్వుతూ, తుళ్ళుతూ మళ్ళీ మామూలుగా వుండాలి. కాని యిదెలా సాధ్యం ?

ఒక రోజు సాయంత్రం నేను బజారు నుండి తిరిగివచ్చాను. నా రెండుచేతుల నిండా పుస్తకాల పాకెట్లు, దొంతరగా వున్నాయి ! అక్కయ్య నా కోసం ఎవరో వచ్చారని నా గదిలో కూర్చుని వున్నారని, చెప్పింది!

నాకోసం ఎవరో వచ్చారా !

ఎన్నాళ్ళకి విన్నాను ఇంత మంచి మాట ! ఈ ప్రపంచంలో యింకా నన్ను చూడాలని, నాతో మాట్లాడాలని అనుకునేవాళ్ళు వున్నారా ! నేను పుస్తకాల పాకెట్లు పదిలంగా పట్టుకుని కుతూహలంగా చూస్తూ, నా గదిలో

అడుగుపెట్టాను. సాయంత్రం అవుతూం దటంవల్ల ఆక్కడ చీకట్లు ముసురు కుంటున్నాయి! కిటికీ దగ్గర నిలబడి, అటువైపు చూస్తున్న వ్యక్తి ఎవరో హఠాత్తుగా నాకు తెలియలేదు.

నేను గదిలోకి వచ్చాను!

నా పాదాల అలికిడి విని కాబోలు, అతను యిటు తిరిగి చూసాడు.

నా కళ్ళు ఆనందాశ్చర్యాలతో వెడల్పు అయినాయి.

"వేణూ!" అస్పష్టంగా అన్నాను.

వాడు రెండంగల్లో వచ్చినట్టుగా, నా దగ్గరికి వచ్చాడు. నేను నా చేతుల్లో పుస్తకాలు టేబిల్‌మీద పడేసి నట్టుగా వదలేశాను !

"వేణూ !"

వాడు నాలాగా, ఆనందం వెలిబుచ్చ లేదు. నా దగ్గరగా వచ్చి నాకు అభిముఖంగా నిలబడ్డాడు ! నన్ను నఖశిఖ పర్యంతం చూస్తున్నాడు! నేను అనుమానంలో పడ్డాను !

వీడు కూడా నేను పిచ్చివాడినని భయపడుతున్నాడా ! వేణు గభాల్న నన్ను రెండుచేతులతో, దగ్గరికి లాక్కు న్నాడు ! పసిపిల్లని తల్లి అక్కున చేర్చుకున్నట్టుగా నన్ను గాఢంగా గుండెలకి అదుముకున్నాడు. "జయ - జయ యిలా చేసిందంటే, నేను నమ్మ లేకుండా వున్నానురా!" అన్నాడు.

"నేను మాట్లాడలేదు ! వాడి ఓదార్పులో వున్న శక్తి ఏదో నాలో దుఃఖపు పొరకి సూదిగా తగిలి, గొంతు లోకి తన్నుకువచ్చినట్టు అయింది.

"నా కివేవీ తెలియనే తెలియవు!"

"నువ్వు ఫారిన్ వెళ్ళిపోయావు. మన సంబంధ బాంధవ్యాలే తెగిపోయి నాయి" అన్నాను.

"అవునురా! అప్పుడు జీవితంలో ఆ వెతుకులాట అలాటిది! మనిషి భవిష్యత్తుకి పునాది వేసుకునే సమయంలో, స్నేహితులు, బంధువులు, ఎవరూ గుర్తుకురాని, తీరిక చిక్కని ఏకాగ్రత వుంటుంది ! కానీ స్థిరపడింతర్వాత, అందరినీ చూడాలనిపిస్తుందిరా !"

"నువ్వు ఎప్పుడు వచ్చావు ?

"మొన్న. రాగానే మా పిన్నిని నా స్నేహితులందరి గురించీ అడిగాను. నీ గురించి ఆవిడ చెప్పిన విషయాలు వినగానే, నా తల గిఱ్ఱున తిరిగి పోయింది! నువ్వు ఎవరితో మాట్లాడటం లేదని, అందరితో అన్ని సంబంధాలు తెంచుకున్నావని చెప్పింది. నన్ను వెళ్ళవద్దని అంది! కానీ నా మనసు వూరుకోలేదు ! నిన్ను చూడకుండా వుండలేకపోయాను !''

"థాంక్స్‌రా! కూర్చో!"

ఇద్దరం కూర్చున్నాం !

వాడు అక్కడికి వచ్చి చాలా సేపయిందని, ఆష్ట్రేలో అక్కడ కన్పిస్తున్న సిగరెట్ పీకలే చెబుతు

న్నాయి! అక్కయ్య కాఫీ ఇచ్చినట్టు, వాడు తాగిపెట్టిన ఖాళీ కప్పు కన్పిస్తోంది.

"మీ అక్కయ్య అంతా చెప్పింది నాకు! ఇదంతా వింటుంటే - మై గాడ్! నేనెంత అదృష్టవంతుడిని అన్పిస్తోంది!" అన్నాడు వేణు.

"అంటే ?"

"నీకు తెలియదేమోరా! వాళ్ళు మొదట నాకు ఎఱ వేసారు! ఈ లోపల నువ్వు తగిలావు! నాకంటే బాగా వున్నవాడివి! అందమైనవాడివి! ఆ గేలం నీవైపు తిరిగింది! భగవంతుడు నన్ను రక్షించాడు!" రెండు చేతులు ఎత్తి దణ్ణం పెట్టాడు. "లేకపోతే ఈ నరకంలో నేనుండేవాడిని!"

"పెళ్ళిచేసుకున్నావా?"

"అదేమిట్రా! నీకు శుభలేక పంపాను! నువ్వు గ్రీటింగ్స్‌కూడా పంపావు కదా!"

"ఓ! సారి మర్చిపోయాను," అన్నాను. కానీ నాకు నిజంగానే గుర్తు లేదు.

"ఇద్దరు పిల్లలు. నా భార్య పెద్ద బ్యూటీ కాదు గానీ, ఫర్వాలేదు." నేను నిట్టూర్చాను!

ఇద్దరం కూర్చుని చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాం!

ఆ రోజు నా మనసెంతో హాయిగా అనిపించింది!

వేణు లండన్‌లో ఏదో డిపార్ట్‌మెంటల్ స్టోర్‌లో పనిచేస్తున్నాడు. పెద్ద వుద్యోగం కాకపోయినా, అతని భార్య కూడా జాబ్ చేస్తుండటంవల్ల బాగానే సరిపోతోందిట! ఎవరినో పట్టుకుని, ఎలాగో కష్టపడి అక్కడికి వెళ్ళి ఆ వుద్యోగం సంపాయించుకున్నాడు. అక్కడే ఆ అమ్మాయితో స్నేహం కలిసి పెళ్ళిచేసుకున్నాడట. ఎంతమంది చేసుకోవటంలేదు పెళ్ళి! అందరి జాతకం నాలాగా అవుతుందా!

వేణు వెళుతుంటే అక్కయ్య మర్నాడు భార్యని, పిల్లల్ని భోజనానికి తీసుకురమ్మనమని మరీ మరీ చెప్పింది.

మర్నాడు వేణు భార్యాపిల్లలతో, భోజనానికి వచ్చాడు!

వేణు భార్య మాధవి చాలా కలుపుగోలు మనిషి! అందగత్తె కాకపోయినా, ముఖంలో చురుకుదనం, కళ వున్నాయి. పిల్లలిద్దరూ ముత్యాల్లా వున్నారు!

పెళ్ళిఅయిన తర్వాత వేణులో స్థిరత్వం, హుందాతనం వచ్చినాయి అంటే, వాటికి కారణం ఆ అమ్మాయి ప్రభావమే అని తెలుస్తోంది!

భార్యా పిల్లలతో కళకళలాడుతున్న వేణుని చూస్తుంటే, కొత్తగా రంగువేసిన భవంతి గుర్తుకు వస్తోంది! నా జీవితమో శిథిలమైన మొండి గోడలుగా వుంది! ఇది నా స్వయంకృతాపరాధమే!

వేణు వున్న నాలుగురోజులు వాడితోనే తిరిగాను. పిల్లలిద్దరూ 'అంకుల్'

అంటూ నాతో ఎంతో చనువుగా మసిలారు!

వాడు వెళ్ళిపోయాడు.

నేను స్టేషన్‌కి వెళ్ళి వాళ్ళని పంపి తిరిగి వస్తున్నాను! వాన పడుతోంది!

వానధారలు పూసలతోరణాల్లా గ్లాసులో నుంచి మెరుస్తూ కన్పిస్తున్నాయి! నా మనసు పరిపరివిధాల పోతోంది! నేనేం తప్పుచేసానని యీ శిక్ష!

నా మనసులో భూకంపంలాటి ఒంటరితనం మళ్ళీ భయంకరంగా ప్రవేశిస్తోంది! నా దవడలు మాటిమాటికీ దంతాలని నొక్కుతున్నట్టుగా, బిగుసుకుంటున్నాయి! నా కణతల దగ్గర నొప్పి ప్రారంభమైంది!

ఈ స్థితేమిటో నాకు తెలుసు! నేను త్వరగా యింటికి వెళ్ళిపోవాలి! భగవంతుడా! నేను అసలు ఒంటరిగా, వెంట డ్రైవరు తోడు లేకుండా, యీ కారు ఎందుకు తీసుకువచ్చాను! నేను సవ్యంగా యింటికి చేరగలనా!

నా దృష్టి రోడ్డుమీదసరిగ్గా నిలవటం లేదు. మాటి మాటికీ చీకటితెరలు కమ్ముకుంటున్నట్టుగా చెరిగిపోతోంది.

ఒక ఆటోకి కొట్టుకోబోయికీచుమంటూ ఆగి పక్కకు తిరిగింది! అవతలినుంచి వస్తున్న టాక్సీ అతను రెప్పపాటుగా, తనటాక్సీని పక్కకు తిప్పకపోతే నా కారుతో, ఆ టాక్సీ గుద్దుకునేదే!

నేను స్టీరింగ్‌ని కంట్రోలు చేసుకోవటానికి, దృష్టి చెదరకుండా, మనసు చిక్కబట్టుకోవటానికి, విశ్వప్రయత్నం చేస్తున్నాను. కానీ నావల్ల కావటంలేదు. కారు, దానిష్టం వచ్చినట్టు వెళ్ళిపోతున్నట్టుగా వుంది

నాకు చెమటలు కారుతున్నాయి. నా తలమీద వేయి గొడ్డళ్ళతో బాదుతున్నంత బాధగా వుంది.

నేను స్పీడ్ ఎక్కిస్తున్నానో, తగ్గిస్తున్నానో నాకే తెలియటంలేదు! నా కారు రంయ్‌న వెళ్ళిపోతూనే వుంది. వాన వస్తూనే వుంది! నాకేమీ కనిపించటం లేదు. నా కారు నాతో ప్రమేయం లేనట్లుగా వెళ్ళిపోతోంది.

హఠాత్తుగా ఆకాశమే విరిగి క్రింద పడిందా అన్నట్టు పెళ పెళా చప్పుడు అయింది.

నా కారు దేనికి కొట్టిందో, నాకు తెలియదు. నేను మాత్రం స్టీరింగ్ మీదకి వొరిగిపోయాను.

ఎన్ని గంటలు గడిచినాయో నాకు తెలియదు.

ఎవరెవరో వచ్చారు. నన్ను కారులో నుంచి లాగినట్టు యివతలకి యీడ్చారు. ఏదేదో అడిగారు. నేను జవాబు చెప్పలేక పోతున్నాను. నా కళ్ళు మూరుకు పోతున్నాయి.

వాళ్ళు నన్ను పోలీసు స్టేషనుకి పదమన్నారు. నన్ను బలవంతంగా తీసుకెళ్ళారు.

అక్కడ కొన్ని యుగాలు గడిచిన తర్వాత, నన్ను చూడటానికి అక్కయ్య వచ్చింది.

"నేను యాక్సిడెంట్ చేసిన రిక్షాలో వ్యక్తి చనిపోయిందట! రిక్షా అతను ఎగిరి అవతల పడటంతో బ్రతికి బయట పడ్డాడుట!"

నేను తల వంచుకుని వింటున్నాను.

అక్కయ్య ఏడుస్తూ అంది. "ప్రసాదూ! రిక్షాలోనున్న వ్యక్తి ఎవరో తెలుసా?"

"ఎవరక్కయ్యా?" నిర్లిప్తతతో అడిగాను.

అక్కయ్య ఏడుపే జవాబు అయింది.

"ఎవరయినాగానీ, నావల్ల ఆ వ్యక్తి చచ్చిపోవటం జరిగింది. నాకున్న ఆస్తి అంతా ఆ వ్యక్తి కుటుంబానికి వ్రాసి యిచ్చేస్తాను," అన్నాను.

"ఆ వ్యక్తి ఎవరో కాదురా! జయ! జయని నువ్వు చంపేశావు!"

నేను చివాలున తలెత్తాను!

నా చూపులు వెలవెలా పోయాయి.

అక్కయ్య చెయ్యి గట్టిగా పట్టుకున్నాను.

"ఏమిటి? ఏమిటి నువ్వనేది?"

"జయ స్నేహితురాలి ఇంటిదగ్గర నుండి తిరిగివస్తోందిట! వానగా వుండటంవల్ల, ఆటోగాని, టాక్సీగాని దొరకలేదుట! రిక్షాలో ఎక్కించి తనే పంపానని స్నేహితురాలు చెప్పింది! ఆ రిక్షానే నీ కారు యాక్సిడెంట్ చేసింది! నువ్వు కావాలని, జయని చంపటానికే యీ యాక్సిడెంట్ చేసావని అంటున్నారు అంతా!"

"నో! నో! నో!" నేను పిచ్చి వాడిలా అరిచాను.

నాకు హఠాత్తుగా వొంటినిండా చెమటలు పట్టాయి!

"జయ చచ్చిపోయిందా!

నేను చంపేశానా!?

అబద్ధం! సర్వాబద్ధం! ఈ మాట అన్నవాళ్ళని నిలువునా చీరేస్తాను! నాలిక చీల్చేస్తాను! తల చితక కొడతాను!"

"ప్రసాదూ! ప్రసాదూ!" అక్కయ్య నన్ను పట్టుకుంది. నేను హఠాత్తుగా పసిపిల్లవాడిలా, దెబ్బతిన్న కుక్కపిల్లలా దీనంగా చూస్తూ చేతులు జోడిస్తూ అన్నాను.

"అక్కయ్యా! నిజం చెబుతున్నాను. నేను జయని చంపలేదు! చంపలేదు"

(సశేషం)

*

# బోణీ

ముప్పిరాల శ్రీధరమూర్తి



ఆ రోజు ఆఫీసు కెళ్ళగానే రెండు విషయాలు తెలిసాయి. మొదటిది, వూర్లో పోలేరమ్మకు జాతర చేస్తారట. రెండోది, మా ఆఫీసు ఇన్‌స్పెక్షన్ అట పదిహేను రోజుల్లో. పోలేరమ్మకు ముందే మా ఆఫీసుకు హైదరాబాదునుంచి పోతురాజు వచ్చి పడ్డాడు. పోతురాజు అసలు పేరు వీరభద్రరావు మా ఆఫీసు రికార్డు తనిఖీ చేయడంకోసం హెడ్డాఫీసు నుంచి వచ్చిన పోతురాజు పిడకల కుప్ప ఎక్కి కూర్చున్న అల్లుడిలా తయారయాడు వారం రోజుల్లో. ఆయనకు జరిగే పరిచర్యల్లో ఎక్కడ లోపాలు జరిగిపోతాయో అని మా ఆఫీసరు ఒకటే కంగారు పడిపోతున్నాడు.

ఇన్‌స్పెక్షన్ రోజు దగ్గరపడుతున్న కొద్దీ పోతురాజు కోరికలు ఎక్కువయి పోతున్నాయి. మాకు ఓపిక సన్నగిల్లి పోతూవుంది. ఇక రెండ్రోజుల్లో అసలు దొరగారు తనిఖీ చెయ్యడానికి వస్తారనగా — ఆ రోజు పొద్దున్నే ఎనిమిది గంటలకల్లా స్టాఫ్ అంతా వచ్చి పనులు చూసుకొంటున్నారు. కానీ, ఒక్క వెంకటరమణ మాత్రం రాలేదు. సరిగ్గా పదిగంటలయింది.

బయట సూర్యుడు ప్రజలమీద, ఆఫీసులో దొరగారు మా మీద మండిపడి పోతున్నారు. ఆ సమయంలో వెంకటరమణ పెద్దకొడుకు లీవు లెటరు తెచ్చి నా చేతికిచ్చి వెళ్ళిపోయాడు. దాంతోనే నాకుద్దేశించిన ఒక చీటీకూడా వుంది. "చంటివాడికి సీరియస్‌గా వుంది. చేతిలో పైసాలేదు. ఎలాగైనా ఓ ఇరవై రూపాయలు మధ్యాహ్నానికి సంపాదించుకొని, ఓసారి రా" అని సారాంశం.

ఆఫీసరుగారి కేబిన్‌లోకి వెళ్ళి

వెంకటరమణ లీవు రిపోర్టు జేబిలుమీద వుంచాను. వస్తున్న కోపాన్ని అణుచుకుంటూ "ఆఁ బోణీ అయిందన్నమాట. కావాలనుకున్నప్పుడు సీరియస్ కేసులు వస్తాయి మీకంతా. ఇలా అయితే ఇక ఇన్‌స్పెక్షన్ అయినట్లే," అంటూ ఒక చిన్న లెక్చర్ దంచారాయన. నేను నా సీట్లో కెళ్ళి కూర్చున్నాను. వెంకటరమణ అడిగిన డబ్బు ఎలా సర్దడమా అని గింజుకుంటున్న నాకు గేట్లో వాలీఖాన్ దేముడు పంపిన మనిషిలా కనిపించాడు. వాలీఖాన్ అంటే హిందూస్థానీ సంగీత విద్వాంసుడు కాడు. ఇతను కాబూలీ వాలా. ఆపత్సమయాల్లో మా గుమాస్తాలను ఆదుకునే ఆపద్బాంధవుడిలాంటివాడు.

వాలీఖాన్ గడ్డం పట్టుకొని పాతిక రూపాయలూ, ఆఫీసరుగారి చేతులు పట్టుకొని (ఆయనకు గడ్డం లేదుగనక) పర్మిషనూ తీసికొని వెంకరమణ యిల్లు చేరుకునేసరికి సాయంత్రం నాలుగు అయింది. కానీ అప్పటికే చంటివాడు మందులూ, పాలూ అక్కరలేని చోటుకి వెళ్ళిపోయాడు. ఇంటిలో పరిస్థితి ఘోరంగా వుంది. పిల్లలు ప్రొద్దుటి నుంచీ అన్నం తిన్నారో లేదో పరమాత్ముడికే తెలియాలి. ఇక ఆలస్యం చేస్తే బ్రతికున్న పిల్లలు కూడ శవాల్లా తయారయేట్లున్నారు.

కుర్రాణ్ణి భుజాన వేసుకున్నాను. ఎంత వద్దంటున్నా వెంకటరమణ నా వెంబడి స్మశానానికి బయలుదేరాడు. స్మశానంలో కాటికాపరి మాలాంటివాళ్ళ కోసమే ఎదురుచూస్తున్నట్లు వున్నాడు. చాలా ఈజీగా, జోవియల్‌గా ఈల వేసుకుంటూ గోయి తవ్వేశాడు వాడు. నేను చెయ్యాల్సిన పనిని చేసేశాను. దూరంగా వెళ్ళి నుంచున్నాడు వెంకటరమణ. అంతా అయిపోయింది. జేబులోంచి అయిదురూపాయలు తీసిచ్చాను కాటికాపరికి. "బాబ్బాబూ, "పది ఇప్పించండి" అంటూ వెంటపడ్డాడు వాడు.

"అదేంటి, నీ మా మూలు అయిదేటగా" అంటూ నా బేరం.

"మరే, ఈ రోజు కిదే బాబూ బోణీ. ఈ సారికి పదిప్పించండి. మరోసారికి చూసుకుందాం." వాడి అభ్యర్థన.

నా వీపున ఛెళ్ళుమనిపించిన ఆ మాట పదిప్పించింది, వాడికి మారుమాట లేకుండా.

ఇంటికి వస్తున్న నాకు అదే మాటలన్న మా ఆఫీసరు గుర్తుకొచ్చాడు. పై మెట్టున ఆఫీసరు, అడుగు మెట్టున కాటికాపరి, నడుమనున్న నాలోని మధ్య తరగతి సంసారి మందహాసం చెయ్యకుండా వుండలేకపోయాడు.

---

# రైళ్ళు

రాత్రి 11–30 అయింది.

కిటికీవద్ద నిలబడి దూరంగా కనబడుతున్న గూడ్సుబండినే చూస్తున్నాడు జగపతి.

చీకట్లో నల్లగా–దీపాలు లేక–నీడలా కదలిపోతూంది మలుపుతిరిగే వరకూ చూసి మెల్లగా వచ్చి కుర్చీలో కూచున్నాడు జగపతి.

ఆ గది అతని హృదయానికి ప్రతిబింబంలా ఉంది. చీకటిని పారద్రోలడానికి విశ్వప్రయత్నం చేస్తున్న నైట్‌ల్యాంపు–అతని మదిలో ఆశలా ఉంది. ఆ చీకటి–అతని మదిలో అలముకున్న అశాంతిలా ఉంది.

అతనికి చిన్నప్పుడు చదువుకొన్న యింగ్లీషుపద్యం గుర్తువచ్చింది. అందులో–ఏమీ తెలియని పసివాడు తన తల్లిని అడుగుతాడు. "అమ్మా! నేను రోజూ యిన్నిరైళ్ళు చూస్తూంటాను. కొన్ని దీపాలతో, కిటికీలతో అందంగా ఉండి–ఆనందంగా సాగిపోతాయి. మరి కొన్ని దీపాలు లేక–చీకటిలో నిశ్శబ్దంగా నడుస్తుంటాయి. అమ్మా! యివన్నీ ఎక్కడికిపోతాయి?" అని.

జీవితాలు కూడా అంతే.

కొందరి జీవితాలు–కష్టాలనేవే లేక–సంతోషంగా గడిచిపోతాయి. వారికి అంతా వెలుతురే

మరికొందరి జీవితాలు దుఃఖంతో–భారంగా గడిచిపోతాయి. వారి కెటు చూచినా చీకటే–తనలాగా.

రైళ్ళలో ఎందరో మనుషులు ఎక్కుతారు. ఎందరో దిగుతారు. జీవితంలో ఎందరో వ్యక్తులు కలుస్తారు. ఎందరో విడిపోతారు. ప్రాణప్రదంగా ప్రేమించిన వ్యక్తి విడిపోతే–ఆ బాధ తనకు బాగా అనుభవం

జగపతి ఆలోచిస్తున్నాడు.

అతనికి 'చైతన్య' గుర్తుకు వచ్చాడు.

అతని కళ్ళు చెమర్చాయి.

చైతన్య!

ఎంత గారాబంగా పెంచాడు వాడిని! వాడు పుట్టగానే తనలో ఏదో చైతన్యం వచ్చింది. అందుకే చైతన్య అని పేరు పెట్టాడు వాడికి.

అయిదేండ్లదాకా అడుగు కింద పెట్టనియ్యకుండా ఎత్తుకు పెంచాడు. కాని—

వాడిలా చేస్తాడనే ఊహ తనకు రానేలేదు. అసలు వాడు–తననుంచి విడిపోతాడని ఊహించనేలేదు. జగపతికి ఆనాటి దృశ్యం జ్ఞాపకం వచ్చింది.

ఆనాడు—

"నేనీ పెళ్ళికి అంగీకరించను" అన్నాడు తాను.

పవని. రా. భానుమూర్తి

"ఏం? రూపకేం తక్కువయింది? చదువులేదా? రూపంలేదా? అందం, చదువు, గుణం అన్నీ ఉన్న రూపకేం తక్కువయింది నాన్నా! మన కులం కాదనేగా?" అన్నాడు చైతన్య.

"అవును చేతన్! మన కులం కాని అమ్మాయిని నువ్వు చేసుకుంటే మన జమీందారీ పరువు ప్రతిష్ఠలేంకావాలి? డబ్బు లేకపోయినా నా కంగీకారమే— కానీ మన వంశమర్యాదకు యేమాత్రం భంగం కలిగినా నేను సహించను చేతన్!" ఆవేశంగా అన్నాడు తాను.

"నాన్నా! మీరు పెద్దవారు. అన్నీ తెలిసినవారు. మీరిలా ఆవేశపడడం భావ్యంకాదు. కులాలు మనిషి సృష్టించుకున్నవి. పుట్టగానే మీరూ ఏడ్చారు. నేనూ ఏడ్చాను. అందరూ ఏడుస్తారు. ఆనందమైతే మీరూ నవ్వుతారు. నేనూ నవ్వుతాను. అందరూ నవ్వుతారు. మీరు గొప్ప వంశస్థులనీ, అగ్రకులం వారనీ—వారు నీచకులాల వారనీ నవ్వుకూ—ఏడుపుకూ లేని తేడా మనిషి కెందుకు నాన్నగారూ?"

"చేతన్! నీవు పిల్లవాడివి. నీకు తెలియదు. గడ్డిపువ్వూ గులాబీ రెండూ నేలమీదే పూస్తాయి. అంతమాత్రాన రెండూ ఒకటే అంటావా?"

"కాదు నాన్నగారూ! గులాబీని అందరూ ముద్దుగా చూసుకుంటారు. తలలో ముడుచుకుంటారు. అయినా గులాబీ పువ్వు దగ్గరి కెళితే ముళ్ళు గుచ్చుకుంటాయి. గడ్డిపువ్వును అందరూ హేళనగా చూస్తారు. కాలితో తొక్కి నలిపేస్తారు. అయినా అది ఓర్పుతో సహిస్తుంది. అందుకే—గులాబీ కంటే గడ్డిపువ్వే గొప్ప నాన్నగారూ!" ఆవేశంగా అన్నాడు చైతన్య.

జగపతికి చాలా కోపమొచ్చింది

"చేతన్! నువ్వెన్ని చెప్పినా నేనీ పెళ్ళికి అంగీకరించను. నీకూ, నాకూ మధ్య ఏవిధమైన సంబంధమూ లేదనుకుంటే—నీ యిష్టం?" అన్నాడు తాను.

"అలాగే నాన్నగారూ! మనిషి కంటే కులం గొప్పదనుకునే మీరు ఏ నాటికైనా నిజం గ్రహిస్తారు. ఏనాటికైనా నన్ను తిరిగి మీరే ఆహ్వానిస్తారు. అంతదాకా నేనీ యింటకిరాను," అంటూ వెళ్ళిపోయాడు చైతన్య.

వాడు వెళ్ళిపోయి రెండు సంవత్సరాలయింది.

వాడిని గురించిన విషయాలు తాను తెలుసుకుంటూనే ఉన్నాడు. యిప్పుడో బాబట——

వాడు వెళ్ళిపోయాక ఎంత బాధను భవించాడు తాను! నష్టపోయింది తానేనేమో! జగపతి కళ్ళనుండి రెండు నీటి చుక్కలు రాలాయి.

నిజమే! వాడు చెప్పినట్టు మనిషి కన్నా కులమే గొప్పదనుకున్నాడు అప్పుడు తాను!



కానీ మొన్నటిదాకా నిజం గ్రహించ లేకపోయాడు.

మొన్న—

కృష్ణవేణికి చాలా సీరియస్‌గా తయారయింది.

మొదలే చాలా బలహీనపు మనిషి.

కొడుకు దూరమయ్యాక బెంగతో మంచంపట్టింది. త్వరత్వరగా హాస్పిటల్‌కు తీసుకెళ్ళాడు. డాక్టర్లు పరీక్షించి బ్లడ్ తక్కువయిందన్నారు.

తనరక్తం చూశారు.

సరిపోలేదు.

తనకేమీ పాలుపోలేదు.

పక్కనే ఉన్న పాలేరు రామునివంక దీనంగా చూశాడు.

"బాబూ!నా రగతం సరిపోతాదేమో! సూడమనండి బాబూ!" అన్నాడు వాడు.

'నీదా !?' అన్నాడు జగపతి ఆశ్చర్యంగా

"అవును బాబూ! యిన్నాళ్ళనుంచీ మీకాడ పనిచేస్తున్నాను. ఆ యమ్మ సల్లనితల్లి. ఆ యమ్మను సూస్తే గుండె తరుక్కుపోతా ఉండాది. తొరగా

సూదమనంది బాబూ?" అన్నాడువాడు-వాడి గొంతులో ఏడుపు జీర.

వాడి కళ్ళల్లో నీటిపొరలు చూచి చలించిపోయాడు తాను! యింతకాలం తాను చీకట్లో ఉన్నాడేమో అనిపించింది! డాక్టర్లు టెస్టుచేశారు.

కృష్ణవేణికి రాముడి రక్తం సరిపోయింది!

బ్లడ్ యిచ్చి పడుకొనున్న రాముడి వద్ద కెళ్ళాడు జగపతి.

"రాముడూ! నా కళ్ళు తెరిపించావురా! యింతకాలం కులం తక్కువ వాడని నిన్ను చులకనగా చూశాను. కులంకంటె గుణం గొప్పని నాకు తెలియజెప్పావురా !" అన్నాడు తాను కళ్ళనుండి నీళ్ళు కారుతుంటే.

"బాబుగారూ! యింతకాలంనుంచి నా కన్నమేస్తా ఉండారు. మీకీమాత్రం చేయకుంటే నేనేటికి బాబూ!" అన్నాడు వాడు.

"రాముడూ ! ఈ రోజే చేతన్‌కి ఉత్తరం రాస్తున్నాను. రూపనూ, బాబునూ కూడా తీసుకురమ్మని రాస్తున్నాను." ఆనందంగా అన్నాడు తాను.

రాముడి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"నిజంగానా బాబూ! ఎంత కుశ వార్త సెప్పారు!" అన్నాడు వాడు.

అన్నట్టుగానే చేతన్‌కి జాబు వ్రాశాడు తాను.

రేపు వస్తాడు వాడు!

తప్పకుండా వస్తాడు!

ఎక్కడో పన్నెండు గంటలు కొట్టిన శబ్దం వినిపించింది.

జగపతి మెల్లగా నిద్రలోకి జారుకున్నాడు.

* * *

మరునాడు—

జగపతి బాబుతో ఆడుకుంటూ తన గదిలో కూర్చున్నాడు. పక్కగదిలో కొడుకూ-కోడలూ సంతోషంగా నవ్వుకుంటున్నారు. బాబు ముద్దు ముద్దుగా చేతులు తిప్పుతూ-నవ్వుతున్నాడు.

"కూ........" అని కూత వినిపించింది.

బాబును మంచంపై వదిలి కిటికీవద్ద కొచ్చి చూశాడు జగపతి.

గూడ్సుబండి కాదు—పోతూ ఉన్నది. దీపాలు వెలుగుతూన్న రైలుబండిపోతూ కనిపించింది. జగపతి ఆనందంగా యిటుతిరిగి చూశాడు. ముసిముసి నవ్వులు నవ్వుతూ బాబు ఆడుకుంటున్నాడు.

———

సి.యస్.రావు సీరియల్

# కాంచన కుటీరం



## 3

కాంచన కుటీరానికి ముందుభాగంలో ఒక పక్కగా ప్రకృతి తీర్చి దిద్దిన రంగుల ముగ్గులా విరబూసిన గులాబీల తోట. రంగు రంగుల గులబీలు సాయంత్రపు చల్లగాలికి కేరింతలు కొడుతున్నాయి. ఆ తోటలోని పువ్వు లెవ్వరూ కోయరు. పొద్దునే విరిసి నేలకు రాలిన గులాబీ రేకులు, గాలికి రాలిన గులాబీ ఆకులు పూల తివాచీతో ఆ తోటంత మేరనూ కప్పినట్లు కనిపిస్తోంది. తోటలోకి వెళ్ళే గేటు ముందు తీగ గులాబీ ఆర్చిగా పెంచబడింది. ఆ ఆర్చి నీడలో నాలుగు

సిమెంట్ సోఫా లున్నాయి. ఓ సిమెంట్ సోఫాలో క్రాంతిబాబు కూర్చుని సోఫా చేతిమీద తన కుడిచేతిని ఆన్చి, కుడిచేతి అరచేతిపై తన గడ్డాన్ని మోపి గులాబీల సౌందర్యాన్ని ఆస్వాదిస్తు న్నాడు.

రాఘవయ్య ఆకౌంట్ పుస్తకాలను నౌకరుచేత పట్టించుకొని అక్కడి కొచ్చాడు

గులాబీ తోటపై ఉన్న క్రాంతిబాబు చూపుల్ని తనవైపుకు తిప్పుకోవాలనే ఉద్దేశంతో – "బాబూ!" అని పిల్చాడు రాఘవయ్య.

రాఘవయ్య రాకను క్రాంతిబాబు గమనించి, "రండి ! కూర్చోండి" అన్నాడు తను నిటారుగా కూర్చుంటూ

"ఫర్వాలేదులెండి బాబూ !" అని క్రాంతికి చెప్పి, నౌకర్ని ఆ పుస్తకాలను ఎదురూగ్గావున్న సిమెంట్ సోఫాలో వుంచి వెళ్ళమన్నాడు రాఘవయ్య.

నౌకరు పుస్తకాలను సోఫాలో వుంచి వెళ్ళిపోయాడు.

"కూర్చోండి" అన్నాడు క్రాంతి బాబు మళ్ళీ రాఘవయ్యను ఎదురూగ్గా వున్న సోఫాను చూపెడుతూ.

రాఘవయ్య నవ్వుకొని "యజమానుల ముందు పనివారు కూర్చోవడం జమీందారీ వంశ సాంప్రదాయానికి విరుద్ధం బాబూ! నేనింతవరకూ మీ తాతగారి ముందుగానీ, మీ నాన్నగారి ముందు గానీ, మీ చిన్నాన్నగారి ముందుగానీ, మీ అమ్మాజీ ముందుగానీ కూర్చోని ఎరగను" అన్నాడు సాంప్రదాయాన్ని తెలియజెబుతూ.

"కాని నేను మీకంటె చిన్నవాడ్ని నేను కూర్చోవడం మీరు నిలబడడం నాకు సభ్యత అనిపించదు" అన్నాడు క్రాంతిబాబు ఎంతో వినయంగా.

"మామూలు మనుషుల మధ్య అయితే మీరన్నమాట నిజమే ! పెద్దవాళ్లను గౌరవించడం సభ్యత. కాని ఇలాంటి పెద్ద వంశాల్లోని సభ్యతలూ, సాంప్రదాయాలూ వేరుగా వుంటాయి. మీకు ఊహ తెల్సిననాటినుంచీ బయటి ప్రపంచాన్నే చూశారుగానీ, దివాణం ఆచార వ్యవహారాలు మీరు తెల్సుకో లేదు. ఇప్పుడు ఈ ఎస్టేట్ యజమాని మీరు. యజమానిగా మీ కా గౌరవాన్ని నేను ఇవ్వడం నా బాధ్యత. ఇన్నాళ్లూ నా బాధ్యతా నిర్వహణలోనే ఈ తల నెరిసింది. చివరి రోజుల్లో మార్పెందుకు? నా శేష జీవితాన్ని యిలాగే గడప నివ్వండి. ఒక్కసారి మీరు ఈ ఆకౌంట్ పుస్తకాలని చూసి, సంతకాలు చేయాలి. ప్రతి నెలా మీ కిదో పని" అన్నాడు రాఘవయ్య.

"ఇవన్నీ చూడాల్సిందేనా ?" అన్నాడు క్రాంతిబాబు, అదేదో పెద్దపని అన్నట్టు.

"చూడాలి బాబూ ! ఇన్నాళ్లూ

అమ్మాజీ చూశారు. ఇకనుంచి మీరు చూడాలి" అన్నాడు రాఘవయ్య ఒక పుస్తకం తెరుస్తూ.

రాఘవయ్య చేతిలోని పుస్తకాన్ని తీసుకొని, "ఇన్ని పుస్తకాలున్నా యేమిటండీ ?" అన్నాడు క్రాంతిబాబు.

"ఒకరకమైన ఆదాయమూ, ఒక రకమయిన ఖర్చూ బాబూ ! మద్రాసు కంపెనీలో షేర్లనుంచి వచ్చే ఆదాయమూ, సొంత వ్యవసాయం నుంచి వచ్చే ఆదాయమూ, కౌలుదార్ల నుంచి వచ్చే ఆదాయమూ, కొబ్బరితోటల నుంచి వచ్చే ఆదాయమూ — ఇలా రకరకాలైన ఆదాయాలు. ఇక ఖర్చులంటారా ? తాతలనాటి నుంచి సత్రవ కయ్యే ఖర్చూ, రామలింగేశ్వరస్వామి ఆలయ నిర్వహణ కయ్యే ఖర్చూ, నిత్య దాన ధర్మాలకీ, దివాణం పరివారానికీ అయ్యే ఖర్చులూ - ఇలా ఎన్నో ఖర్చులు, యజమాని అన్నవారు ప్రతి నెలా ఒక్కసారి చూసుకోవాలిగా మరి" అని రాఘవయ్య అకౌంట్లను గురించి క్రాంతిబాబుకు విశదపర్చాడు.

క్రాంతిబాబు చిరునవ్వు నవ్వి ఓ అకౌంట్ పుస్తకాన్ని మూసేసి, రాఘవయ్య చేతికందించాడు. ఆ నవ్వులోని అంతరార్థమేమిటో రాఘవయ్యకు అర్థంకాలేదు. అతను అందించిన పుస్తకాన్ని అందుకున్నాడు. క్రాంతిబాబు ముఖంలోకి చూస్తూ నిలబడ్డాడు.

"ఎవరిమీద అనుమానంతో యీ అకౌంట్లన్నింటినీ నేను చెక్ చేయాలంటారు ?" అన్నాడు క్రాంతిబాబు, రాఘవయ్య మొహంలోకి సూటిగా చూస్తూ.

ఆ ప్రశ్నకు రాఘవయ్యకు క్షణం సేపు సమాధానం దొరకలేదు. వయస్సూ, అనుభవమూ కలవాడు కాబట్టి రాఘవయ్య తేరుకొని, "ఎవరి మీదో అనుమానంతో అని కాదు బాబూ; ఇన్ని రకాల ఆదాయమూ నా చేతులకే వస్తుంది. అన్ని ఖర్చులూ నేనే పెడతాను. ఎప్పటికప్పుడు నా బాధ్యతను నేను నెరవేర్చాలిగదా ?" అన్నాడు.

"అంటే మిమ్మల్నే నేను చెక్ చేయాలన్నమాట ! చూడండి రాఘవయ్యగారూ ! ఈ గులాబీతోట ఎంత గుబురుగా పెరిగిందో, ఎన్ని పూలు పూసిందో వాటి అందాన్ని చూస్తూ నేనిక్కడ కూర్చున్నాను. ఆ తోటకు ఏనాడూ నేను నీరుపెట్టలేదు. ఆ చెట్లమొదళ్లలో శుభ్రం చేయలేదు. ఎరువు వేయలేదు. ఆ పనులన్నీ తోటమాలి చేస్తాడు. ఆ తోటమాలే పువ్వులు కోసుకుపోతున్నాడని అనుమానించడం ఎలా వుంటుందో, మీరు రాసిన లెక్కల్ని చెక్ చేయడం కూడా అలానే వుంటుంది. ఈ దివాణాన్ని కంటిపాపలాగా, కన్నబిడ్డలాగా చూసుకుంటున్నారు మీరు. అమ్మాజీ చెప్పారు. ఇకనుంచి నెలవారీ

చెకింగ్ అవసరంలేదు. ఏడాదికొకసారి ప్రతి అకౌంట్ పుస్తకంలోని చివరిపేజీ తెరవండి. సంతకం చేస్తాను" అన్నాడు క్రాంతిబాబు.

"అది కాదు బాబూ!..." అంటూ ఏదో చెప్పబోయాడు రాఘవయ్య.

క్రాంతిబాబు సిమెంట్ సోఫాలోంచి లేస్తూ, "ప్రస్తుతం నేను ఈ దివాణం జమీందారుని. నా ఆదేశాన్ని పాలించటం మీ ధర్మంగదా!" అని రెండడుగులు వేసి, "అన్నట్లు చెప్పడం మర్చాను. రేపు మన మిద్దరం మన పడమటి తోటల్లోని గెస్టుహౌస్‌కు వెళుతున్నాం. ప్రయాణానికి సిద్ధంచేయండి," అని చెప్పి లోపలకు వెళ్ళిపోయాడు."

అతను వెళ్ళినవైపే చూస్తూ నిలబడి పోయాడు రాఘవయ్య. తనకి పాతికేళ్ళ వయస్సప్పుడు రాజా రాజశేఖరంగారి హయాంలో ఎకౌంట్లు చూడటం మొద లెట్టాడు తను. రాజశేఖరంగారు ఉన్నంతకాలమూ ప్రతినెలా తాను ఎకౌంట్లు చూపెట్టాడు. ఆ తర్వాత అమ్మాజీకి చూపెట్టాడు. వారెవ్వరూ ఈ మాట అనలేదు. అనలేదని తాను బాధపడలేదు. ఇన్నాళ్లకు క్రాంతిబాబు చిన్నవాడైనా, తనకు ఎంతో తృప్తినీ, ఆనందాన్నీ ఇచ్చే మాటన్నాడు. తన మీద కొండంత నమ్మకాన్నీ, బరువునూ మోపాడు. అతను ఆ మాట అనేవరకూ ఆ మాట తనకంత తృప్తినిస్తుందని తనకే తెలియదు. ఏది ఏమైతేనేం, కొత్త జమీందారుగారి దగ్గరనుంచి తొలి ఆజ్ఞను తీసుకున్నాను. ఈ ఆజ్ఞ అతను తనమీద వుంచిన నమ్మకం మంచి దారి తీస్తుందో, చెడుకే దారితీస్తు. కాలమే నిర్ణయించాలి – అనుకున్నాడు రాఘవయ్య.

## 4

ఉదయం తొమ్మిది గంటలవేళకు గుర్రపు సార్టులో మట్టిరోడ్డుకు చేరివున్న పడమటి తోటకు రాఘవయ్యా, క్రాంతిబాబూ చేరుకున్నారు. అది ఏపుగా పెరిగిన నిమ్మతోట. తోటంతా పూత మీదుంది. విరిసిన నిమ్మపూత మీద అక్కడక్కడా తేనెటీగలు వాలి వున్నాయి. మట్టిరోడ్డు నుంచి తోట మధ్యలో వున్న గెస్టుహౌస్‌కు రెండు గజాల వెడల్పున దారి వుంది. గుర్రపు సార్ట్ గెస్టుహౌస్ గేటుదాకా పోతుంది. తోటలోవున్న బాటకు ఇటూ అటూ కొబ్బరిచెట్లు బారులుదీరి వున్నాయి. ఆ చెట్లను వ్రేలాడుతూన్న కొబ్బరి బొండాల గెలలు చేతికి అందేటంత ఎత్తులో వున్నాయి. గెలల బరువుకు హుందాగా కదలుతూన్న కొబ్బరిచెట్ల కదలిక నిండు చూలాలి నడకల్లా వున్నాయి.

బంగళా గేటుదగ్గర్నుంచి వరండా మెట్లుదాకా వరసగా క్రోటన్స్ కుండీలు అమర్చబడ్డాయి. క్రాంతిబాబు ఆ బంగళాకు వస్తాడని రాఘవయ్యకు ఓ

రోజు ముందుగానేతెలియడంచేత కాటేజి బంగళా అంతా ఎంతో శు భ్రంగా వుంది. గుమ్మాలకూ, కిటికీలకూ అందమైన ...గల కర్టెన్లు వ్రేలాడుతున్నాయి.

..వయ్య. క్రాంతిబాబూ గుర్రపు నాట్లు దిగి బంగళా వంటి గెస్టుహౌస్‌లోకి అడుగు పెటారు.

లోపలిగదిలోకి వెళ్ళకుండా క్రాంతి బాబు "బయటే చల్లగాలి బావుంది. వరండాలోనే కూర్చుందాం," అంటూ వరండాలో వున్న కుర్చీలో కూర్చున్నాడు.

అంతలో తోటమాలి రెండు కొబ్బరి బొండాలు తెచ్చాడు. వాటిని రాఘవయ్య అందుకొని ఒకటి క్రాంతిబాబు కిచ్చాడు. అది అతను త్రాగింతరువాత, రెండో బొండాన్ని కూడా అందివ్వబోయాడు.

"నాకు చాలు. మీరు తీసుకోండి" అన్నాడు క్రాంతిబాబు.

నిలబడే ఆ బొండాన్ని తాగాడు రాఘవయ్య.

"ఇక నువ్వెళ్లు" అని తోటమాలిని పంపించివేశాడు రాఘవయ్య.

తోటమాలి వెళ్ళాకకూడా రాఘవయ్య నిలబడేవుండటం క్రాంతిబాబు గమనించాడు. తనముందు ఆయన కూర్చోడనీ, అది ఆయన నియమమనీ గ్రహించిన అతను, "అలా తోటలో నడుస్తూ మాట్లాడుకుందాం" అంటూ కుర్చీలోంచి లేచాడు.

ముందు క్రాంతిబాబూ, వెనకనే రాఘవయ్యా నడుస్తున్నారు.

"రాఘవయ్యగారూ ! నేను ఎం.ఏ. దాకా చదువుకున్నాను" అంటూ క్రాంతిబాబు ఇంకా ఏదో చెప్పబోతూ వుండగానే, రాఘవయ్య అతని మాటకు అడ్డు వచ్చాడు.

"అదే బాబూ, నాకూ చాలా సంతోషంగా వుంది. ఇలాంటి పెద్ద వంశాలలో పుట్టినవాళ్లకు అతి గారాబం వల్లనైతేనేమి, అవసరం లేకపోవడం వల్లనైతేనేమి పెద్ద చదువులు అబ్బవు. అలాంటిది మీరు ఇంత చిన్న వయస్సులో ఎం.ఏ. ప్యాసుకావడం ఈవంశానికే గర్వకారణం," అన్నాడు రాఘవయ్య.

"కావచ్చు. దివాణానికి దూరంగా నేను మద్రాసులో వుండి చదువుకోవటం చేత ప్రపంచం గురించీ, ప్రజల గురించీ కొంతవరకు తెలుసుకున్నాను. చదువూ అబ్బింది. కాని నా కుటుంబం గురించి నాకేం తెలియదు. ఇంతవరకూ నా కెవరూ చెప్పనూలేదు. అడిగి తెల్సు కునేంత చనువు నాకు ఎవ్వరూ ఇవ్వనూ లేదు మొన్నామధ్య అమ్మా జీ అన్నారు : మన వంశ చరిత్రను తన గుండెల్లో రాసుకుని పదిలంగా దాచు కున్న వ్యక్తి రాఘవయ్యగారు అని. అప్పట్నుంచే మిమ్మల్ని ఏకాంతంగా కల్సుకుని, మా వంశం గురించీ, మా పూర్వీకులను గురించీ మీనుంచి ఎన్నో

విషయాలు తెల్సుకోవాలనుకుంటున్నాను. ఈ రోజుకు ఆ అవకాశం కుదిరింది. మా తాతగారు నాకు బాగా చిన్నతనంలో పోయారు. పోయినప్పుడు నేను లేను. ఎందుకు పోయారో ఎలా పోయారో తెలియదు. ఆయనకంటె ముందే నాన్నగారు పోయారని విన్నాను. చిన్నాన్నగారు ఇంట్లోంచి వెళ్ళిపోయారని విన్నాను. తాతగారినుంచి దివాణం పెత్తనం అమ్మాజీకి రావటం, చిన్నాన్నగారు ఎక్కడున్నారో తెలియకపోవటం, అమ్మాజీ చేతినుంచి ఈ ఎస్టేట్ పెత్తనం నా చేతికి రావడం – ఇదంతా ఏదో గందరగోళంగా వుంది నాకు. మీరు విశదంగా చెబితే తెలుసుకోవాలని నా కోర్కె," అంటూ తన మనస్సులోని మాటను రాఘవయ్యకు చెప్పాడు క్రాంతిబాబు.

"మొన్న మీ పుట్టినరోజు పండుగనాడు అమ్మాజీ ఈ ఎస్టేట్ పెత్తనాన్ని, సర్వాధికారాలనూ నా చేతులమీదుగా మీ కందజేశారు. వాటితోపాటు తమ వంశ గౌరవ ప్రతిష్ఠలను గురించి, తమ పూర్వీకుల గురించి మీకు తెలియజేయడం నా బాధ్యత. నేనూ ఈ అవకాశంకోసమే ఎదురుచూస్తున్నాను. మీ తాతగారి గురించీ, నాన్నగారి గురించీ, మీ చిన్నాన్నగార్ని గురించీ చెప్పబోయే ముందు మీ ముత్తాతగారి గురించి వివరించడం అవసరం. ముత్తాతగారి చిత్రపటం మీరు చూశారనుకుంటాను. అమ్మాజీవారి గది గుమ్మంపై వుంది. ఒక విధంగా చెప్పాలంటే సిసలైన రాచఠీవి, రా ఆయనతోటే వెనకబడిందా అనిపిస్తు. ఆ రోజుల్లో నాకు తెలిసీ తెలియని వయస్సు. రాజా మహేంద్రవర్మగారి పేరు చెబితే ఈ చుట్టుపక్కల పరగణాల్లో ఎరగనివారు లేరు. దాన ధర్మాలకూ, పుణ్యకార్యాలకూ మీ ముత్తాత మహేంద్రవర్మగారు పెట్టింది పేరు. 'దేహి' అని వచ్చిన బ్రాహ్మణులకూ, పండితులకూ దోసెళ్ళతో వెండి రూపాయలు ఇచ్చేవారట. మనవూరిలోని సత్రం, రామలింగేశ్వరస్వామి ఆలయం – వారు కట్టించినవేనట ! ఆ సత్రంలో నిరతాన్నదానం నాటినుంచి నేటిదాకా జరుగుతూనే వుంది.

"ఒక దృశ్యాన్ని నేను ఈనాటికీ మర్చిపోలేను. మొన్న మీరు పుట్టినరోజు వేడుక జరుపుకున్న హాలులో మీ ముత్తాతగారి కాలంలో నిత్యమూ నృత్య, సంగీత, సాహితీ సమావేశాలు, అష్టావధాన శతావధానాలూ, పండిత పరిషత్తులూ జరుగుతూ వుండేవి. యథోచితంగా సత్కారాలు జరుగుతూ వుండేవి. వారు రసజ్ఞులనీ, వారి చేతికి ఎముక లేదనే పేరు. అలా దానధర్మాలు జరగని రోజున వారికి తోచేది కాదుట.

అప్పటికే మీ తాతగారు రాజా రాజశేఖరంగారి వయస్సు పన్నెండు. నా వయస్సు ఎనిమిది. అంత చిన్నవాడ్నే ఆనాటి దృశ్యాలు ఈనాటికీ నా మనస్సులో చెరగని ముద్రలుగా నిలిచి పోయాయి.

"ఆ రోజుల్లో మీ ముత్తాతగారి కోసం తెల్లదొరలూ వచ్చేవారు; నల్లదొరలూ వచ్చేవారు. ఎవరు వచ్చినా వచ్చిన వారి అర్హతను బట్టి తాహతులను బట్టి సత్కరించి పంపేవారాయన. వచ్చిన వారందరూ మీ తాతగారి తెల్లగుర్రాన్ని చూడకుండా మాత్రం వెళ్ళేవారు కాదు," అని రాఘవయ్య ఇంకా ఏదో చెప్పబోతూ వుండగా, ప్రశాంతిబాబు

"ఏమిటా గుర్రం ప్రత్యేకత?" అన్నాడు.

"ఇంతా అంతా ప్రత్యేకత కాదు బాబూ! మన పురాణగాథల్లో ఒక కథ వుంది. దేవతలూ, రాక్షసులూ కలిసి సాగరాన్ని మథిస్తే అమృతమూ, హాలాహలమూ చంద్రుడూ, ఉచ్చైశ్శ్రవమూ లాంటి అనేక అపురూపమైనవి లభించాయట. ఆ ఉచ్చైశ్శ్రవాన్ని నేను చూడలేదుగానీ, మీ ముత్తాతగారి గుర్రాన్ని చూసి, ఉచ్చైశ్శ్రవమంటే ఇలాగే వుండేదేమో అనుకొనేవాడ్ని నాకు వూహ తెల్సింతర్వాత. చందమామలో కూడా చిన్నమచ్చ వుంది గానీ, ఆ తెల్లని గుర్రానికి ఎక్కడా

మచ్చ లేదు. రామలింగేశ్వరస్వామి కల్యాణం రోజున మీ ముత్తాతగారు ఆ శ్వేతాశ్వాన్ని అధిరోహించి ఆలయానికి బయలుదేరేవారు. ఆయన వెనకనే రాణివాసంలోని స్త్రీజనం ఎనమండుగురు బోయీల మేనాలో బయలుదేరేవారు. అలా వీధి వెంట మీ ముత్తాతగారు కుటుంబ సమేతంగా బయలుదేరి, రామలింగేశ్వరస్వామి ఆలయానికి వెళ్లే వేడుకలు చూడటానికి చుట్టుప్రక్కల గ్రామాలనుంచి పల్లెజనం బళ్ళు కట్టుకుని వచ్చేవారు. ఆ వీధి ఇసుక వేస్తే రాలనంత జనసందోహంతో కిటకిట లాడుతున్నా, ఆ అశ్వాన్నీ, అశ్వారూఢులైన మీ ముత్తాతగార్నీ చూసేసరికి జనం పాయలుగా చీలి పక్కలకు తప్పుకొని, ఎవ్వరూ అడగకుండానే దారి ఇచ్చేవారు. రామలింగేశ్వరస్వామి ఆలయ ప్రాంగణ ప్రాంతానికి అశ్వం చేరగానే ముత్తాతగారు దిగేవారు. అడుగులకు మడుగులొత్తి, స్వాగత స్తోత్రాలతో ముత్తాతగారినీ, రాణివాస జనాన్నీ లోనికి తీసుకువెళ్ళేవారు. రాణివాస జనం బయటి జనానికి కనపడనీయకుండా వారు మేనాలు దిగేసరికి, దివాణం పరిచారికలు ఇటూ అటూ చీరలతో గోడలు కట్టి, ఆలయంలోకి దారి చూపేవారు.

ఒక్క మాటలో చెప్పాలంటే క్రాంతిబాబూ! దివిలోని మహేంద్రుడు దివి అంటే మొహమ్మొత్తి తన రాణివాసంతో భువికి తరలి వచ్చాడా అన్నంత వేడుకగా వుండేది స్వామి కల్యాణం రోజున. ఆ ఎక్కడెక్కడి నుంచి ఎంతమంది వచ్చినా లేదనకుండా అన్నదానం జరిగేది. ఆనాడు ఒక్కనాడే అన్న మాటేమిటి, ఆ రోజుల్లో ఈ గోదావరి సీమలో ఒకపూట అన్నం దొరకలేదన్నవాడు లేడనే చెప్పవలె. నిజమో, అబద్ధమో నాకు తెలియదు గానీ, ఆ తెల్ల గుర్రం గురించి చాలా కథలు చెప్పుకునేవారు బాబూ! ఆ గుర్రంమీద మీ ముత్తాతగారు మన ఎస్టేట్‌లోని అడవులకు వేటకు వెళ్ళితే, పులి వాడను పసిగట్టి తీసుకువెళ్ళేదట. ఆ రోజుల్లో మీ ముత్తాతగారొక్కరికే తుపాకులు వుండేవట వారి గురికి తిరుగులేదని చెప్పేవారు. నిశిరాత్రివేళ వారు అశ్వారూఢులై అడవిలో తిరుగుతూ వుంటే, వేట వెళ్ళిన పరివారం ఎంతో ధైర్యంగా వెనుక నడిచేవారట. దారిలో పులి ఎదురుపడితే ఆదెక్కడి చిత్రమో, ఆ గుర్రం చటుక్కున ఆగిపోయేదట! ఆ చీకట్లో జ్యోతుల్లా వెలిగే పులికన్నుల మధ్యకు గురిచూసి సరిగ్గా నుదుటికి తగిలేలా తుపాకిని కాల్చేవారట మీ ముత్తాత. రెండో గుండు అవసరం లేకుండానే పులి నేలకొరిగేదట. అందుకే వారి గురికి తిరుగులేదని చెప్పుకొనే

వారు. వారి మాటకూ తిరుగులేదని వినికిడి. మన హాలులో వున్న మీ పూర్వీకుల చిత్రపటాలకు ఇటూ అటూ వ్రేలాడదీసిన పులి చర్మాలూ, తుపాకీలూ వారి కాలంనాటివే బాబూ!

మీ ముత్తాతగారి దాన ధర్మాలూ, ధర్మకార్యాలూ, వీరోచిత కృత్యాలూ ఒకెత్తు. వారికీ, వారి గుర్రానికీ వున్న అనుబంధం ఒకెత్తు. ఒకసారొక చిత్రం జరిగింది. ఓసారి ఎవరో తెల్లదొర వచ్చి మీ ముత్తాతగారితో కల్సి వేటకు వెళ్ళాలని ముచ్చటపడ్డాడట ఆ దొర తెచ్చిన ఏనుగుమీద వారు వేటకు వెళ్ళారుట. వేటకు వెళ్ళిన ఆయన తిరిగి రావడానికి నాలుగైదు రోజులు పట్టిందట. తనని తీసుకువెళ్ళకుండా ఆయనొక్కరే వేటకు వెళ్ళారనే కోపంతో ఆ విచిత్ర శ్వేతాశ్వం దానా ముట్టలేదు; గడ్డి ముట్ట లేదు; ఆఖరికి నీళ్ళుకూడా ముట్టలేదట. ముత్తాతగారు తిరిగివచ్చి, బ్రతిమాలి బుజ్జగించి పెట్టిననాడే తిన్నదట. జంతువైనా దాని విశ్వాసం, పట్టుదలా చూశారా బాబూ! అదేరోజున మరో గమ్మత్తు జరిగింది. ముత్తాతగారి వెంట వేటకు వెళ్ళిన ఆ తెల్లదొర ఆ తెల్ల గుర్రాన్ని చూసి, ఒక్కసారి స్వారీ చేయాలని ముచ్చటపడ్డాడట! నోరు తెరచి తన ముచ్చటను ముత్తాతగారికి విన్నవించుకొన్నాడు కాబోలు! మీ ముత్తాతగారు ముసిముసి నవ్వులు

నవ్వుతూ అతిథి మాట కాదనలేక సరే నన్నారట. కళ్ళాలు చేపట్టి, తెల్లదొర మన తెల్లగుర్రాన్ని ఎక్కారు. అతను అలా ఎక్కినదే తడవుగా మన గుర్రం ముందుకాళ్ళు రెండూ పైకెత్తి, గట్టిగా సకిలించి అతన్ని కింద పడవేసింది. ఎంత ప్రయత్నించినా అతనికి లొంగ లేదు. ఆ తెల్లదొరకు వొళ్ళుమండి ఇంగ్లీషులో 'ఇది పిచ్చి గుర్రం' అన్నాడట. ముత్తాతగారు నవ్వుకొని, 'కాదు, నా ప్రాణం. విశ్వాసానికి మరో రూపు' అని గర్వంగా సమాధాన మిచ్చారట. ఆ గుర్రానికీ, మీ తాత గారికీ ఉన్న అనుబంధం అలాంటిది బాబూ! ఒక్క గుర్రమే అన్న మాటేమిటి? ఈ దివాణంలో వారి నీడన బ్రతికే ప్రతివ్యక్తికీ మహేంద్రవర్మ గారంటే దైవసమానులే. వారి హయాంలో కృష్ణశర్మగారని దివాన్‌గారు వుండేవారు. ఇప్పట్లోలా అప్పుడు పాఠశాలలు లేవు. ఎక్కడో గురుకులాలు వుండేవట. విద్య కావాలంటే ఎంతటి వారైనా ఆ గురుకులాలకు వెళ్ళి గురువులను ఆశ్రయించి, నేర్చు కోవాల్సిందే! కృష్ణశర్మగారు ఎంతో శ్రోత్రియులు. ఎన్ని పనులున్నా నిత్యాగ్నిహోత్రం మానేవారు కాదు. వేడినీళ్ళతో స్నానంచేసి ఎరగరట. ఊహ తెల్సిన నాటినుంచీ గోదావరి స్నానం మానలేదట! ఆఖరికి క్షురకర్మ కూడా ముహూర్తప్రకారమే జరగాలట! తల నెరసి, కాస్త నడుం వంగి, దస్కం పెట్టె ముందు కూర్చున్న ఆయన్ను చూస్తూవుంటే, సురగురువులు బృహస్పతి ఇలాగే వుండేవారా అనిపించేది. మీ ముత్తాతగారు, కృష్ణశర్మ గారు ఉదయాన్నే అగుపించినపుడు చేతులెత్తి నమస్కరించేవారు. మీ ముత్తాతగారు నమస్కరించింది ఇద్దరికే. రామలింగేశ్వరస్వామికీ, కృష్ణశర్మ గారికీ. మీ తాతగారికి అక్షరాభ్యాసం చేయించింది ఆయనే వారి దగ్గరనుంచి సకల ధర్మశాస్త్రాలనూ, సకల పురాణ పుణ్యగాథలనూ వివరించి చెప్పారు. కొత్తలో మీ తాతగారు కృష్ణశర్మగారి ముందు కూర్చుని పాఠాలు నేర్చుకుంటూ వుంటే, నేను నిలబడి చూసేవాడ్ని. ఒకనాడు మీ ముత్తాతగారు నేను అలా నిలబడి వింటూండటం చూసి, "నువ్వు కూడా రాజశేఖరంతోపాటు పాఠాలు వినరా" అన్నారు. అది నిజంగా నా పాలిట వరం. కృష్ణశర్మ లాంటి మహనీయుని దగ్గరా, సకల విద్యా పారంగతుని దగ్గరా విద్య నభ్యసించే అదృష్టం కలిగింది నాకు.

"తాతగారూ, నేనూ కలిసి మెలిసి ఆడుకునే వాళ్ళం. కలిసి చదువుకునే వాళ్ళం. ఆడుకోవడమంటే అపార్థం చేసుకొనేరు తాతగారు బంతి విసిరితే నేను తిరిగి ఎదురు విసరడం

# ప్రతినెలా వరుమానం లభించును




## ఐఓబి వారి విశేషమైన ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో నిలువచేయండి.

మొత్తంగా డబ్బు వుండి, నెలసరి ఆదాయం కావాలి అనుకునేవారికి ఈ ఐఓబి ఫిక్స్‌డ్ డిపాజిట్ అనువుగా వుంటుంది. బోనస్, నగదు బహుమతులు, జీవితభీమా మొత్తాలు, రిటైరైనాక చేతికి అందే లాభాలూ, ఎదురుచూడని ధన లాభాలూ ఇలా లాభసాటిగా నిల్వ చేయవచ్చును.

ఈ క్రింది పట్టిక మీ నిల్వ మొత్తం నెలనెలా ఎంత సొమ్ము తెచ్చేదీ చూపిస్తుంది.

| నిల్వ మొత్తం. | నెలసరి ఆదాయం. | | |
|---|---|---|---|
| రూ. | 12 - 36 నెలలు | 39 - 60 నెలలు | 63 పైగా నెలలు |
| 5,000 | 24.88 | 31.06 | 37.22 |
| 10,000 | 49.75 | 62.11 | 74.44 |
| 1,00,000 | 497.51 | 621.11 | 744.40 |

ఐఓబి కి రండి. మీకోసం మాదగర చక్కటి పథకాలున్నాయి.



**ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్**

మీ ఔన్నత్యాన్నికోరే ఉత్తమ మిత్రుడు

IOB/41/A/Tel

కాదు. నాకు తెలియక అలా ఒకసారి విసిరితే, ఈ దివాణంలోనే పనిచేసే మా అమ్మ 'బాబుగారికి బంతి ఎదురు విసురుతావా?' అని మందలించింది. ఆనాటినుంచీ తాతగారు బంతి విసరడమూ, విసిరిన బంతిని తెచ్చి వారికి నేను అందివ్వడమూ. అదే మేమిద్దరం కలిసి ఆడుకునే ఆట ! తాతగారికి ఇరవయ్యేళ్ళు వచ్చాయి. నాకు పదహారు. ముత్తాతగారికి యాభై అయిదు. కాలచక్రం ఎవరికోసం ఆగదు బాబూ ! ఒక ఋతువు తర్వాత మరో ఋతువు వచ్చినట్లే, ఒక మనిషి పుట్టడమూ, గిట్టడమూ కూడా సహజం గదా ! మహేంద్రవర్మగారు యాభై అయిదవ ఏటనే గుండెపోటుతో మరణించారు. వారి కర్మకాండ జరిగే దాకా, కృష్ణశర్మగారు పెదవి విప్పి మాట్లాడలేదు అప్పటికి ఆ గుర్రానికి కాస్త వయస్సు మళ్ళింది. అది నీరు కూడా తాగడం మానివేసింది. కర్మకాండ ముగిసిన రోజున, మీ తాతగారి మేనమామగారిముందు కృష్ణశర్మగారు దివాణం యాజమాన్యాన్ని ఇరవయ్యేళ్ళ వయస్సుగల మీ తాతగారికి అప్పజెప్పారు. మీ తాతగారు 'ఏమిటిది?' అన్నారు ఎంతో అమాయకంగా. కృష్ణశర్మగారు తన చేతిలో పెట్టిన తాళాలగుత్తిని చూస్తూ. పన్నెండు రోజుల తర్వాత కృష్ణశర్మగారు పెదవి విప్పి మాట్లాడారు. 'బాధ్యత బాబూ ! ఇక నువ్వే నిర్వహించగలవు. మీ నాన్నగారూ, నేనూ కలిసి మసిలిన ఈ కాంచనకుటీరంలో వారు లేకుండా నేను మసలలేను. సెలవు' అని వెనుదిరిగి చూడకుండా వెళ్ళిపోయారాయన.

మరి నాలుగు రోజులలో శ్వేతాశ్వం కన్నుమూసింది. ఏడాది తిరక్కుండా మీరు లేని యీ కాంచన కుటీరం నాకెందుకన్నట్టు మీ ముత్తవ్వ కన్నుమూశారు. మీ ముత్తాతగారి హయాం అలా ముగిసింది మీ తాతగారి హయాం అలా ప్రారంభమైంది.

"ఏడాది తిరక్కుండానే మీ తాతగారి మేనమామ వారి అమ్మాయి రాజేశ్వరమ్మను మీ తాతగారి కిచ్చి పెళ్ళిచేశారు. ఆనాడు ఈ ఎస్టేటుకు మీ తాతగారి మేనమామ, మీ తాతగారూ కల్సి నన్ను దివాన్‌గా నియమించారు. ఆనాటినుంచీ ఈ తాళాలు నా దగ్గరే వుంటున్నాయి. తాతగారు ఇమ్మందేనే ఈ తాళాలు ఒకనాడు అమ్మాజీ చేతి కిచ్చాను. వారు తిరిగి మళ్ళీ నాకిచ్చారు. అమ్మాజీ ఆదేశానుసారం మీచేతికిచ్చాను మీరు నాకిచ్చారు. ఈ బాధ్యత ఇలా ఇంకా ఎన్నాళ్ళు మొయ్యాలో! దీనికి ముగింపు ఎప్పటికో! నాకే తెలియదు." అలా రాఘవయ్య చెప్పుకుపోతూ వుండగా, సూర్యుడు నడినెత్తి కొచ్చాడు.

"భోజనం వేళైంది. ఇంక ఇంటికి

## ఇది కోయును... ఇది కాల్చును...





## ఇది మాన్పును.

-శమనమిచ్చి
మానేలా చేసే తెల్లని క్రీమ్

# క్రొత్త డెట్టాల్ యాంటిసెప్టిక్ క్రీమ్

Dettol
REGD
ANTISEPTIC CREAM

మరకలు
పడనీయదు

**శమనమిచ్చును మరియు మాన్పును**
**తెగినా మరియు కాలినా**

డెట్టాల్ యాంటిసెప్టిక్ క్రీమ్ మాత్రమే, ప్రపంచ మంతటా నమ్మబడిన, శక్తివంతమైనదిగా రుజువై, క్రీమ్ రూపంలో త్వరితంగా, నిరంతరంగా మానేలా చేసే, యాంటిసెప్టిక్ గుణం కలిగియున్నది. క్రొత్త డెట్టాల్ యాంటిసెప్టిక్ క్రీమ్ తెగినా, కాలినా, స్తనాల పైభాగం పగుళ్ళకు, పగిలిన పెదిమలకు మరియు ఒరిసిన చేతులకు శమనమిచ్చి మానేలా చేయును. ఇంకా ఏమంటే ఇది తెల్లని క్రీమ్, మరకలు పడనీయదు! నేడే ఒక ట్యూబ్ కొనండి.



**డెట్టాల్ — డాక్టర్లచే నమ్మబడిన పేరు**

రెక్కిట్ & కోల్‌మన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్
ఫార్మస్యూటికల్ డివిజన్
41 చౌరంగీ రోడ్, కలకత్తా 700 071

UNTAS-DAC-5C-1710 TL

బయలేరదామా. ఇది అంత త్వరగా తెమిలే కథకాదు. ఇదో చిన్న భారతం" అని క్రాంతిబాబును తీసుకొని రాఘవయ్య కాంచన కుటీరానికి గుర్రపు సార్థులో బయలుదేరారు.

* * *

రాజా మహేంద్రవర్మ గురించీ, వారి హయాంలో జరిగిన సంఘటనలను గురించీ రాఘవయ్య చెప్పగా క్రాంతిబాబు విన్నాడు. అది విన్నది మొదలు అతని మనస్సు ఇంకే పనిమీదకూ పోవటం లేదు. మామూలుగా జనంమధ్య బ్రతికిన తనకు ముత్తాత వృత్తాంతం ఏదో చిత్రమైన కథలా అనిపిస్తు దేశప్ప నిజ జీవితంలా తోచడంలేదు. దాంతో తన తాతగారి గురించీ, తండ్రి గురించీ, పినతండ్రి గురించీ విపులంగా తెలుసుకోవాలనే కుతూహలం క్రాంతిబాబులో క్షణక్షణానికీ ఎక్కువ అవుతోంది.

ఆ రోజు ఉదయం క్రాంతిబాబు్ని కలవడానికి రఘు కాంచనకుటీరానికి వచ్చాడు. స్నేహితుని రాక కొంత ఉపశమనాన్ని యిచ్చింది అతనికి. ఆరోజంతా ఇద్దరూకలిసి గడిపారు. వాళ్ళ చదువుకున్న కాలేజీలో స్నేహితుల గురించీ, అక్కడి సంగతులనుగురించీ, పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. గడిచిన సంఘటనలను మననం చేసుకోవడంలో ఒక తృప్తీ, ఆనందమూ ఉన్నాయి. సంఘటనలు తిరిగిరాకపోయినా, వాటి

జ్ఞాపకాలు మిగిలిపోతాయి. జ్ఞాపకాలు మనిషి బ్రతికినన్నాళ్లా కూడా బ్రతుకుతాయి, అనుకున్నాడు క్రాంతిబాబు అలాగే ఈ కుటుంబం తాలూకు జ్ఞాపకాన్నీ చెరగని ముద్రలుగా రాఘవయ్యగారి మనస్సులో నిల్చిపోయాయి. వారి నుంచి తన కుటుంబం గురించి ఎన్నో విషయాలు తెల్సుకోవాలి—అన్న కోర్కె రఘూ తన పక్కనేవున్నా, రఘూతో మాట్లాడుతూనే వున్నా క్రాంతిని వెంటాడుతూనే ఉంది.

ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ వుండే క్రాంతి కొంత పరధ్యానంగా వుండడం రఘు గమనించాడు.

"జమీందారీ పెత్తనం చేతికొచ్చిం తర్వాత ముభావంగా వుండడం, పరధ్యానంగా వుండడం జమీందారీ పద్ధతా? అన్నాడు రఘు కాస్త కొంటెగా.

ఆ మాటలకు క్రాంతిబాబు నవ్వాడు. బరువుగా నిట్టూర్చి, "నీదగ్గర నాకు ముభావం ఏమిటి రఘూ ? ఎప్పుడైనా నా మనస్సువిప్పి చెప్పుకొనేందుకువున్న స్నేహితుడివి నువ్వొక్కడివే నాకు," అన్నాడు క్రాంతిబాబు.

"నాదో సలహా క్రాంతీ! మన వయస్సు ఎన్నో విషయాలు తెల్సుకోవలసిన వయస్సు. ప్రపంచం, ప్రపంచంలోని విజ్ఞానం పూర్తిగా తెల్సుకొనేందుకు ఏ ఒక్కమనిషీ జీవితకాలం చాలదు. అలా అని తెల్సుకోకుండా వుండలేం. వీలైనంత తెలుసుకోవాలి. జ్ఞానాన్ని పెంపొందించుకోవాలి. మనిషి ఎదగాలి. ఈ జమీందారీ వ్యవహారాలు చూడటానికి రాఘవయ్యగారున్నారు. మీ అమ్మగారు వున్నారు. వారిద్దరికీ అప్పగించు. లేనిపోని బరువు బాధ్యతల్ని నెత్తినవేసుకొని స్వేచ్ఛగా మూడుపువ్వులూ ఆరుకాయలుగా గడపవల్సిన జీవితాన్ని, విలువైన కాలాన్నీ వృధాచేయకు. ఓ వారంరోజుల్లో నేను పిహెచ్.డి. చేయడానికై మద్రాసు వెళదామనుకుంటున్నాను. నిజానికి విదేశాలకే వెళ్లాలనివుండి. కాని నాకు ఆ అవకాశాలులేవు; ఆర్థిక స్తోమతాలేదు. అన్ని అవకాశాలూ వున్నవాడివి. స్వదేశం వొదిలి వెళ్ళాలని లేకపోతే, నాతో రా! విదేశాలకు వెళ్ళాలనివుంటే వెళ్ళు. స్నేహితుడిగా ఇది నా సలహా" అన్నాడు రఘు.

"ఏ సలహా మంచిదికాదని నేను అనడంలేదు రఘూ! నాలుగైదు రోజుల క్రితం వరకూ నా ఆలోచనలుకూడా నీ ఆలోచనలులాగే వుండేవి. నువ్వు పుట్టినలాంటి కుటుంబంలో నేనూ పుట్టివుంటే, ఎగిరిగంతేసి నీతో వచ్చేవాడ్ని. కాని నిన్న రాఘవయ్యగారు మా ముత్తాతగార్ని గురించి చెప్పిన విషయాలు విన్నతర్వాత నా ఆలోచన మారింది. నాలోనే ఏదో మార్పు వచ్చింది. బయటి ప్రపంచంలో చదువుకున్నానుగానీ నా

పంటినొప్పివల్ల కలిగేది కేవలం బాధ మాత్రమే కాదు. దంతక్షయానికి అది సంకేతం కూడా. అశ్రద్ధ చేస్తే దంతక్షయం మరింతగా జరిగి పిప్పి పళ్ళు అయిపోతాయి.




నోటిలో ఊరే ఆమ్లాలు పళ్ళలోకి చొచ్చుకుపోయి దంతక్షయాన్ని కలిగించకుండా మామూలు టూత్‌పేస్టులు ఆపలేవు.




సిగ్నల్ 2లో అత్యంత ప్రభావంగల ఫ్లోరైడ్ ఫార్ములా ఉంది. ఇది నోటిలోని ఆమ్లాలు పళ్ళలోకి చొచ్చుకుపోయి దంతక్షయం కలిగించకుండా అరికడుతుంది.

## పిప్పి పళ్ళను నిరోధించే టూత్‌పేస్ట్

పరిస్థితి విషమించక ముందే మీ కుటుంబంలో వారంతా వాడండి సిగ్నల్ 2—దంతక్షయాన్ని నిరోధించడంలో నిరూపించబడిన టూత్‌పేస్ట్. దీనిలోని ప్రత్యేకమైన ఫ్లోరైడ్ ఫార్ములా పళ్ళతో కలిసి వాటిని గట్టిపరుస్తుంది, పళ్ళకు హాని కలిగించే నోటి ఆమ్లాలను నిరోధించేందుకు మరింత శక్తినిస్తుంది—పిప్పి పళ్ళు కాకుండా కాపాడుతుంది. దంతక్షయాన్ని అరికట్టడంలో దీనికి మించిన టూత్‌పేస్ట్ లేదు. మేం చెప్పిందే మీరు నమ్మక్కర్లేదు. మీ దంత వైద్యుని కూడా అడగండి.




ఫ్లోరైడ్‌తో

# సిగ్నల్ 2

కుటుంబంలో వారికి పిప్పి పళ్ళు రాకుండా నిరోధిస్తుంది.



లింటాస్_SG2. 18-1710 TL

పూర్వీకుల గురించీ, నా కుటుంబం గురించీ ఇంతవరకూ నాకు తెల్సింది ఏమీలేదు. రాఘవయ్యగారు గతం గురించి ఓ కథలా చెప్పుకుపోతూంటే ఆ విషయాలన్నీ పూర్తిగా తెలుసుకోవడం, పి హెచ్.డి. చేయడంకంటే పెద్ద పనిగా అనిపించింది. నీ దృష్టిలో అది పెద్దపని కాకపోవచ్చు. నాకుమాత్రం రాఘవయ్యగారినుంచి ఈ కాంచన కుటీరం, దీంట్లో బ్రతికిన నా పూర్వీకులగురించి క్షుణ్ణంగా తెలుసుకోవడం చాలా అవసరమనిపిస్తుంది. తెల్సుకోవాలనే కుతూహలంగూడా వుంది. నీకు విదేశాలకు వెళ్ళి చదవాలనివుంటే అవసరమైన డబ్బు నేనిస్తాను. తప్పకుండా వెళ్ళు." అన్నాడు క్రాంతిబాబు.

"జమీందారు అయింతర్వాత దాన ధర్మాలు ప్రారంభించావా!" అన్నాడు రఘు నవ్వుతూ.

రఘు నవ్వినా ఆ నవ్వులో అతని మనస్సు నొచ్చుకుందన్న విషయాన్ని క్రాంతిబాబు గమనించాడు.

"నీ సంగతీ, నీ వ్యక్తిత్వం సంగతీ నాకు బాగా తెల్సు రఘూ! చేయిచాచని వాడవని నాకు తెలుసు. జమీందారుగా దానమిస్తానని నేను అనలేదు. స్నేహితుడిగా సహాయం చేస్తానన్నాను. స్నేహితుడి దగ్గర సహాయం పొందడంకూడా నీకిష్టంలేకపోతే, అప్పుగా తీసుకెళ్ళు," అన్నాడు క్రాంతిబాబు.

"ఆ అప్పు తీర్చలేకపోతే?"

"తీర్చేదాకా అసలు నేను అడగను."

"నువ్వు అడక్కపోయినా అప్పు అప్పేగా."

"రఘూ! మన ఇద్దరి చదువులూ సమానంకావచ్చు. కాని నీకున్న అనుభవము తెలివి నాకంటే ఎక్కువ. డబ్బును అప్పుగా యిచ్చి డబ్బే తిరిగి తీసుకోవడం ఒకరకమైన వ్యాపారం. అలా డబ్బే అప్పుతీర్చాలని ఎందుకను కుంటున్నావు? మనిషి కొనలేనివీ, తీర్చలేనివీ కొన్ని వుంటాయి. నేను కొనలేనిదేదో నీదగ్గర తీసుకుని, నేను ఇచ్చిన అప్పును తీర్చుకుంటాను."

"ఇంత పెద్ద జమీందారువి నువ్వు కొనలేనిది నాదగ్గరేముంటుంది?"

"పిచ్చివాడా! నాదగ్గర ఎంత డబ్బున్నా, ఎంతటి జమీందారునైనా కొనలేనివి కొన్ని వున్నాయి. మీ అమ్మగారు మీకు చూపెట్టే ఆప్యాయతను నేను కావాలంటేమాత్రం కొనుక్కోగలనా? అలాగే మీ దగ్గర నేను కొనలేనిది మనస్నేహం," అన్నాడు క్రాంతిబాబు.

అతని మాటల్లో నిజాయితీ, అభిమానం, డబ్బుకంటె స్నేహానికి అతనిచ్చే విలువా రఘూని ముగ్ధుడ్ని చేశాయి.

రఘు ఏమీ మాట్లాడలేకపోయాడు.

తృప్తిగా స్నేహితుడ్ని చూస్తూ బొమ్మలా కూర్చుండిపోయాడు.

"ఏమిటలా చూస్తావు రఘూ! నా నమ్మకాలు నీకు తెలియనివికావు. దాన ధర్మాలు చేయడంకూడా ఒక వ్యసనం లాంటిదని నా అభిప్రాయం. దానంచేసే వాడి చేయిపైనా, దానం పట్టేవాడి చేయి కిందా వుంటుంటి. తన చేయి పైన వుంచుకోవడం దాతకు తృప్తినీ, ఆనం దాన్నీ యివ్వొచ్చు. లేదా ఆధ్యాత్మిక చింతనకూ, పునర్జన్మలమీద నమ్మ కాలకూ ఆటపట్టు అయిన మనదేశంలో ఈ జన్మలో దానంచేసుకుంటే, వచ్చే జన్మకు పెట్టిపుట్టినవాడుగా పుట్టొచ్చనే స్వార్థంతో కొందరు దానంచేయొచ్చు. అందుకే ఎవరైనా కలిగినవాళ్ళనుచూస్తే 'వీనాడో పెట్టిపుట్టాడు' అంటారు మన పెద్దలు. ఎంతో త్యాగంలా కనబడే దానధర్మాల వెనుకకూడా ఇంతో అంతో స్వార్థం కనబడుతుంది నాకు,"అన్నాడు క్రాంతిబాబు.

అతని మాటలకు రఘు ఆశ్చర్య పోయాడు.

"ఈ విషయాలపట్ల ఇంత తొంద రగా ఒక నిర్ణయానికి వచ్చేటంతజ్ఞానం, తార్కిక శక్తి మనకు లేదేమో క్రాంతీ" అన్నాడు రఘు.

"శక్తి, వయసూ లేదనుకొని ఆలో చించడం, వూహించడం మానేయలేము గదా! మనిషికి ఆలోచనలూ, వూహలే లేకపోతే ఈనాడు ఇంత నాగరికతా వుండేదికాదు; ఈనాటి మనిషి మనకు అగుపించేవాడేకాడు. ఈనాటికీ మనిషి ఆదిమానవుడిగానే వుండిపోయేవాడు. ఒక్కవిషయం అడుగుతాను. సమా ధానంచెప్పు. నేను ఈనాడు జమీందార్ని ఎలా కాగలిగాను?" అన్నాడు క్రాంతి ఎంతో ఆవేశంగా.

"నీకు ఆమాత్రం తెలియకనా నన్ను అడుగుతున్నావు? మీ తాతముత్తాతలు జమీందార్లు గాబట్టి, ఆ జమీందారికి నువ్వు వారసుడివి కాబట్టి జమీందారు కాగలిగావు."

"మా తాతముత్తాతలు ఎలా జమీం దారు లయ్యారు?"

"మీది ఆదినుంచీ వస్తూన్న రాజ వంశమో, జమీందారీ వంశమో నాకు తెలియదు. జమీందారీ వంశమే అయితే తెల్లవాడు రైతుకీ, తనకీ మధ్య ఒక మధ్యవర్తిని నియమించడంచేత జమీందారీ వ్యవస్థ వచ్చింది. రాజవంశ మైతే, ఒక ప్రాంతం ప్రజలు తమ ధన, ప్రాణ, మాన రక్షణలకోసం ఒక సమర్థుడైన వ్యక్తిని ప్రజలే నియమించు కోవడంచేత ఏర్పడింది," అన్నాడు రఘు.

"నువ్వు చెప్పిన మాట రైటే. ఒక వ్యక్తికి కొన్ని బాధ్యతలు అప్పజెప్పి నప్పుడు ఆ బాధ్యతలను నిజాయితీతో

నిర్వహిస్తే రాజులదగ్గరా, జమీందార్ల దగ్గరా ఇంత సంపదా, ఇంత ధనమూ పోగుపడ్డానికి వీల్లేదుగా."

"ఆ మాటా నిజమే!"

"నిజమేనని నెమ్మదిగా అంటా వేమిటి! హేతుబద్ధంగాఆలోచించినమ్మిన నిజాన్ని కచ్చితంగా నొక్కివక్కాణించాలి. ఏదో ఇద్దరు ముగ్గురు వ్యక్తులు మరీ సంపన్నులైతే అది వాళ్ళ అదృష్టమనో, లేక దేవుడిచ్చిన వరమనో నమ్ముతావా?"

"నమ్మను. నేను హేతువాదిని. ఒక కూలివాడి తాతముత్తాతలైనా, నా తాత ముత్తాతలైనా, మీతాత ముత్తాతలైనా శిసెమొలలతో పసిపాపలుగా పుట్టిన వాళ్ళే! అలా పుట్టినవాళ్ళలో కొందరు సంపన్నులు కాగలిగారంటే ఎప్పుడో ఎక్కడో ఏదోరూపంలో ఒకడి శ్రమను మరొకరు దోచుకోవడం ప్రారంభమైందని నా విశ్వాసం."

"నా దారికే వస్తున్నావు. ఒకే చదవులు చదువుకున్నవాళ్ళం కాబట్టి, ఒకే నమ్మకాలు గలవాళ్ళం కాబట్టి ఇద్దరమూ హేతువాదులం కాబట్టి నాతో అడ్డగోడగా తర్కించడంలేదు నువ్వు. నువ్వు చెప్పిన మాట ప్రకారం చూస్తే ఇంత సిరి సంపదా నాదగ్గర పోగు పడిందంటే నా తాతో, ముత్తాతో నా ముత్తాత తాతో-ఏదో అడ్డదారిన సంపాదించిందేగదా. ఆ సంపాదన ఆనాడు

ధర్మబద్ధమే కావచ్చు. ఓ కాలంనాటి ధర్మం అన్ని కాలాల్లోనూ ధర్మంగా చెలామణి కావాలని ఎక్కడాలేదు.మనిషి ఆలోచనా విధానాన్నిబట్టి, కాల పరిణామాన్నిబట్టి ధర్మమూ మారు తూంటుంది. రాఘవయ్యగారు చెప్పిం దాన్నిబట్టిచూస్తే, మాముత్తాతకు ముందు వారి సంగతి నాకు తెలియదుగానీ, మా ముత్తాతనుంచి సాదాకా మా వంశీకు లెవరూ శ్రమించి ఎరుగరు. అయినా యింత ఆస్తివుంది. ఇది నాదీ అని చిత్త శుద్ధితో చెప్పగలనంటావా? చట్టం ఒప్పుకోవచ్చు. వ్యవస్థ ఒప్పుకోవచ్చు. నా మనస్సు ఒప్పుకుంటుందా?" అన్నాడు క్రాంతిబాబు, రఘు ఎన్నడూ చూడని ఉద్వేగంతో.

"చాలా తీవ్రంగా ఆలోచిస్తున్నా వన్నమాట! ఈ సిరిసంపదలమధ్య ఆలోచించటం మానేస్తావేమో అను కున్నాను."

"లేదు రఘూ! మెదడును ఆలోచించ నీయకుండా వుండాలంటే, పసితనం నుంచీ మెదడుకు అలాంటి తర్ఫీదు యివ్వాలి. ఆలోచించడానికి అలవాటైన మెదడు ఆగదూ, మానదు."

"నీ మాటలు వింటూంటే నాకు చాల గర్వంగావుంది క్రాంతీ!నిన్నుపిహెచ్.డి. చేయమని సలహా యిచ్చాను. అంత కంటె పెద్దపనే చేస్తున్నావు. సర్దాగా నీతో కాలక్షేపం చేద్దామని వచ్చాను. నేనెన్నడూ నీదగ్గర ఇన్ని విషయాలు తెల్సుకోగలనని వూహించనన్ని విష యాలు తెల్సుకొని వెళుతున్నాను, వస్తాను."

"ఆగురఘు! డబ్బుతీసుకో! విదే శాలకు వెళ్ళి చదవటానికి ప్రయత్నం చేయి మన దేశంలోనే వుండి మన దేశాన్ని చూస్తే ఒకలా కనబడుతుంది. విదేశం వెళ్ళి, ఆ దేశాన్ని చూసి, తిరిగి మనదేశానికి వస్తే మరోలా కనబడు తుంది," అని చెప్పి, రఘూకు కొంత డబ్బు యిచ్చాడు క్రాంతిబాబు

"ప్రస్తుతానికి యీడబ్బు తీసుకెళ్ళు" అన్నాడు. "మరోమాట! నువ్వుమద్రాసు వెళతానన్నావు. ఎలాగూ వెళ్ళాలి. అక్కడ మనతో కల్సి చదువుకున్న భారతి నీకు కనిపించవచ్చు. కనిపించక పోయినా వెతికి కల్సుకో. నా పరిస్థితి చెప్పు నా మానసికస్థితి వివరించు. నేనుకాస్త స్థిమితపడగానే వచ్చి తప్ప కుండా కలుస్తానన్నానని చెప్పు. నువ్వ నిజంగా విదేశాలకు వెళితే, ఈ దేశంలో ఇక నాకు మిగిలిన ఒకేఒక వ్యక్తి భారతే!" అన్నాడు క్రాంతిబాబు.

వెళ్ళొస్తానని చెప్పి రఘు వెళ్ళి పోయాడు.

క్రాంతిబాబు ఏకాంతంగా తనగదిలో కూర్చున్నాడు.

చీకటి పడింది.

దీపాలు వెలిగాయి—కాంచన కుటీరంలో. (సశేషం)

Printed and Published by A. Chandra Sekhar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor: A. SUDHAKARA RAO





# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి కోల్గేట్. ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది

మీ పళ్ళలో మిగిలిపోయే అహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది, అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే :



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన అహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకువెళ్ళి హానికరమైన అహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకము దంతక్షయంనుండి రక్షణ.

హాయిసిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువ మంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్నా ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!




ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.

అమృతాంజన్
లిమిటెడ్‌వారి
విశిష్టమైన

# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తూంది:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము

OBM 3270/3 TG-RR

